# చతుర

డిశంబర్ 1979

సంపుటి : 2 సంచిక : 11

## ఈ నెల సమగ్ర నవల

ప్రేమ, అభిమానం, ఈర్ష్య, ద్వేషం, కోరిక, తాపం అన్నీ వున్న ఆ మామూలు మనిషి రాక్షసుడి లాంటి తండ్రిని కాదని ప్రేమించిన యువతిని పెళ్ళి చేసుకొన్నాడు. అయితే త్వరలోనే వారి జీవితంలో మల్లెపూలు, మంచి గంధ సుమ సౌరభాలూ పోయి, మండుటెండలు, ఆరని అగ్ని హోమాలూ ఎలా రేగాయి? ఆమె ఆఫీసరయి, అతను క్లర్కుగానే ఉండిపోవటం అతని సగటు మగ మనసు పై —

# అహం

దెబ్బ తీసిందా? లేకుంటే ప్రేమించి పెళ్ళాడిన మనిషితో క్రూరంగా, కష్టగా, కర్కశంగా ప్రవర్తించే స్థితికి ఎలా దిగజారాడు. వాటిని ఆమె ఎలా ఎదుర్కొంది?

## చెళ్లూరి సీతారాజేశ్వరరావు

'అహం' ఈ నెల 'చతుర' సమగ్ర నవల.

# రచయితలకు సూచనలు

* 'చతుర'లో ప్రచురణార్థం పంపే నవలలు అచ్చులో 100 పేజీలకు సరిపడేవిగా ఉండాలి. 'చతుర'లో అచ్చులో పేజీకి సుమారుగా 260 పదాలు వస్తుంటాయి. ఈ లెక్క ప్రకారం సరిచూసుకున్న తర్వాతనే నవలలు పంపటం మంచిది.

* ప్రస్తుతం వివిధ మాసపత్రికలు వెలువరిస్తున్న 100-112 పేజీల పాకెట్ సైజు నవలానుబంధాలలో ప్రచురితమవుతూన్న నవలికలు చతురలో అచ్చులో 60-70 పేజీలు మాత్రమే అవుతాయి. రచయితలు ఈ తేడా గమనించాలి.

* పై పరిమితులను దృష్టిలో ఉంచుకుని 'చతుర' కొరకై ప్రత్యేకంగా వ్రాసి పంపిన నవలలు మాత్రమే పరిశీలింపబడుతాయి.

* ప్రచురణకై ఎన్నిక కాని నవలలను తిప్పి పంపేందుకై నవలతో పాటే తగు పోస్టేజీ తప్పనిసరిగా జతపరచాలి. అలా జతపరచని పక్షంలోనూ, నవలలు పోస్టులోగానీ ఇతరత్రాగానీ పోయినా మా బాధ్యత ఉండదు.

* 'చతుర'లో ప్రచురించే నవలలకు పారితోషికం రచనను బట్టి రు. 1,000 నుండి రు. 2,000 వరకూ ఉండగలదు. ఈ విషయంలో సంపాదకులదే తుది నిర్ణయం.

* * *

ముఖపత్రం: కొండపల్లి బొమ్మలు—ఫోటో: గీతాదత్త

రెండవ కవరు: యక్షిణి, మూడవ కవరు: మహావిష్ణువు,

ఖజురహో శిల్పాలు— ఫోటోలు

సూరజ్ ఎస్. శర్మ

# 70 ఏళ్ళ గర్భిణీ

డెబ్భై ఏళ్లుగా పొట్టలో తెలీకుండా ఉన్న ఓ పిండాన్ని 83 ఏళ్ళ స్త్రీ పొట్ట నుండి ఆపరేషన్ చేసి బయటకు తీశారు. ఇది టెక్సాస్‌లో జరిగింది. దీన్ని పరిశోధన నిమిత్తం టెక్సాస్‌లోని టెక్నికల్ స్కూల్ ఆఫ్ మెడిసిన్‌కు పంపారు.

కడుపు నెప్పి, వాంతుల కోసం మందు తీసుకోడానికై ఆ స్త్రీ హాస్పిటల్‌కు వచ్చింది. ఎక్సరే తీసి చూస్తే కడుపులో పిండం ఉన్న విషయం బయట పడింది.

మూడు నెలలు ఎదిగి 4 అంగుళాల నిడివి ఉన్న పిండం అది. పిల్లలు లేక ఆమె ఒక పిల్లవాణ్ని దత్తత చేసుకుంది. అతను చెప్పిన దాని ప్రకారం ఆ స్త్రీకి జీవిత కాలంలో ఎప్పుడూ బహిష్టరాలేదు.



ఐదారుసార్లు హాస్పిటల్‌లో వైద్యం తీసుకుంది గాని ఒక్కసారి కూడా ఎక్సరే తీయలేదు.

బహుశా ఆ స్త్రీకి 12, 13 ఏళ్ళ వయసులో గర్భం వచ్చి, అప్పటినుంచి తాను గర్భవతిననే భావంతో ఏడు దశాబ్దాలు గడపగలిగింది అంటారు డాక్టర్లు. పిండం ఉండవలసిన చోటులో లేకుండా పొట్టలో ఉండటం మరీ విచిత్రం అని డాక్టర్లు ఆశ్చర్యపోతున్నారు. పొట్టలో చేరిన ఆ పిండం చుట్టు ఒక పొర ఏర్పడి ఉండటం, బయటకి వలన వచ్చే అవకాశం లేక పోయిందట.

# కుబేరులు

అరబ్ షేక్‌లు తమ రాష్ట్రంలో అడుగు పెడితే చాలు కనకవర్షం కురుస్తుందని కలలు కంటున్నారు చాలామంది. అందుకోసం తమ రాష్ట్రానికి విచ్చేసే అరబ్ కుబేరుల పాదాలు కందకుండా పట్టు తివాసీలు పరిపించే ప్రయత్నాల్లో ఉన్నారు కూడా.

పశ్చిమ బెంగాల్‌కి, అరబ్ దేశాలకి మధ్య స్నేహ సంబంధాల్ని పెంపొందించడానిగ్గాను ఒక సంఘం రూపొందింది. బొంబాయిలో సదా కనీసం 10,000 మంది అరబ్ యాత్రికులుంటారు. వీరు ప్రతిరోజూ దాదాపు రెండు కోట్లు ఖర్చు చేసుంటారు. దానికి తోడు తమ దేశానికి వెళ్ళేటప్పుడు ఇక్కడినుండి నిరుద్యోగ శ్రామికులను తీసుకెళుతుంటారు.

అరబ్ యాత్రికులు ఎడారి ప్రాంతాల నుంచి వస్తారు గనుక పచ్చని ప్రకృతి దృశ్యాలనెక్కువగా ఇష్టపడతారు. బెంగాల్‌లో అందమైన పరిసరాలనేకం వున్నాయి. ఇక్కడి వర్ష ఋతువు చాలా ఆంపంగా వుండటమే గాక సముద్రం డార్జిలింగ్‌లో నింగిని తాకే పర్వతాలు చాలా ఆహ్లాదాన్ని కలిగిస్తాయంటారీ

సంఘ సభ్యులు.

కలకత్తా డాక్టర్లకి ప్రపంచంలో బాగా పేరుండటాన కూడా అనేక మంది అరబ్బులు వైద్య చికిత్స కోసం వస్తారు.

ఇలా వచ్చే అరబ్ యాత్రికుల సౌకర్యార్థం అరబ్ దేశాల నుండి బొంబాయి వరకూ వున్న తక్కువ ఛార్జీల సౌకర్యాన్ని కలకత్తా వరకూ పెంచమని వీరు ప్రభుత్వాన్ని కోరారు.



అరబ్ పాత్రికేయులను పశ్చిమ బెంగాల్‌ను దర్శించవలసిందిగా ఆహ్వానించాలనీ, ఆ విధంగా కలకత్తాను అరబ్బుల దృష్టిలోకి తేవాలనీ వారు కోరారు.

ఈ సంఘం రాష్ట్ర ప్రభుత్వానికి కూడా— అరబ్ వార్తా పత్రికలలో ప్రకటనలు చేయడం, రాష్ట్రంలోని ప్రకృతి దృశ్యాలను ఆ అరబిక్ కామెంటరీతో డాక్యుమెంటరీ ఫిల్మ్‌గా తీయడం, అరబిక్ భాష తెలిసిన గైడ్లని నియమించడం లాంటి పనుల వలన అరబ్ యాత్రికుల నెక్కువగా ఆకర్షించవచ్చని సూచనలిచ్చింది.

కలకత్తాలోని ఒక హోటల్‌వారు ఆ హోటల్ పనివారూ, గైడ్లూ, షాపుల్లోని ఉద్యోగుల సౌకర్యార్థం అరబిక్ తరగతులను ప్రారంభిస్తున్నామని ఓ బోర్డ్ కూడా కట్టారు.

# నిత్య వెలుగు

థామస్ అల్వా ఎడిసన్ ఎలక్ట్రిక్ బల్బ్ కనుక్కొన్న 20 సంవత్సరాల తర్వాత, 1901లో అమెరికాలోని కాలిఫోర్నియా రాష్ట్రంలో వున్న లివర్‌మోర్ ఫైర్ డిపార్ట్‌మెంటులో ఓ బల్బ్ పెట్టారు. 78 సంవత్సరాలయినా ఆ బల్బ్ ఇంకా ఈ రోజుకీ వెలుగుతూనే వుంది. అతి కొద్దిసార్లు మాత్రమే అది ఆరిపోయింది విద్యుచ్ఛక్తి సరఫరా లోపం వల్ల. ఈ రోజుల్లో తయారుచేసే



బల్బ్ అయినట్లయితే, 852 సార్లు మాడిపోయిన వాటి స్థానంలో కొత్త బల్బులు అమర్చి వుంచాల్సి వచ్చేది. ఈ బల్బుని షెల్బీ ఎలక్ట్రిక్ కంపెనీ తయారుచేసింది. ఆ కంపెనీ బల్బులు కొన్నవాళ్లు మళ్ళీ కొత్త బల్బులు కొనాల్సిన అవసరం లేదు.





# మాయా బజార్

కొత్త కాపురాలు పెట్టి అన్ని వస్తువులూ ఒక్కసారే కొనలేకపోయినా, సంగీతాభిమానులై అన్ని రికార్డ్స్, కేసెట్స్ ఎక్కడ కొనగలం అనుకుంటున్నా, విదేశీ మిషన్లకు స్పేర్ పార్ట్స్ కావాలన్నా దిగులు పడనవసరం లేదు. ఇలాంటివారికి కల్పతరువు ఢిల్లీలోని బజారీ బజార్. ఇది ప్రతి ఆదివారం వుంటుంది. ఇంటర్ స్టేట్ బస్ టెర్మినస్ సమీపంలో ఢిల్లీ రింగ్ రోడ్ పొడవునా పేవ్‌మెంట్ పక్కనే పరచి వుంటాయి ఇవి. ఇది 1947లో ప్రారంభించారంటారు. ఈ వస్తువు లమ్మేవారు ఇంటింటికీ, ముఖ్యంగా విదేశీయుల ఇళ్ళకి వెళ్ళి వాళ్ళు పనికి రావనుకొని అమ్మేసే వస్తువులను కొని



ఇక్కడ లాభాలకి అమ్ముతుంటారు. వీరు చాలా తక్కువ ధరకి కొని మార్కెట్ రేటులో సగం ధరకి అమ్మి కూడా లాభాలు కొట్టేస్తుంటారు. ఇంచుమించు ఓ సూపర్ బజార్ లాంటిదిది......

# వేడి వేడి స్నానాలు

ఐస్‌లేండ్‌లో వున్న ఓ అగ్నిపర్వత ప్రాంతం చుట్టుపక్కల వున్న నీటి వూటలలోని నీరు చల్లగా వుండదు. సలసల మరుగుతూంటుంది. 500 డిగ్రీల




ఫారెన్‌హీట్ వేడి కలిగి వుంటుందా నీరు. ఆ నీటి వేడిని ఐస్‌లేండ్ రాజధానిలోని ఇళ్ళు వెచ్చగా వుండటానికి వుపయోగిస్తున్నారు. ఆ నీటి వేడిని సెంట్రల్ హీటింగ్ సిస్టం స్టేషన్‌కి రవాణా చేసి ఆ స్టేషన్‌నించి ఇళ్ళలోని రూమ్‌హీటర్‌లకి సరఫరా చేస్తున్నారు. ఎలక్ట్రిసిటీ ద్వారా ఇళ్ళు వెచ్చగా వుండడానికి అయ్యే ఖర్చులో నాలుగవ వంతే అవుతుంది. ఈ పద్ధతి వల్ల స్విమ్మింగ్ పూల్స్‌లోని నీటిని కూడా వేడి చేస్తున్నారలాగే!

## డ్రాగన్ ఆఫ్ కమాడో

డ్రాగన్ ఆఫ్ కమాడో అని పిలవబడే ఓ రాకాసి బల్లిని ఇండోనేషియాలోని కోమోడో ద్వీపాల్లో కనుగొన్నారు. 1912 సంవత్సరంలో దీన్ని కనుగొనే వరకూ ఎన్నో యుగాల నుండీ అక్కడ జీవిస్తోంది. అయితే 1912 సం॥లో కను గొనేవరకూ ఈ జాతి అంటూ ఒకటి వుందని ఎవరూ ఊహించలేదసలు. ఈ ద్వీపాలలోని జంతువులు ఏమేమి వున్నాయో కనుక్కోడానికి కొందరు వెళ్ళి చాటుగా వుండి చనిపోయిన పందులను ఆరుబయట వదిలేసి ఏమేం జంతువులు వస్తాయో చూస్తుండేవారు. అప్పుడే ఈ రాకాసి బల్లులు వచ్చి ఎముకలతో సహా



ఫలహారం చేశాయట. వీటిని చూసి మనుషులు భయపడినట్లే వీటికి కూడా మనుషులంటే భయం. 10 అడుగుల ఎత్తు పెరుగుతాయి. గరుకుగా, పొగాకు రంగు చర్మం కలిగి వుంటాయి. ఇవి కూడా నేల మీదే గుడ్లు పెట్టి 10 నెలల్లో పొదుగుతాయి. ఇసుక ప్రాంతాల్లో నివసించే ఈ ప్రాణి రాత్రుల్లు బొరియల్లో గాని, చెట్ల వేళ్ళ మధ్యగాని నిద్రిస్తుంటుంది.

## కన్నెచెర

జపాన్ దేశంలో వివాహం నిర్ణయించబడటానికి, డాక్టర్ నించి పెళ్ళికూతురు అంతకు మునుపు ఆమె పర పురుషుడితో



శయనించలేదనే సర్టిఫికెట్ కాబోయే అత్తమామలకి ఇవ్వాల్సి వుంటుంది. టోక్యోలో కొందరు ప్లాస్టిక్ సర్జన్స్ చిరిగిపోయిన కన్నె పొర స్థానంలో కొత్త కన్నె పొరని ఆపరేషన్ చేసి అతికిస్తున్నారు. ఒకో డాక్టర్ సంవత్సరానికి అలాంటి ఆపరేషన్లు కొన్ని వందలు చేస్తున్నారు.

ఇందువల్ల భర్తతో జరిగే తొలి సంగమంలో అతనికి భార్యమీద పరిపూర్ణ నమ్మకం ఏర్పడుతుందని వాళ్ళ వుద్దేశం.

# తాబేలు రక్షణ

దక్షిణ కొరియాకి చెందిన ఓ వ్యక్తి తన పడవలోంచి సముద్రంలోకి జారిపడ్డాడు. 15 గంటలు సముద్రంలో ఈదుతూ గడిపాడు. ప్రాణాల మీద ఆశ వదులు కున్నాడుకూడా. ఇంతలో దేముడు పంపించి నట్లుగా వచ్చిన ఓ పెద్ద తాబేలు వీపు మీదకెక్కి 153 కిలోమీటర్ల ప్రయాణం చేశాడు. తాబేలు మధ్యలో ఒక్కసారి



నీళ్ళలో మునిగినా అతను తపిమనేవాడు. ఓ స్వీడిష్ ఓడలోని మనుషులు అతన్ని చూసి తమ ఓడలోకి తీసుకెళ్ళారు!

# లిప్‌స్టిక్ మంచిదే

డాక్టర్ బ్రయాన్ ముద్దుపెట్టుకోవడం ద్వారా ఆరోగ్యం దెబ్బ తింటుందా అనే విషయం గురించి పరిశోధన చేస్తూ, కొంతమంది చేత గాజు ముక్కలమీద ముద్దు పెట్టించి, వాటిమీద సూక్ష్మక్రిము లున్నాయా అని మైక్రోస్కోప్‌తో పరీక్షించగా 2 నుంచి 250 దాకా సూక్ష్మ క్రిములు కనబడ్డాయి. అయితే వాటిలో 95 శాతం హానికరం కావు. 10 సెకన్ల కాలం ముద్దు పెట్టుకుంటే పర్వాలేదుగానీ అంతకు మించితే ఎక్కువ సూక్ష్మ క్రిములు అంటుకునే ప్రమాదం ఉందిట. అయితే ఆడవాళ్ళు వుపయోగించే లిప్‌స్టిక్‌లో వుండే ఏంటిసెప్టిక్ వల్ల చాలా సూక్ష్మక్రిములు మరణిస్తాయిట.

# పురుగుల హాబీ

టోక్యోలో చిన్న చిన్న పురుగులని అమ్మే వ్యాపారం జోరుగా సాగుతోంది. కుక్కనో, పిల్లినో పెంచుకునేందుకు సరిపడ చోటు వుండదు ప్రపంచంలోని పెద్ద



పట్టణమయిన టోక్యో ఇళ్ళల్లో. అందుకని వాటికి బదులు పురుగులని పెంచుతు న్నారు. ఒక పురుగు ఖరీదు 4 నుంచి 23 రూపాయలదాకా వుంటుంది.

—చెల్లూరి సీతారాజేశ్వరరావు

# అహం



న్యూ కాలనీలో సిటీబస్సు ఆగింది.

బస్సు నిండా జనమే. సారధి మధ్యలో వున్నాడేమో అందరూ దిగే దాక ఆగవల్సి వచ్చింది. ఎక్కేవారు కూడా పూర్తిగా దిగనివ్వకుండా తోసుకు వస్తున్నారు. ఎవరి తాపత్రయం వారిది. సారధి యుద్ధంచేసే వీరుడిలా కాళ్లు చేతులు ఆడించి మొత్తానికి దిగాడు.

సారధి టైం చూశాడు. ఆరవుతోంది. ఎదురుగావున్న కిళ్ళీబడ్డీలో సోడా తాగి, సిగరెట్ వెలిగించి పక్క సందులోకి తిరిగాడు. చొరవగా వీధి చివరి నీలం డాబాలోకి వెళ్లాడు.

కుక్క భౌ మంటూ మీదికి రాబోయింది. సారధి కంగారుపడి గేటు మూశాడు. వరండాలో బంతి ఆడుకుంటున్న పంజాబీ అమ్మాయి హిందీలో అడిగింది ఎవరు కావాలని?

"కె. బాలాజీ"

"సారీ!"

సారధి డాబాకేసి చూశాడు. ప్రొద్దుట తను వచ్చిందికాదు. పోర్టికోల్లో రెండు కొబ్బరిచెట్లు ద్వారపాలకుల్లా వున్నాయి. ఇక్కడ లేవు.

తిరిగి సారధి రోడ్లు కొలవసాగాడు. బాలాజీ యింటి గుర్తులు జ్ఞాపకం రావడం లేదు. మరో రెండు సందులు తిరిగినా ఫలితం లేకపోయింది.

సారధికి విశాఖ కొత్త. ప్రొద్దుట ఆఫీసు కంగారులో అడ్రస్ నిదానంగా తెలుసుకోలేదు. కొంత గుర్తు పెట్టుకున్నా మరిచిపోయాడు.

దీపాలు వెలుగుతున్నాయి.

బాలాజీ అడ్రస్ దొరక్కపోతే ఏం చేయాలి?

తిరగడం వల్ల కాళ్ళు పీకి, ఓ కిళ్ళీ బడ్డీ పక్క బెంచీమీద కూర్చుండుకు రుమాలుతో తుడిచాడు. మరో సిగరెట్ వెలిగించి దిక్కులు చూడసాగాడు.

క్యారేజీలను తట్టలో పెట్టుకొని ఓ నడివయస్కుడు అటు వచ్చాడు. సారధి అతన్ని అడిగాడు-బాలాజి గది గూర్చి.

పేరు చెబితే తెలియదని, మనిషిని వర్ణించి చెప్పి "నీలం డాబా, కొండ పక్కన వుంది రెండు కొబ్బరిచెట్లు" గుర్తులు చెప్పాడు.

"ఆయనా బాబూ! రండి ఆడకే క్యారేజీ యిచ్చిరాడానికి పోతున్నాను" అంటూ దారి తీశాడు.

సారధి అతణ్ని అనుసరించాడు. క్యారేజీలవాడు నిలువుగా పోయి పక్క సందులోని రెండో డాబాలోకి దారితీశాడు. తలుపులు దగ్గరగా వేసివున్నాయి. మేడ మీద బాలాజీ కంఠం వినగానే ధైర్యం వచ్చింది సారధికి.

క్యారేజీలవాడు క్యారేజీ లోపలపెట్టి వెళ్ళిపోయాడు.

లోపల పేకాట సాగిపోతోంది. బాలాజీ ఆడుతూనే పలకరించాడు. సారధి పక్కనున్న హోల్డాల్‌పై కూర్చుని ఆట చూడసాగాడు కాలక్షేపం కోసం.

"మీరు కూడా రండి" కేశవ ఆహ్వానించాడు.

"మా వాడో మహర్షిలెండి. పేక ముక్కలు తెలియని అజ్ఞాని" బాలాజీ చెప్పాడు.

సారధి, బాలాజీ ఒక వూరివారే. బాలాజీ యూనివర్సిటీలో రీసెర్చి చేస్తున్నాడు. సారధికి మధ్యే విశాఖ ట్రాన్స్‌ఫర్ అయింది. తను బయలుదేరుతూ బాలాజీకి వైర్ యిచ్చాడు. బాలాజీ

 

వుదయమే స్టేషన్‌కి వెళ్ళి రిసీవ్ చేసుకున్నాడు.

అయిదుగురు వున్న పేకాట చూసి చూసి సారధికి విసుగు వచ్చింది. లేచి వెళ్ళి స్నానం చేశాడు. లుంగీ చుట్టుకుని డాబామీద కెళ్లాడు.

మడతమంచం వేసుకుని పడుకున్నాడు. చల్లటి గాలికి ఆహ్లాదంగా వుంది. కాని మనసు అలా లేదు.

కారణం? సామ్రాజ్యం కనిపించింది.

ఉదయం ఆఫీసు గదిలో జాయినింగ్ రిపోర్టు యిచ్చి బయట తన టేబిల్ దగ్గరకి వస్తుండగా కనిపించింది. సామ్రాజ్యందీ పక్క సీటే. అవునా, కాదా అని తను మీమాంస పడుతూండగా సామ్రాజ్యం ముఖం తప్పించుకుంది.

సామ్రాజ్యం యిక్కడ పని చేస్తోందా?

పలకరించినా మాట్లాడలేదు. ఆమె కోపం కూడా న్యాయమే! తను తప్పు చేశాడు. అది సామ్రాజ్యం యిక్కడ వారితో చెబితే...తన పరువుండదు.

సారధి గతంలోకి జారుకున్నాడు.

* * *

అనాడు...

సారధి రిషా దిగేసరికే ఇంటిముందర పెళ్ళి పందిరి వేసి వుంది. పాలేర్లు మామిడి తోరణాలు కడుతున్నారు. హాల్లో తల్లి ఎదురయింది.

"ఏరా ఇప్పటికా వచ్చావు! మీనాన్నే రావాలనుకుంటున్నారు''

"ఎందుకమ్మా!''

"ఎల్లుండి పెళ్ళి, రాకపోతే కంగారు కదట్రా" అంటూ మంచినీళ్ళిచ్చింది.

"సెలవు దొరకలేదమ్మా! నాకు ముందర కాఫీ ఇవ్వు" ప్రయాణపు అలసటతో ఈజీఛైర్‌లో వాలాడు.

దమయంతి లోపలకెళుతూ ''ఒరేయ్ నిద్రపోకు! అన్నంతిన్నాక పడుకుందువు గాని. కాఫీ పంపిస్తానాగు'' అంది.

ఇంటికి పెళ్ళి కళ వచ్చింది. కొత్త సున్నంతో గోడలు, రంగులతో గడపలు, తోరణాలతో ద్వారాలు ఆకర్షణీయంగా వున్నాయి. తాటాకు పందిళ్ళు వింతవాసన వేస్తున్నాయి. బంధువులు వచ్చి చేరుకుంటున్నారు.

"పెళ్ళికొడుకుకంటె మేమే ముందు వచ్చాం" కొంతమంది సారధిని హాస్యం చేశారు.

బంధువులని పల్కరించి, స్నానం చేశాడు. దమయంతి భోజనానికి పిలిచింది.

"నాన్నగారు ఏరమ్మా కనిపించలేదు" సారధి విస్తరిముందు కూర్చుంటూ అడిగాడు.

''బజారుకి వెళ్ళారేమో!"

సారధి భోజనం కాగానే మేడ ఎక్కాడు. మేడమీద రెండు గదులున్నాయి. ఒకదానిని సారధి వుపయోగించుకుంటాడు. రెండవది సామాన్లగది.

పత్రిక తిరగవేస్తూండగా నిద్ర ముంచుకు వచ్చింది. తల్లి లేపడంతో బద్ధకంగా లేచి కూర్చున్నాడు.

"రాఘవయ్య వచ్చాడ్రా"

''ఏ రాఘవయ్య?" చిటికలు వేస్తూ అడిగాడు.

"సామ్రాజ్యం తండ్రి."

సారధి వులిక్కిపడ్డాడు. పెళ్ళిముందర ఎందుకు వచ్చినట్లు?

"ఎందుకుట?''

"ఇప్పుడే వచ్చాడు. మీనాన్నగారితో వీధిలో మాట్లాడుతున్నాడు. నువ్వు కూడా

దగ్గరవుండు. ఎందుకయినా మంచిది" ఆవిడ కిందికి వెళ్ళిపోయింది.

సారథి చొక్కా వేసుకుని అరుగు మీదకి వచ్చాడు. రాఘవయ్య, దయానందం అతణ్ని సాదరంగా ఆహ్వానించారు.

కాఫీ, ఫలహారాలు వచ్చాయి.

"ముందరతీసుకో! ఆడపిల్లలతండ్రివి అలసిపోయివుంటావు" దయానందం జోక్ చేశారు.

"మీ అలసటే నాకు ఆనందం కదా!"

"కాదుమరీ. కన్యర పెత్తనం చాలా సుఖం."

"మనం వాళ్ళకన్నా హితులం. వియ్యం పడి హోదా అప్పుడే చూపెట్టకు."

కాలక్షేపం సంభాషణ జరుగుతోంది. దయానందం పైకి నవ్వుతున్నా లోతుగా ఆలోచిస్తున్నాడు. రాఘవయ్య రాకకి ప్రత్యేక కారణముంటుంది.

రాఘవయ్య వచ్చిన పని చెప్పాడు. కట్నం సొమ్ము సరిపడలేదు.

దయానందంలో మార్పు వచ్చింది. హాస్యం బదులు గాంభీర్యం ముఖంలో తొంగి చూసింది.

"అయితే ఏం చేదాం?"

"ముహూర్తం కానిస్తే... తర్వాత సర్దుబాటు చేస్తాను."

దయానందం ఏం మాట్లాడలేదు. రాఘవయ్య డబ్బు కోసం ఎన్ని పాట్లు పడిందీ చెబుతున్నాడు. సారథి వింటున్నా మాట్లాడలేదు.

"నువ్వు కాదనవనే ధైర్యంతో వచ్చాను దయానందం."

నేతి బీరకాయలో నేయిలాగ దయానందంలో 'దయ' కూడా అంతే. అతడి చుట్టూ రూపాయిలుంటాయి. వాటిచేత వడ్డీ వ్యాపారమనే సర్కస్ చేయిస్తాడు. ఆ రూపాయిలు అలా అలా పెరిగిపోతూంటే అతడికి మహానందం!

మనుషుల కంటె డబ్బుకే విలువ ఎక్కువ దయానందం దృష్టిలో. డబ్బు దగ్గర భార్యనే నమ్మడు. తను ఎందుకున్న జీవిత విధానం, తన వ్యక్తిత్వానికి సరిపడ్డ సొంత విధానమని, అదే తనని అందరి కంటె ఎత్తులో వుంచిందని అతడినమ్మకం.

డబ్బు తన దగ్గర వుంది. కట్టె వంకర పొయ్యి తీర్చినట్టు అన్నిలోపాలూ డబ్బే సరిచేస్తుంది.

ఈ వార్త ఇంట్లో వారందరికీ తెల్సిపోయింది. దమయంతి గుమ్మంలో మిగతా ఆడవాళ్లు కిటికీల దగ్గర నిలబడి చూస్తున్నారు. బంధువులు కొంతమంది దయానందం కుర్చీదగ్గర నిలబడివున్నారు.

ఇంతమంది కుతూహలంగా తనని గమనించడం దయానందానికి గర్వం వేసింది.

"నాసంగతి నీకు బాగా తెల్సివుండాలి. నేను ఎలాంటివాణ్ని రాఘవా?"

"కచ్చితమైన మనిషివి"

"రెండు రెళ్లు ఎంత?"

"నాలుగు..."

"డబ్బుదగ్గర నా పాలసీ కూడ అలాగే వుంటుంది."

"నాయిబ్బంది కూడా..." రాఘవయ్య నసిగాడు.

"నా సంగతి తెల్సికూడా నువ్వు కట్నం సొమ్ము పట్టుకు రాకుండా వున్నావంటే ఏమనుకోవాలి? నువ్వు తరువాత లక్ష యిచ్చినా ఈ వేడుక వస్తుందా? కట్నం ముందుగానే యివ్వడం ఒక గౌరవం. ఒక మర్యాద. ఒక సంప్రదాయం."

దయానందం మాట్లాడటం కూడా ఒక

విలక్షణమైన పద్ధతి. మనుషుల ముఖాల్లోకి తొంగి చూస్తూ, దీర్ఘాలు తీస్తూ నానుస్తూ మాట్లాడతాడు. అవతలివారు ఎలాంటి వారయినా అతడికి అనవసరం. ఎక్కువగా అతడి అవసరమున్నవాళ్ళే వస్తారు గనుక ఆ ధోరణి భరించుకుంటారు.

''అవాంతరం అలా వచ్చింది దయానందం. లేకపోతే నిన్ను అవస్థ పెట్టను. ఒక నెల రోజుల్లో అన్నమాట నిలబెట్టుకుంటాను. మనం చిన్ననాటి మిత్రులం. నిన్ను అడగడానికి నాకాహక్కు వుంది" స్నేహంగా అన్నాడు రాఘవయ్య.

''తెలుసున్నవాళ్ళం కనుకనే మరింత జాగ్రత్తగా వుండాలి.''

''నిజమే!కాని అలావచ్చింది పరిస్థితి''

"భరించాలి మరి.''

"అంటే..."

''పెళ్ళి ఆగిపోతుంది."

"దయానందం!" బిగ్గరగా అరిచాడు రాఘవయ్య, తనను తాను మరచిపోయి.

''నాకు చెముడు లేదోయ్!'' దయానందం విసుక్కున్నాడు.

''నా ఆందోళన నీకు అర్థం కావడం లేదు."

గణపతి మధ్యగా వచ్చి "మా బావ అన్నమాట దిగడనుకోండి. ఒకేమాట రామబాణంలా'' మెహర్బానీగా అన్నాడు.

అతడు దయానందానికి దూరపు బంధువు. ఏడుపదులు దాటుతూవుంటాయి. ఎక్కడ శుభాశుభాలు జరిగినా పిలవకుండా హాజరవుతాడు. తిరిగి వెళ్ళమనేదాకా ప్రయాణం మాట తలపెట్టడు. భార్య పోయినప్పటినుంచీ బంధువుల పైనే బ్రతుకుతున్నాడు.

''అలా చెప్పు గణపా'' దయానందం గర్వంగా అన్నాడు.

గణపతి వ్యవహార్తలా తలదూర్చడం సారధి కిష్టం లేకపోయింది. "నువ్వు లోపలకి పో!" గణపతిని గద్దించాడు.

గణపతి వెర్రిగా నవ్వి పక్కకి తప్పుకున్నాడు.

"దయానందం! పెళ్ళి ఆగిపోతే ఎందుకు ఆగిందని నిన్ను ఎవరూ నిలేసి అడగరు. నువ్వు మగవాడి తండ్రివి. కాని నన్ను కాకుల్లా పొడుస్తారు జనం. అభాండాలు వేస్తారు. ఇంటా బయటా అశాంతి. నన్నీ గండంనుంచి దాటించు" రాఘవయ్య వచ్చి చేతులు పట్టుకున్నాడు.

దయానందం విదిలించి ఎడముఖం పెట్టాడు. "ఎందుకీ మాటలు. డబ్బు దొరకగానే కనిపించు. అప్పుడే పెట్టుకుందాం ముహూర్తాలు."

''అది నీకుమాత్రం గౌరవమా?''

"నీ గౌరవము నువ్వు చూసుకో చాలు"

''నువ్వు ఆవేశపడితే నేనేం చెప్పలేను''

"ఏం చెప్పక్కర్లేదు సొమ్ము వుంటే."

"దానికే వ్యవధి అడుగుతున్నాను.''

''ఆ పని నేను చెయ్యను. పెళ్ళయ్యాక నువ్వు డబ్బు సరిపెడతావనుకోవడం భ్రమ. మా చవట నీ గుమ్మంలో వుంటాడని నీ ధైర్యం"

"అన్యాయంగా మాట్లాడకు."

దయానందం కుర్చీలోనుంచి విసురుగా లేచాడు "అన్నమాట తప్పడం అన్యాయం కాదు. నేను మాట్లాడటం అన్యాయం. అవునా రాఘవయ్యా! ఇప్పటిదాకా నేనే విషయంలోను రెండోసారి నిర్ణయం తీసుకోలేదు.''

"మనస్నేహం గుర్తుపెట్టుకోదయా! నీ డబ్బు నేనేం ఎగవెయ్యను. సర్దుబాటు

కాగానే తెచ్చియిస్తాను. నన్నునమ్ము."

"డబ్బుదగ్గర నాకు నమ్మకాలుండవు. కట్నం సొమ్ము సరిపెట్టలేనపుడు నువ్వేం మాట్లాడినా వృథా! పెళ్ళి జరగదు."

"ఎంతతేలికగా అంటున్నావు ఆ మాట"

రాఘవయ్య ఖిన్నుడయ్యాడు. కాస్సే పేం మాట్లాడలేకపోయాడు. దయానందాన్ని ఒప్పించడం అసంభవమని తెల్సిపోయింది.

సారథిమీద పడింది అతడి దృష్టి.

"విన్నావుగా బాబూ అంతా! ఏమంటావు?" రాఘవయ్యడిగాడు–

సారథికి ఏం మాట్లాడాలో తోచ లేదు. తండ్రి తనకేసి వురిమి చూస్తున్నాడు ! ఇవతల రాఘవయ్య శ్రావణ మేఘంలా !

"నీ నిర్ణయం కూడా చెప్పవల్సిన సమయం వచ్చింది బాబూ. డబ్బు ఎప్పుడైనా సర్దుబాటు చేసుకోవచ్చును. ఈ పరిస్థితి తిరిగి వస్తుందా! నా కోసం మీ అత్తయ్య, సామ్రాజ్యం ఆశగా ఎదురు చూస్తుంటారు. వారికేం చెప్పను."

సారథిలో చలనం ప్రారంభమైంది. మనోవీధిలో సామ్రాజ్యం కనుపించింది. ఆమె భారంగా వుంది. తండ్రిద్వారా పెళ్ళి చెడిపోయిందని తెల్సి ఏడుస్తోంది–

నో... సామ్రాజ్యం ఏడ్వ కూడదు. తనవల్ల ఏడ్వకూడదు.

తన ముందు కొడుకుతో రాఘవయ్య మాట్లాడటంతో దయానందం కోపం పెరిగిపోయింది. "ఇదిగో పెళ్లి పెద్దని నేను, వాడుకాదు. నువ్వేం మాట్లాడినా నాతోనే మాట్లాడాలి."

"నీతో ఏంచెప్పినా లాభంలేకపోయింది దయానందం. నీకు డబ్బుకావాలి. ప్రస్తుతం నా దగ్గరది లేదు. అన్నిరకాలుగా లేదనిపించుకునే నిన్ను అర్థించడానికి వచ్చాను. స్నేహ ధర్మంతో దయ చూపిస్తావను కొన్నాను. నాకా అదృష్టం లేదు. నీ కొడుకు అభిప్రాయం కూడా తెల్సుకుందామని అడిగాను."

రాఘవయ్య దైన్య సంభాషణం నలుగుర్నీ చలింపచేసింది, కాని దయానందంలో ఏ మార్పూ రాలేదు, "వాడి అభిప్రాయం వల్ల ఒరిగేదేముంది?" అన్నాడు

"ఆశపడతాం కదా!"

"నా అభిప్రాయమే మా వాడి అభిప్రాయం"

"చెప్పుసారథీ! నా పరువు, సామ్రాజ్యం బ్రతుకు నీ చేతిలో ఉన్నాయి."

మూగనోమువల్ల ఉపయోగం లేదని గ్రహించాడు. గుమ్మంలోని తల్లిని చూశాడు. ఆమె సైగచేసింది.

పెళ్ళి ఆగడం సుతారామూ యిష్టం లేదు ఆమెకి.

"డబ్బు వాయిదా అడిగారుకాని, ఇవ్వ ననడం లేదా కదా నాన్నగారూ! ముహూర్తం కానిస్తే..."

సారథి ఆగకుండానే అందుకున్నాడు దయానందం "మన ముఖం చూడడు వాడు యిక. కుర్రకుంకా! ఈ ఎత్తులు నీకేం తెల్సురా? నోర్ముయ్!"

"మరోసారి ప్రశాంతంగా ఆలోచించండి."

"కోటిసార్లు ఆలోచించినా అదేనిర్ణయం నాది. నువ్వు నోర్ముయ్యరా! నేను కాదని చెప్పాక నువ్వు తిరగవేస్తావేం?"

దయానందం మండిపడ్డాడు. ఎదురు సహించలేని మనిషి అతను.

"పెళ్లి ఆగిపోతే మనకి బాధే కదా ! ఇంతఖర్చు మరొకసారి మనం చెయ్యా

లంటే ఎంత కష్టం!" సారథి తండ్రి యొక్క నాడి పట్టుకున్నాడు, తండ్రి లోభి గుణం యిక్కడ ఉపయోగించదా అని.

దయానందం తేలికగా పెదవి విరిచాడు. "జరిగిన అభావానికి పూర్తిబాధ్యత రాఘవయ్యది. మరో రెండువేలు ఎక్కువ ఇచ్చుకుంటాడు. మనకేం నష్టం? అప్పుడే జరుగుతుంది పెళ్లి?"

"నీకంతా డబ్బురంధి మర్యాదలక్కర్లేదు" రాఘవయ్య చిరాకుగా అన్నాడు. ఈ దశలో అతడికి తెగింపు వచ్చింది.

"అవును నేనుడబ్బు మనిషినే మర్యాద, మన్నూ నాకొద్దు"

సారథికి ఇది కొత్త అనుభవం. మధ్యవర్తిగా తీర్పుచెప్పడం కష్టంగానే వుంది. రెండూ విజాతి ధృవాలు. ఇరు పక్షాలని సంతృప్తిపరచడం ఎలా? తనకు రాఘవయ్యమీద సానుభూతి వుంది. ఈ పెళ్ళి ఆగిపోతే ఎంత అవస్థ పడతాడో తనకి తెలియంది కాదు. ఇటు తండ్రి అతని పద్ధతులు పూర్తిగా నచ్చకున్నా బాహాటంగా ఎదిరించ డానికి మనసు ఒప్పుకోలేదు.

నిజంగా అది త్రిశంకు స్వర్గం.

దయానందం కొడుకుకేసి అప్రసన్నంగా చూశాడు. "ఈ పెళ్ళి జరిగి తీరాలని నీకు పట్టుదలగా వుందేమిట్రా?"

"నాన్నగారూ!"

"వేధవ్వేషాలు వెయ్యకు. నాసమ్మతి లేకుండా చేసుకుంటే రేపు నీ పరిస్థితి ఆలోచించుకో. నువ్వింక దయానందం కొడుకువే కాదు."

"నాగురించి తండ్రీకొడుకులుపోట్లాడుకోవద్దు. ఇది నాదురదృష్టం. సెలవు తీసుకుంటాను" రాఘవయ్య లేచాడు.

"మీరోసారి లోపలికి రండి" దమయంతి పిలిచింది.

"ఆడంగి సలహాలు వినే ఖర్మ యింకా పట్టలేదే? ఎవరు చెప్పినా డబ్బు లేకుండా పెళ్లి జరగడానికి అంగీకరించను" స్పష్టంగా అరిచాడు దయానందం.

రాఘవయ్య దమయంతి దగ్గరకెళ్ళి "వస్తానమ్మా దయవుంచు. వాడికి నామీద నమ్మకం కలగలేదు" మెట్లు దిగాడు.

సారథి మొహంలోకి ఓ సారిచూసి రాఘవయ్య చరచరా నడిచివెళ్ళిపోయాడు. మలుపులో మాయమయ్యాడు.

"నా ముందా కుప్పిగంతులు! లోకం కాచి వడపోసిన ముండా కొడుకుని. ఎంత మందినిచూశాను?" దయానందం నవ్వుతూ బంధువుల్ని చూశాడు.

"ఇంతకీ పెళ్ళి ఆగిపోయినట్లేనా?" గణపతి సందేహం తీరక అడిగాడు.

దయానందం కసురుకున్నాడు. "ఆగిపోయింది. నువ్వు దయచెయ్యి."

సారథి జూదంలో ఆఖరి రూపాయి కూడ పోగొట్టుకున్నవాడిలా కూర్చున్నాడు. ఇంటికి కనిపిస్తున్న తోరణాలు, రంగులు అన్నీ వ్యర్థంగా కనిపించాయి.

పెళ్ళికి వచ్చిన బంధువులు దూరంగా పోయి దయానందం లోభత్వాన్ని దుయ్యబట్టసాగారు.

దమయంతి పెరటిలోకి వెళ్లింది. పనివాడు "గాడి పొయ్యి ఎక్కడ తవ్వేనమ్మగారూ!" అనడిగాడు.

దమయంతి చిరచిరలాడిపోయింది. ఆమె కోపాన్ని చూసి వాడు తప్పుకున్నాడు. దయానందం అక్కడికి రానే వచ్చాడు.

"మనం చేసే ఒక్క శుభకార్యం యిదేకదా! వెనకా ముందూ ఎవరున్నారు మనకి? పెళ్లి ఆపుకోవడం ఎన్ని తల



పంపులు?" భర్తని విసురుగా అడిగింది.

"అంతకంటె దారి వుందా?"

"రాఘవయ్య మనం ఎరగని మనిషా?"

"దరిద్రం అనేక పనులు చేయిస్తుంది. ఇవ్వాలని వున్నా పరిస్థితులు యివ్వనివ్వవు. అపుడు మనం ఏడవాలి?"

తల్లీ తండ్రీ మాట్లాడుకోవడం హాల్లోనుంచి చూసి సారథి అక్కడికివచ్చాడు. "పెళ్ళి వుందని నా స్నేహితులందరూ వచ్చేస్తారు. తెలియపరచడానికి వ్యవధి లేదు. రేపు వాళ్ళకి ముఖం ఎలా చూపించను?"

"అవన్నీ ఆయనకెందుకు! డబ్బే కావాలి" ఈసడింపుగా అంది.

దమయంతి నిత్యమూ భర్తతో ఒదిగినట్లే వుంటుంది. అతడి మనస్తత్వం సరిపడకపోయినా, రోజూ దెబ్బలాడుతూ రోడ్డు ఎక్కలేక రాజీ చేసుకుని తల వంచింది. శుభకార్యం ఆగిపోవడంతో



తిక్క రేగినట్లయింది. మూడు దశాబ్దాల వైవాహిక జీవితంలో తొలిసారిగా ఆమె తిరగబడింది.

దయానందం భార్యని చూసి ఆశ్చర్య పోయి సర్దుకొని "ఇంకేం తల్లీ కొడుకులకి యిష్టంగానే వుందన్నమాట. వెళ్ళి చేసు కోండి ముష్టి పెళ్ళి. వాడు డబ్బు ఎగ వెయ్యడానికి ఎత్తువేసి మొసలి కన్నీరు కార్చాడు. దానికి మీరు రెపరెపలాడిపోతు న్నారు. జాగ్రత్త—నేను చెప్పినదానికి ఎదురు చెప్పవద్దు" మండిపడ్డాడు.

అసలు వ్యక్తి వెళ్ళిపోయాక, యింకా పెళ్ళి గురించి తండ్రితో వాదించడం సారథి కిష్టం లేదు.

సారథి తన గదిలోకి పోయి మంచం మీద పడుకున్నాడు. పెంచుకున్న వుత్సా హము కరిగిపోయింది. బయట ఆకాశం లాగానే మనసుకి కూడ ముసురుపట్టి నట్లయింది.

తనని చవటగా జమ వేస్తుంది సామ్రాజ్యం.

"గతంలో మీకు చేసిన ఉపకారాలు

మీ నాన్న మరచిపోయినా, నువ్వెలా మరచిపోయావు సారథీ?" సామ్రాజ్యం నిలవేసి అడుగుతుంది.

పెళ్లి చెడిపోయింది. నాన్న డబ్బున్న కోతిని కోడలుగా తెసాడు. సామ్రాజ్యం యిక తనకేంకాదు. ఏమీ కాదు. ఒకటను కున్న జీవితాలు వేరయినాయి.

సారథికి గుండెలు పిండినట్లయింది. చిన్నప్పటి నించి సామ్రాజ్యం, తను మొగుడూ పెళ్ళాలుగానే పెరిగారు.

రాఘవయ్యది పొరుగిల్లే. ఏటి ఒడ్డు చేనులాంటి సంసారం ఆయనది. గాంధీ పిలుపుతో స్వాతంత్ర్యోద్యమంలోకి దిగాడు. సభలు, సమావేశాలుకి తిరిగే వాడు. ఆస్తి కర్పూరమయింది. స్వాతం త్ర్యము రాగానే పదవివచ్చినా కొవ్వొత్తి లాంటి మనిషి కనుక ఏం నిర్వాకం చేసు కోలేదు. నిల్వ చేసుకోలేదు.

తన తండ్రికి కాంట్రాక్టులు యిప్పిం చాడు. తండ్రి యిబ్బడి ముబ్బడిగా సంపాదించాడు. ఆయన పదవిపోయాక ఎవరూ మళ్లీ ఆయనకేసి తొంగి చూడ లేదు. రాఘవయ్య వూర్లో కాలక్షేపంకాక హైద్రాబాదు వెళ్లిపోయి, చిన్న తరహాగా ఏదో వ్యాపారం పెట్టుకుని కాలక్షేపం చేసుకుంటున్నాడు.

అలాంటి వ్యక్తిని పదివేలు కట్నం అడిగాడు తండ్రి. అది ఈ రోజున ఆయ నకి భారమే. కాని చిన్నప్పట్నుంచి అను కుంటున్నదని ఒప్పుకున్నాడు.

డబ్బువల్ల సామ్రాజ్యం తనకి కాకుండా పోతోంది.

సారథికి చిన్నప్పట్నుంచి సామ్రా జ్యంతో ఆడుకున్న ఆటలు, పాటలు గుర్తు వచ్చి మనసు స్పందించింది. సామ్రాజ్యం మనోహర రూపం మనోరంగంలో కన పడింది.

ఆ సామ్రాజ్యం తనది కాదా? కాదేమో— రాఘవయ్య అభిమాన వంతుడు. తిరిగి వచ్చి అడగడు. ఏదో తగ్గ సంబంధం చేస్తాడు.

సామ్రాజ్యానికి భర్త తను కాదు. ఎవరో...

"నో...నో..." పిచ్చిగా అరుస్తూ లేచి కూర్చున్నాడు. అంతా ఆవేదనగా, ఆందోళనగా వుంది.

ఇంట్లో వుండటం దుర్భరమనిపిం చింది. బట్టలు మార్చుకుని సూట్ కేస్ పట్టుకుని హాల్లోకి వచ్చాడు. దమయంతి భారంగా వుయ్యాల మీద కూర్చుని వుంది. బంధువులు వెళ్లిపోయారు. ఇల్లు నిశ్శబ్దంగా వుంది.

"వస్తానమ్మా !"

"అదేమిట్రా సెలవుందికదా !"

"నేనుండలేను."

సారథి స్టాండు కొచ్చి విజయవాడ బస్సు ఎక్కాడు.




ఇది జరిగిన ఆర్నెల్లకి విశాఖ. పట్నంకు ట్రాన్స్‌ఫర్ అయింది సారథికి

పెళ్లి ఆగిపోయిన తరువాత సామ్రాజ్యం దగ్గర్నుంచి వుత్తరం ఏద

యినా వస్తుందేమోనని ఎదురు చూశాడు. తనే రెండు ఉత్తరాలు రాశాడు. సమాధానం లేదు. ఆమె దగ్గరకి వెళ్ళడానికి ముఖం చెల్లలేదు. నాటికి నేడు తలవని తలంపుగా విశాఖలో ఆఫీసులో కనిపించింది.

ఒంటిగంటయింది. అందరూ లంచ్ కి లేచారు. సామ్రాజ్యం కనిపించాక తను భోజనం చేయాలన్న మాట మర్చి పోయాడు. ఆమెతో మాట్లాడాలి.

సామ్రాజ్యం టిఫిను పూర్తి చేసి విశ్రాంతిగా ఫెమీనా తిరగేస్తోంది. టైపిస్టు రూప అర్జంట్ పేపర్స్ సీరియస్‌గా టైపు చేస్తోంది. మిగతా కుర్చీలు ఖాళీ. సారథి సామ్రాజ్యం టేబిల్ దగ్గర కెళ్ళాడు.

"ఎక్స్‌క్యూజ్ మీ..."

సామ్రాజ్యం తిరస్కారంగా చూసింది

"మీరా?"

వీరి మాటలకి ఓసారి రూప చూసింది.

"బయట మాట్లాడుకోవచ్చు. లంచ్ తీసుకుందాం రా!" అన్నాడు.

"థాంక్స్. అయింది."

"నా కోసం"

"మీ మర్యాదలు నా కనవసరం!"

"నన్ను క్షమించలేవు కదూ!"

"ఎందుకు?"

"నేను చేసిన ద్రోహానికి..."

"అది మీరు చెయ్యలేదేమో!" వ్యంగ్యం విసిరింది.

"మా నాన్న పనిలో నాకూ భాగముంది."

"అపాలజీ ఇప్పుడిస్తున్నారా?"

"నా మాట నమ్ము సామ్రాజ్యం. జరిగిన దానికి నేను కుమిలిపోని క్షణం లేదు. ఏం చెయ్యాలో తోచకుండా వుంది" ముఖం రుద్దుకుంటూ అన్నాడు.

"మీరు అంత బాధపడవలసిన అవసరమేముంది. కబురు పెడితే వేలు లక్షలు కట్నాలతో అమ్మాయిలు మూడు ముళ్ళకి సిద్ధమవుతారు"

"ఇంతేనా నువ్వు చిన్నప్పట్నించి నన్ను అర్థం చేసుకుంది"

"అర్థం చేసుకుంది చాలు. జరిగిన అనర్థం కూడా మాకు బాగా గుర్తు వుంది. అంతా మరచిపోవడానికి ప్రయత్నిస్తున్నాం. మీరు కూడా సహకరించండి."

ఆమె కంఠంలోని అసహ్యం విని "నా వునికి అంత భరించలేనిదిగా వుందా?" వేదనగా అడిగాడు.

"చాల ఆనందంగా వుంది. నాచేత వాగించి మాటలు పడవద్దు" సామ్రాజ్యం లేచి రూప టేబిల్ ముందు కూర్చుంది.

సారథి హతాశుడయ్యాడు. ఆమెతో ఇంకా మాట్లాడదామని వుంది. ఆ అవకాశం సామ్రాజ్యం ఇవ్వలేదు.

క్యాంటీన్‌లో టీమాత్రం తాగి డెస్క్ ముందు కూర్చున్నాడు. తిరిగి ఆఫీసు ప్రారంభమైంది-

నాలుగింటికి అతడు తిరిగి క్యాంటీన్‌కి వెళ్ళినపుడు సామ్రాజ్యం, రూప అక్కడ కాఫీలు తాగుతున్నారు.

ఎవరో రావడంతో రూప పక్కకెళ్ళి మాట్లాడుతోంది. సారథి చప్పున సామ్రాజ్యందగ్గర కెళ్ళాడు. "సాయంత్రం నిన్ను కల్సుకోవచ్చా ?"

"ఎందుకు?" కటువుగా అడిగింది.

"నీతో మాట్లాడాలి."

"నాతో మీరు మాట్లాడేవి ఏమీ లేవు"

"అలాగని నువ్వనుకుంటే ఎలా ? ప్లీజ్!"

"సారీ! నాకు వీలుపడదు..."

సామ్రాజ్యం విస విస వెళ్లిపోయింది. "ఆమె తనని లక్ష్యం చెయ్యక పోవడం, తిరస్కారంగా మాట్లాడటం అశాంతిని వృద్ధి చేశాయి.

"సారథీ..."బాలాజీ చెయ్యి నొక్కి పిలిచాడు.

ఆలోచనల్నుంచి తేరుకుంటూ"నువ్వా! ఆటయిపోయిందా?" అని లేచి కూర్చు న్నాడు.

"లే భోంచేద్దాం. నాగురించి నీకు లేటయిందేమో!"

"లేదు."

ఇద్దరూ టేబిల్ ముందు కూర్చున్నారు. సారథికి భోజనం సయించడం లేదు. కెలుకుతున్నాడు.

"ఏమీ తినడం లేదేం?"

"ఆకలిగా లేదు."

"విందు కొట్టావా? మందుకొట్టావా?"

"రెండూ కాదు" సారథికి లోపల రొద పెడుతున్న సామ్రాజ్యం సంగతి ఎవరికైనా చెప్పుకోవాలనిపించలేదు. చెబితే నవ్వుతారేమో! ఆనాడు వుపేక్షచేసి ఇపుడు బాధపడటం ఎందుకంటారేమో!

కాని బాలాజీకి చెప్పేశాడు.

"రాఘవయ్యగారి అమ్మాయి కదూ! ఉద్యోగం చేస్తోందా?"

"మా ఆఫీసులోనే !"

"పెళ్ళయిందా?"

"తెలియదు. నన్ను చూసి మండి పడింది"

"మీ నాన్న అలా దెబ్బకొట్టాడు."

"అందుకే వాళ్ళకి కోపం"

"రాఘవయ్యగార్ని కల్సుకో. అన్నీ తెలుస్తాయి?"

"ఏ ముఖం పెట్టుకుని వెళ్ళను? ఆ రోజున మొండి చెయ్యి చూపించాను"

"డోంట్ వర్రీ ... అన్ని రోజులూ ఒకటి కావు."

బయట స్కూటర్ హారన్ వినిపించింది. బాలాజీ తొందర చేస్తూ "వాళ్ళు వచ్చేశారు. కానిచ్చేయ్ సిన్మా ప్రోగ్రాం పెట్టారు" చెప్పాడు.

"నేను రానోయ్! నా మనసేం బాగా లేదు"

"మనసు బాగాలేనప్పుడే సినిమాకి పోవాలి. నువ్వు వచ్చావని సరదాగా పెట్టాం. మమ్మల్ని డిజప్పాయింట్ చెయ్యకు."

సారథికి బయలుదేరక తప్పలేదు. సినిమా అప్పుడే ప్రారంభమయింది. కథ సాంఘికమైనా పౌరాణికం, జానపదం వాసనలు కూడా వున్నాయి. అరగంట చూశాక అందరికీ తలనొప్పి బయలు దేరింది.

"కేశవా!ఇలాంటి సిన్మాకి లాక్కొచ్చావేంరా?" బాలాజీ అడిగాడు.

"నాకేం తెల్సు గురూ! కళాత్మక చిత్రమని సమీక్ష చదివి మిమ్మల్ని ప్రయాణం చేయించాను."

"ఇలాంటి వాడికేం శిక్ష విధించాలి?"

"మెక్ డొవల్!"

"అన్యాయంరా!"

"ఏడ్వకరా ఏ బ్రా సీ! పేకాటలో మూడొందలు కొట్టావు"

నలుగురూ బయటికి వచ్చారు. మందు, సరంజామాతో యింటికి వచ్చారు. సారథికి హాట్ డ్రింక్సు అలవాటు లేవు. "ఒక్క రౌండ్ కంపెనీ ఇయ్యి గురూ!" బాలాజీ బలవంతం చేశాడు. లైట్గా పోసుకుని సారథి బలవంతంగా మింగేశాడు. నోరంతా వగరు వాసన.

మిగతావారు సీనియర్ పక్షులు. మందు ప్రభావం నెమ్మదిగా ఎక్కు తోంది.

ఎనిమిదింటికి సారథికి మెలకువ వచ్చింది. గది సిగరెట్ పీకలు, పొట్లాల కాగితాలు, మందు సీసాలతో గలీజుగా వుంది. బాలాజీ, కేశవరెడ్డి ఒకర్నొకరు కౌగిలించుకుని పడుకుని వున్నారు.

సారథి స్నానం వగైరాలు పూర్తి చేసుకునేసరికి తొమ్మిదయింది. ఇంకా వాళ్ళెవరూ లేవలేదు. కాస్సేపు వెయిట్ చేసి తను ఆఫీసుకి బయలుదేరాడు.

పెందరాళే వెళితే సామ్రాజ్యం కని పిస్తుంది.

జవాను అప్పుడే తలుపులు తెరచి తుడుస్తున్నాడు. సారథి సిగరెట్ కాలుస్తూ వరండాలో నించున్నాడు. ఒక్కొక్కరే వస్తున్నారు. సామ్రాజ్యం మాత్రం రావడం లేదు. పదిన్నరయినా ఆమె రాలేదు.

సెలవు పెట్టిందా?

ఎలా తెలుస్తుంది? ఆలోచించి రూప దగ్గర కెళ్ళాడు.

"ఏమన్నా టైప్ చెయ్యాలా?"

"సామ్రాజ్యంగారు రాలేదేం?"

"ఆమె మీకు తెల్సా!"

"బాల్యం నుంచీ..."

"వట్స్ గుడ్. ఆమె నాలుగు రోజులు సెలవు పెట్టింది"

"ఆరోగ్యం బాగాలేదా?"

"అదే కారణం"

"ఎక్కడ వుంటున్నది"

రూపకి నిన్న సాయంత్రం సామ్రాజ్యం బస్‌స్టాప్‌లో అన్న మాటలు గుర్తువచ్చాయి.

"ఈ మధ్యనే యిల్లు మారాండండీ. కొత్త ఇంటికి నేను యింకా వెళ్ళలేదు" అంది.

సారథికి చేదు మాత్ర మింగినట్లయింది. ఆమె ఎడ్రస్ చెబుతుందని, ఇంటికెళ్ళి ఆమెతో సావకాశంగా మాట్లాడ వచ్చని భావించాడు.

కాని బొమ్మ బొరుసయింది. ఆమె ఎడ్రస్ సంపాదించడానికి చేసిన ఏ ప్రయత్నమూ ఫలించలేదు.

నాలుగు రోజులు నిరీక్షణగా గడిపాడు.

అయిదో రోజున సామ్రాజ్యం ఆఫీసుకి వచ్చింది.

సారథికి ఆమెని పలకరించే ధైర్యం లేకపోయింది. కనకాంబరం రంగు చీరలో ఆమె వడలిన మందారంలా కనిపించింది. తన సీటు నుంచే వీలైనన్నిసార్లు కళ్ళతో పల్కరించాడు. ఇదంతా సామ్రాజ్యం గమనిస్తూనే వుంది. రీసెస్‌లో కూడా అతడు కలవకుండా రూపతో వుండి జాగ్రత్త పడింది.

ఆఫీసు వదలగానే సామ్రాజ్యం, రూప సిటీ బస్ కోసం ఎదురు చూడ సాగారు. ఇద్దరూ ఎక్కవల్సింది ఒకే బస్సు. ఆరోజు డాబా గార్డెన్స్‌లో పని వుండి రూప ముందరే వెళ్ళిపోయింది. సామ్రాజ్యం ఒంటరిగా వుంది. పక్క ఆఫీసు మగాళ్ళు నలుగురైదుగురు వున్నారు. సారథి ఆమె దగ్గర కెళ్ళాడు.

సామ్రాజ్యం తల తిప్పుకున్నది.

"ఎలా వుంది ఒంట్లో ?"

"........."

"చిక్కినట్లు కనిపిస్తున్నావు"

"పాపం! నీకు జాలిగా వుంది కదూ. నాతో మాట్లాడడానికి సిగ్గు లేదూ ?"

సారథి మనసు చివుక్కుమంది.

"నన్ను మళ్ళీ ఏదోలా అల్లరి చెయ్యాలని చూస్తున్నావు !"

"సామ్రాజ్యం !"

"ఏం? వున్నది చెప్పానని వులుకుగ వుందా ?"

"తప్పు నాది. నువ్విలా అనడం కూడా తప్పు కాదు"

సామ్రాజ్యానికి ఆ మాటలు చాలా పేలవంగా వినిపించాయి. సారథి కారణంగా తను, తన కుటుంబం చీకటి చూసింది. శిశిరాల్ని పొందింది. ఇలాంటి బలహీనుణ్ణా తను ప్రేమిస్తే? ముఖ్యమైన సమయంలో మూగనోము పట్టి కూర్చున్నాడు. మమతలు పండిస్తాడనుకున్న మనిషి మంటలు పండించాడు. ఇలాంటి మనిషితో తనకేం పని ?

"అలా ఒప్పుకోమని ఎవరూ కోరలేదే!"

"నువ్వింత కఠినంగా ఎందుకు మారిపోయావో అర్థంకాడం లేదు"

సామ్రాజ్యానికి బస్సు వచ్చే జాడ కనిపించలేదు. ఆటో వస్తే పిలిచింది. సారథి వాదిస్తూ వుండటం ఆమెకి నచ్చలేదు.

"సామ్రాజ్యం !" పిలుస్తూ దగ్గర కెళ్ళాడు.

"పోనీ!" చెప్పింది. ఆటో బయలుదేరింది.

ఆటో దిగి వస్తున్న కూతుర్ని చూసి, చెట్లకి నీళ్ళు పోస్తున్న రాఘవయ్య "ఏమ్మా ! బస్సు దొరకలేదా ?" అనడిగాడు.

"మరే !" పొడిగా అని లోపలి కెళ్ళిపోయింది.





సామ్రాజ్యం స్నానం చేసి వచ్చేసరికి సీతమ్మ టీ పట్టుకు వచ్చింది. కూతురుకిచ్చి, "మిమ్మల్నే, టీ త్రాగుతారా ?" తోటలోని భర్తని పిలిచింది.

రాఘవయ్య తువ్వాలుతో ముఖం తుడుచుకుంటూ వచ్చి పెరట్లోని గచ్చుపడిమీద కూర్చున్నాడు.

సీతమ్మ టీ ఇచ్చి గోంగూర బాగు చెయ్యసాగింది.

సామ్రాజ్యం చెప్పనా, వద్దా అని కాస్సేపు మీమాంస పడి సారథి కనిపించిన వార్త వారికి చెప్పింది.

సీతమ్మలో క్రౌర్యం, రాఘవయ్యలో కుతూహలం తొంగి చూశాయి.

"ఇక్కడికి ట్రాన్స్ఫర్ అయిందామ్మా! ఇంటికి రమ్మనలేక పోయావా? అతణ్ని చూసి చాలా రోజులయింది" రాఘవయ్య అన్నాడు.

"ఎందుకులెండి ? చేసింది చాలదూ ?" సామ్రాజ్యం పెదవి విరిచింది.

"అతనేం చేస్తాడమ్మా ? దయానందం మూర్ఖుడు. సారథి ఎంత చెప్పినా విన్నాడా? అయినా మనకి ఎదురీతమ్మా. వ్యక్తులేం చేస్తారు? వ్యాధికి మందు వుంది గాని, విధికి మందు వుందా?" రాఘవయ్య ఓదార్పుగా అన్నాడు.

"మన నీతులే మనకి గోతులు తవ్వుతున్నాయి. చేతకాని చవట. ఒక్కసారయినా వచ్చి ముఖం చూపించాడా ?" సీతమ్మ కసిగా అంది. పెళ్ళి ఆగిపోయినప్పటినుంచి దయానందం కుటుంబం అంటే ఆమెకి పడటం లేదు.

"నీ చాదస్తంగాని, చూపించి ఏం చేస్తాడే? తండ్రిచాటు బిడ్డ"

"పెళ్ళయిందిటే" సీతమ్మ భోగట్టా చేసింది.

"నేనడగలేదు" సామ్రాజ్యం విసు

దుగా అంది.

"లక్షల కోసం చూస్తున్నాడేమో దయానందం. వాడి డబ్బు కాపీనం తగలెయ్య ! మన మోచేతి నీళ్ళు త్రాగి మనకే నామాలు పెట్టాడు"

"వూరుకుందూ! ఎవర్నీ నిందించటం ఆయన కిష్టముండదు.

"ఇంకా ఏమన్నాడే?" సీతమ్మకి తిరిగి పెళ్ళి మాటలు ఏమయినా కదిపాడేమో నని అనుమానం! అలా జరగకూడదూ అనిపిస్తోంది.

"అతణ్ని చూడడానికే నాకు అసహ్యంగా వుంది. ఇంకా మాటలు కూడానా? దారేపోయేవాడి గురించి అంత యింట్రస్టు ఏమిటి?" కసురుకుంది.

"మీ తండ్రీ కూతుళ్ళకి బొత్తిగా యింగితం లేదే" గోంగూర నీళ్ళలో కడుగుతూ అంది.

"మా బదులు నీకుంది కదా! నువ్వేం నిర్వాకం చేశావు ?"

రాఘవయ్య ప్రశ్నకి సీతమ్మ మాట్లాడలేదు. అక్కడ నుంచి వంటింటి లోకి వెళ్ళిపోయింది.

సారథంటే అమ్మకీ, నాన్నకీ యింకా భ్రమ వుంది అనుకుంది సామ్రాజ్యం. నెలయింది. సారథి వేరే గది చూసు కుంటానన్నాడు. ఇన్నాళ్ళు బాలాజీ గదిలోనే వున్నాడు.

"ఇక్కడ నీకేమయినా యిబ్బందిగా వుందా ?"

"అది కాదు."

"మరెందుకోయ్ ! పిచ్చి పిచ్చి ఆలో చనలు మానెయ్."

బాలాజీ మున్సబుగారి అబ్బాయి. మోతుబరి కుటుంబం. నలుగురన్న దమ్ములలో యితడికే చదువు వస్త. అందుకే తండ్రి ఎంత కావలిస్తే అంత పంపుతాడు. బాలాజీ మూడు గదుల పోర్షను తీసుకున్నాడు. సారథి వేరే చోటికి పోతాననడం అతడికి నచ్చలేదు. అద్దెలో కొంత భాగం భరిస్తానన్నాడు. అంగీకరించలేదు.

సామ్రాజ్యం నిత్యం కనిపిస్తూనేవుంది. సారథి పలకరించడం లేదు. ఆమెకి అయి ష్టంగా వున్నపుడు తను మాట్లాడటం వ్యర్థమనిపించింది.

మరో నెల గడిచింది. దయానందం నిత్యం వుత్తరాలు గుప్పిస్తున్నాడు పెళ్ళి సంబంధాలు రెడీగా వున్నాయని. సారథి ఏం జవాబు రాయడంలేదు. పెళ్లి చెడి పోయినప్పటి నుంచి మరి అతడు యింటికి పోలేదు.

తండ్రికి తన చిరునామా ఎలా తెల్సింది? తను కార్డు రాయలేదు. ఊరు కెళ్ళినపుడు బాలాజీ చెప్పి వుండాలి.

ఓ సాయంత్రం సారథి రూంకి వచ్చే సరికి సోఫాలో కూర్చుని చుట్టకాలుస్తున్న తండ్రిని చూసి వులిక్కిపడ్డాడు.

"ఎప్పుడు వస్త?" శత్రువుని పలక రించినట్లు పల్కరించాడు.

"గంటయింది. బస్సు దిగగానే దేముడిలా బాలాజీ కనిపించాడు. నన్ను దింపి వెళ్ళాడు ఎక్కడికో ?"

సారథి లోపలకెళ్ళి పోయాడు. బాత్ రూంలో వీలైనంత ఆలస్యం చేశాడు. తండ్రితో ముఖాముఖీ యిష్టంలేదు.

అతడు తల దువ్వుకుంటుండగా "ఏం చేస్తున్నావురా లోపల ?" అంటూ దయా నందం వచ్చాడు.

"ఏం? ఏమన్నా కావాలా ?"

"వద్దు" దయానందం మంచంమీద కూర్చుని "ఉత్తరాలు రాయవేంరా ?

మీ అమ్మ భయపడి చస్తోంది" అడిగాడు

తండ్రి మీద కోపం తల్లిని కూడ నిర్లక్ష్యం చేయిస్తోంది. అమ్మని చూసి చాలా రోజులయింది. ఇన్నాళ్ళు ఆమెని చూడకుండా ఎప్పుడూ లేడు.

"ఏమున్నాయి రాయడానికి ?"

సారథికి చిన్నప్పటినుంచి తండ్రి దగ్గర చనువులేదు. ఎప్పుడయినా పొడి మాటలు మినహాయిస్తే యిద్దరూ ఏం మాట్లాడు కోరు.

"విజయవాడనుంచి నీకు సంబంధం వచ్చింది. నలభై వేలు యిస్తామంటు న్నారు. నేను ఆ పదీ పూర్తి చేయమంటు న్నాను. ఒక్కతే పిల్ల ఆయనకి. రెండు మేడలున్నాయి. వాళ్లు నిన్ను తీసుకు రమ్మని కంగారు పెట్టేస్తున్నారు. ఉత్త రాలు రాసినా రావు. సమాధానం రాయవు ! ఇదేం బాగాలేదురా !"

సారథి దిక్కులు చూడసాగేడు.

"అందుకే నేను బయలుదేది వచ్చాను. రేపు బయలు దేరదాం మనం. పిల్ల నచ్చితే వెంటనే తాంబూలాలు పుచ్చేసుకుందాం!"

తండ్రి యావకి అసహ్యమేసింది. డబ్బు తప్ప మరో వస్తువు తెలీదతడికి. మనుషుల విలువ తెలిస్తే, సామ్రాజ్యం తన భార్య అయ్యేది.

"ఇప్పుడు రావడం కుదరదు."

"సెలవులు లేవా ?"

"ఉన్నా పెట్టను. పెళ్లి అనవసరం."

దయానందం పెద్ద కళ్ళు పెట్టుకుని చూశాడు. కొడుకు తన మాట కాదంటూ న్నాడు. అంటే ఎదిరిస్తున్నాడు.



తన పెద్దరికానికి అన్యాయం జరిగి పోయిందని కోపం తెచ్చుకుంటూ "పెళ్లి చేసుకోవా అసలు ? లేకపోతే చేసేసు కున్నావా ?" అడిగాడు.

"దొంగ చాటుగా చేసుకునే అవసర మేముంది ?"

"రాజాలాంటి సంబంధం. దీనికేం. పిల్ల చాలా బాగా వుంటుంది. సంగీతంలో పరీక్షలు ప్యాసయిందిట."

"ఏమైనా అనవసరం నేను చేసుకోను" దయానందం ఓర్పు కరిగిపోయింది"

"నన్ను కాదంటున్నావు. గడ్డి, పోచలా తీసేసున్నావు. ఏంజరుగుతుందో తెల్సా?"

"ఏం జరుగుతుంది ?"



"ఆస్తిలో వాటా వుండదు. నీకూ నాకూ ఏం సంబంధం వుండదు. ఇక నువ్వు నా కొడుకువే కావు !" నిప్పులు కురిపించాడు.

"ఆస్తి భ్రమ నాకులేదు. బ్రతకటానికి వుద్యోగం వుంది. ఇక మన సంబంధ బాంధవ్యాలంటారా... మనం కాదన్నా అవి పోవు."

"నాకే పాఠాలు చెబుతున్నావురా! శభాష్! కొడుకువంటే నువ్వురా! ఏదో తలకి ఎత్తుతావనుకున్నాను. బాగా బుద్ధి చెప్పావు" బాధ నటించాడు.

"నా పెళ్ళి విషయంలో నా మాట వినకపోతే ఎలా?"

"ఈ సంబంధం మీ అమ్మకి కూడా యిష్టమేరా" తల్లి మీద గౌరవంతోనైనా ఒప్పుకుంటాడని దబాయించాడు.

"పెళ్ళి నాది. నా ఇష్టం ముఖ్యం"

"అయితే మా మాట లెక్కలేదు ?" లేచి గట్టిగా అడిగాడు చేతులాడిస్తూ.

"మీరు ఎలా అనుకున్నా ఫర్వాలేదు"

"ఇంత విశ్వాస ఘాతకుడివనుకోలేదురా! ఛీ... నీకు లేని ప్రాకులాట నాకు దేనికి?" దయానందం హాల్లోకి వెళ్ళి బట్టలు వేసుకున్నాడు. ఇక అక్కడ వుండబుద్ధి కాలేదు. సంచీ చేతిలో పట్టుకున్నాడు.

"ఇంత రాత్రివేళ ఎక్కడికి? పొద్దుట వెళుదురుగాని" సారథి అన్నాడు వచ్చి.

"ఏ ముఖం పెట్టుకుని వుండమంటావురా? రాఘవయ్య సంబంధం చెయ్యలేదని అక్కసు లోపల పెట్టుకుని నన్ను ఏడిపిస్తున్నావన్న మాట. అలాగే కానీ! చెడిపోయేది నువ్వే. ఈ రోజు నుంచి నీకూ నాకూ ఏం సంబంధం లేదు"

దయానందం బాధతో నడుస్తూ వెళ్ళిపోయాడు.

"నాన్నగారూ!" వీధి గేటులోకి పోయి పిలిచాడు – రాత్రి తెలియని పట్నంలో అవస్థ పడతాడని.

రోడ్డెక్కిన దయానందం ఆగలేదు.

"ఎవరికి టాటా చెబుతున్నావ్?" బాలాజీ స్కూటర్ వచ్చింది.

తండ్రి గురించి చెప్పాడు.

"రావడం...వెళ్ళడం. బాగుంది"

* * *

పుట్టినరోజు సందర్భంగా సారథి ఆఫీసులో స్టాఫ్‌కి సాయంత్రం పార్టీ అరేంజ్ చేశాడు. రూపకి సంగీతంలో ప్రవేశముంది. ప్రారంభంలో ఆమె రెండు త్యాగరాయ కృతులు పాడి అందర్నీ ఆనందింపచేసింది.

శుభాకాంక్షలు చెప్పారు నలుగురూ. పార్టీ ప్రారంభమైంది. సామ్రాజ్యం కనిపించకపోవడంతో రూపని అడిగాడు.

"పనుందని వెళ్ళిపోయిందండీ!"

సారథికి వుత్సాహమంతా పోయింది. సామ్రాజ్యం తనని మన్నించడం లేదు. ఏదో రోజున ఆమెలో మార్పు కనిపిస్తుందని ఆశిస్తున్నాడు. అడియాసవుతోంది.

క్యాంపు నుంచి అప్పుడే వచ్చిన ఆఫీసర్ జోషి కూడ పార్టీలో పాల్గొన్నాడు.

పార్టీ అయ్యాక జోషి సారథిని పిలిచాడు తన గదిలోకి. "రేపు మళ్ళీ నేను క్యాంపుకి వెళుతున్నాను మిస్టర్ సారథీ. అయిదువేలు బ్యాంక్ చేసి, హైద్రాబాద్ ఆఫీసుకి టేబిల్–ఏ పంపించండి. వారికి ఏడులోగా అందాలి"

క్యాష్ ఐరన్ సేఫ్‌లో పెట్టి లెక్క అప్పగించి తాళాలిచ్చేశాడు.

మర్నాడు సారథి ఆఫీసుకి రోజూ




కంటె పెందరాళే వెళ్ళాడు. లాకర్ తీసి డబ్బు లెక్కపెట్టి బయలుదేరేసరికి పద యింది.

ఆఫీసర్ లేడని తెలిసి ఆఫీసు ఆట విడుపుగా వుంది. ఎవరూ సీట్లలో లేరు. యిన్‌చార్జి మాట ఎవరికీ లెక్కలేదు.

వామనరావు కో క్లర్క్ సంతకం పడేసి మార్నింగ్ షోకి బయలుదేరాడు.

"రండి సారథిగారూ! బ్యాంకు దగ్గర డ్రాప్ చేస్తాను"

సారథి ఎక్కగానే ముందుకురికింది.

పూర్ణా మార్కెట్ కవతల సిటిజన్‌ను ఢీ కొట్టబోయి తప్పించి ఎలక్ట్రిక్ స్థంభానికి డాష్ యిచ్చాడు వామనరావు.

స్కూటర్ దూరంగా పడింది.

అదృష్టవశాత్తు ఇద్దరికీ పెద్దగాయాలు తగలలేదు. ట్రాఫిక్ కానిస్టేబుల్ ఇద్దర్నీ కే.జీ. హెచ్.కి పంపించాడు.

మధ్యాహ్నం రెండు దాటాక సారథికి తెలివి వచ్చింది. కాలికి, నుదురుకి చిన్నగా దెబ్బలు తగిలాయి. సలుపుగా వున్నా లేచి కూర్చున్నాడు.

జేబులో ఆఫీసు డబ్బులేదు.

నర్స్‌ని అడిగాడు.

తనకేం తెలియదంది. "పోలీస్ స్టేషన్‌కి ఫోన్ చేస్తానాగండి. వారు దాచారేమో!"

నర్స్ పక్కగదిలోకి వెళ్ళి ఫోన్ చేసింది. వెంటనే సారథి బెడ్ దగ్గరకి వచ్చి "స్కూటర్ మాత్రం వారి దగ్గర వుందిట. స్పాట్‌లో ఏం దొరకలేదట."

గాయంకంటె ఈ బాధ ఎక్కువయింది సారథికి. యాక్సిడెంటులో పర్సు జారి వుంటుంది. ఎవరో జాగ్రత్తగా దొంగలించి వుంటారు.

వామనరావు లేచి బత్తాయి తింటున్నాడు. "సారీ ఫ్రెండ్."

సారథి ఆఫీసుడబ్బు మాట చెప్పాడు. వామనరావుకి కూడా గుక్క తిరగలేదు.

మర్నాడుదయం ఇద్దరూ డిశ్చార్జ య్యారు.

ఆటోలో సారథి జోషి బంగాళాకి వెళ్ళాడు. ఆయన క్యాంపునించి తిరిగి రాలేదు. చేసేదిలేక రూంకి వచ్చేశాడు.

స్నానం కూడా చెయ్యాలనిపించలేదు. సీరియల్‌గా సిగరెట్లు కాలుస్తూ ఆఫీసు టైం కాగానే ఆఫీసుకి బయలుదేరాడు.

వామనరావు ద్వారా అప్పటికే సంగతి తెలుసుకున్న స్టాఫ్ సారథికి సానుభూతి అందజేయసాగేరు. మరో పావుగంటలో ఆఫీసరు వచ్చాడు.

బెదురుగా లోపలికెళ్ళాడు.

"బ్యాండేజీ ఏమిటి?" చూడగానే అడిగాడు.

సవివరంగా చెప్పాడు.

"మైగాడ్!" అదిరిపడ్డాడు ఆయన. వెంటనే అందవల్సిన సొమ్ము అది. లేకపోతే తనకి మాట వస్తుంది.

"బాధ్యత మీదేనని చెప్పక్కర్లేదు కదా!" ఆఫీసర్ సూటిగా అడిగాడు.

సారథికి దాని భావం తెల్సింది.

"జరిగింది నేను నమ్ముతాను సారథిగారూ. పై వాళ్ళు నమ్మరు కదా. ఇదంతా నాటక మనుకుంటారు. పైగా యాక్షన్ తీసుకుంటారు. ఇవి మీకూ తెల్సును."

"యస్సార్! పోలీసు కంప్లెయింట్ యివ్వమంటారా?"

"దానివల్ల లాభం ఏమిటి? ఇవాళ బుధవారం. శుక్రవారమయినా డబ్బు కట్టేయాలి. లేకపోతె పరిస్థితి నా చేతిలో వుండదు మరి."

సారథి తలూపాడు.



చషకం ... 29

"కావలిస్తే సెలవుపెట్టి, రెస్టు తీసుకోండి."

సారథి ఆఫీసరు గదినుంచి బయటికి వచ్చాడు. ఇంటికి వెళితే బాధ ఎక్కువవుతుందనిపించింది. పని చేస్తున్నట్లు నటిస్తూ డెస్క్ ముందు కూర్చున్నాడు.

అయిదు వేలు ఎలా సంపాదించాలి? ఇంటికి వెళితే తండ్రి ముందు ఓటమి ఒప్పుకోవాలి. ఆ పని చస్తే చెయ్యలేడు. బాలాజీని అడుగుదామంటే ఢిల్లీ వెళ్లాడు. మరో వారం దాకా రాడు. రెండు రోజుల్లో అయిదు వేలు ఎలా వస్తాయి?

రూప టైప్ చెయ్యడం ఆపి, సామ్రాజ్యం టేబిల్ దగ్గర హస్కు వెయ్య సాగింది. "సారథిగారికి గొప్ప ట్రబుల్ వచ్చింది."

"మరే"

"పలకరించావా?"

"నేను మాట్లాడితే బాధ తీరిపోతుందా?"

"మరి దెయ్యంలా తయారయ్యావు."

"ఇదేం పెద్ద ఆపద కాదు. సారథి తండ్రికి లక్షలున్నాయి. ఫోన్ చేస్తే వచ్చి పడతాయి అయిదు వేలు? మనకి అయిదు రూపాయిల్లాంటివి వారికా డబ్బు."

రూప లేచి సారథి దగ్గర కెళ్లింది.

"రండి...మాటర్ ఏం లేదూ టైప్‌కి."

"అద్సరే ... ఏమిటలా డల్‌గా కూర్చున్నారు?"

"జరిగింది మీకు తెలియదంటారా?"

"అయిదు వేలు మీకెంతండీ! డాడీ వున్నారు కదా!"

సారథి అదోలా చూశాడు. "నాకు, డాడీకి సంబంధాలేం లేవు లెండి. మొన్ననే ఆయన తెచ్చిన సంబంధం కాదన్నానని తెగతెంపులు చేసుకుని వెళ్ళిపోయాడు. నా దగ్గర వెయ్యికంటే లేవు. బాలాజీ ఊళ్ళో లేడు. ఎలాగ గడుస్తుందో గండం?"

రూప సానుభూతిగా చూసింది. "ఆపదలన్నీ ఒకేసారి వస్తాయండి బాబూ! మీరు కాస్త నిబ్బరంగా వుండండి. ఎంతయినా తండ్రి. ఆపద కాయక పోరు. వెళ్ళి అడిగిచూడండి"

"జైలుకయినా పోతాను కాని నా తండ్రికి తల వంచను రూపగారూ! ఒకసారి తలవంచి మీ స్నేహితురాలు ముందు ఇప్పటిదాకా తల ఎత్తుకోలేక పోతున్నాను. ఈ రోజున నేను స్వతంత్ర పక్షిని. కష్టసుఖాలకి నాదే బాధ్యత"

అతడి కంఠంలోని నిశ్చలతకి, నిజాయితీకి నివ్వెర బోయింది.

సాయంత్రం సిటీ బస్‌లో సామ్రాజ్యంతో చెప్పింది రూప సారథి అన్న మాటలు! సామ్రాజ్యం ఉదాసీనంగా ఊరుకోలేక పోయింది.

"ఇదంతా వామనరావు చేశాడు"

"ఎవరు చేసినా అనుభవించేది సారథే కదా!"

సామ్రాజ్యం స్టాప్‌లో దిగి ఆలోచనగా ఇంటి ముఖం పట్టింది. సారథి తండ్రితో ఎందుకు పేచీ తెచ్చుకున్నాడు? తన గురించేనా? తనకి అన్యాయం జరిగిందని బాధపడి ఈ నిర్ణయానికి వచ్చాడా?

తన గురించి రిస్కు తీసుకున్నాడు. లేకపోతే ఈ పరిస్థితిలో తండ్రి అడ్డం పడి సాయం చేసి వుండేవాడు. సారథి పట్టుదల చిన్నప్పట్నుంచి తనకి తెల్సు.

తల్లితో చెప్పింది సారథి గురించి.




"బాగా జరిగింది. మనకి అన్యాయం చేసినందుకు ఫలితం" అంది అక్కసు గా సీతమ్మ వంట చేస్తూ.

"మనం అలాగనే మురిసి పోవాలి" విసుక్కుంటూ అక్కడ్నుంచి లేచి పోయింది.

సామ్రాజ్యం మర్నాడు ఆఫీసుకి రాగానే సారథి కోసం చూసింది. సారథి రోజూకంటె అరగంట లేటుగా వచ్చాడు.

"ఏం చేశావు డబ్బు సంగతి?"

"చెయ్యడానికి ఏం లేదు. జైలుకి పోవడమే !"

"భవిష్యత్తుకి ఎంత దెబ్బో తెల్సా అది ?"

"చెడ్డ కాపురానికి ముప్పేమిటి?

"సంతోషించాంలే. నే ని స్తా ను. కట్టెయ్ !"

"నీ దగ్గర ఎక్కడిది ?"

"అది నా సేవింగ్స్ !"

"నీకు ఎప్పటిలోగా యివ్వను?" ఊహించని మలుపుకి సంతసంగా వుంది.

"నీ బుర్ర సహారా ఎడారని నాకు తెల్సు"

సామ్రాజ్యం తన సీటులోకి వెళ్ళి పోయింది.




బాలాజీ ఢిల్లీనుంచీ అనుకున్న దానికంటే పదిరోజులు ఆలస్యంగా వచ్చాడు.

"ఇన్ని రోజులు వేశావేం?" రాగానే సారథి అడిగాడు.

"వచ్చేటపుడు యి ం టి కి వెళ్ళాను. పెళ్లిచూపులంటూ ఆపేశారు."

"కుదిరిందా?"

"ఆ మన పక్క పాలెం. పేరు స్వరూపా రాణి. వానాకాలం చదువు."

సారథి తమాషాగా నవ్వాడు. "ఎన్ని ఎకరాలు ఎన్ని లచ్చలు ?"

"నీ వేళాకోళానికేంగాని మీ అమ్మ కనిపించారు. ఆదివారం యాత్రాబస్సులో సింహాచలం వస్తున్నారట. నిన్ను కల్సుకో మన్నారు."

"మా నాన్నా ?"

"ఆయన రావడంలేదు."

తల్లి రావడం ఆనందంగా ఉంది. చూసి ఎన్నాళ్లోఅయింది. పంతాలూ పట్టింపులూ మమకారాలపై గోడలు కడుతున్నాయి.

ఆదివారం రానే వచ్చింది. ఉదయం టిఫిన్ చేసి సిటీబస్‌లో సింహాచలం వెళ్ళాడు. తమ ఊరునుంచి యాత్రా బస్సులు ఏమయినా వచ్చాయేమోనని వాకబు చేశాడు. రాలేదని తెల్సింది. వచ్చే పోయే జనాన్ని చూస్తూ కూర్చున్నాడు.

టూరిస్టు మధ్యాహ్నం రెండుగంటలకి వచ్చింది. దమయంతి సారథిని పిలిచింది.

సారథి టూరిస్టు మేనేజర్ని వాకబు చేశాడు. మర్నాడు పది గంటలదాకా వుంటారట అక్కడ.

"అమ్మా... నా గదికి వెళ్లిపోదాం!"

"ప్రొద్దుటే రాగలంరా!"

"దగ్గరేలే"

సిటీబస్ రెడీగావుంది.

బాలాజీ ఇంటి దగ్గర లేడు. ఆదివారం కదా పేకాట రూంలో ఎక్కడ వేస్తాడో,

తల్లి వస్తోందని భయపడ్డాడు.

"స్నానం చేస్తావా ,అమ్మా!"

"కాస్సేపుండి చేస్తాను"

సారథి పక్క హోటల్‌నుంచి కాఫీ పట్టుకు వచ్చాడు. దమయంతి పాలకోవా, కారప్పూస డబ్బాలు చేతికిచ్చింది.

"నాన్న ఇక్కడికి రావడం తెల్సా నీకు" సారథి అడిగాడు.

"చేసుకోనన్నావట కదా! నామీద చిందులు తొక్కాడు."

సారథికి కోపం వచ్చింది. తనమీద కోపాన్ని తల్లిమీద చూపించడమా?"ఛీ... ఇంగితంలేని మనిషి. మధ్యన నీ మీద ఎందుకు?"

దమయంతి నవ్వింది. "ఆయన ప్రతాపం నా మీదే కదా! ఆ సంబంధం ఇష్టంలేదు నీకు. అయితే మరోటి చేసుకో వచ్చుగా. ఎన్నాళ్ళు సత్రపు భోజనాలు చేస్తావు?"

సామ్రాజ్యం సంగతి ఎలా చెప్పాలా నని ఆలోచించుకోసాగాడు. యాక్సిడెంటు మాట చెబితే తల్లి కంగారు పడుతుందని అది మినహాయించి ఆఫీసు డబ్బుపోవడం, సామ్రాజ్యం ఇవ్వడం చెప్పాడు.

"ఇక్కడే వున్నారుట్రా. డబ్బు దగ్గర మనం ముఖం చూసుకున్నాం 'ఇంత అన్యాయం చేసినా ఆపదని ఆదుకున్నారు వాళ్ళు. చూశావా తేడా!"

"ఆమె సర్దకపోతే చిక్కుల్లో పడు దును"

"పెళ్ళైందిట్రా సామ్రాజ్యానికి"

లేదన్నట్లు తలూపాడు.

ఇద్దరికీ పెళ్లి జరిగితే బాగుండునని పించింది ఆమెకి. కాని కొడుకు ధోరణి తెలియకుండా వ్యాఖ్యానించడం ఆమెకిష్టం లేదు.

"ఏమంటాడు రాఘవయ్య ?"

దేన్నిగురించో అతడికి తెల్సు. రాఘవయ్య యింటికి రెండు మూడు సార్లు వెళ్లినా కులాసా సంభాషణే కాని మరే విషయమూ రాలేదు. సామ్రాజ్యం తనంటే మండిపడకపోయినా పూర్తిగా యింట్రస్టు చూపించడం లేదనిపిస్తోంది.

"పెళ్ళికి సామ్రాజ్యం అన్న కట్నం సొమ్ము తీసుకుని పారిపోయాడట."

"రాముడు కడుపున రావణుడు"

దమయంతి మెడలోనుంచి రెండుగొలుసులు తీసి కొడుకు చేతిలో పెట్టింది. "ఇవి అమ్మి సామ్రాజ్యం బాకీ తీర్చెయ్"

"నాన్నకి తెలిస్తే..."

"ఇవి నా పుట్టింటి వారివి. మీ నాన్న కేం సంబంధం లేదు. నేను ఏదో చెప్పుకుంటాలే!"

స్నానాలయ్యాక దమయంతిని బీచ్‌కి తీసుకెళ్ళాడు.

"సామ్రాజ్యం చిన్నప్పటినుంచీ నా కోడలు అనుకుంటూ వచ్చారా! అవకాశం కలసివస్తే ఎవరికోసమో చూడక వెంటనే చేసేసుకో" అంది.

మర్నాడు వుండమన్నా దమయంతి ఆగలేదు. నిన్ను కల్సుకుందామనే యాత్ర పేరు మీద వచ్చానంది. తిరిగి సింహాచలంలో దింపాడు ఆమెని.

తల్లితోపాటు దర్శనం చేసుకుని బయటికి వచ్చాడు. ప్రసాదం నాలుగువుండలు కొని తల్లికి యిచ్చాడు. పడిమీదకూర్చుని యిద్దరూ ప్రసాదం తినసాగేరు.

"నిన్ను సామ్రాజ్యం దగ్గరకి తీసుకు వెళదామనుకున్నాను."

నవ్వుతూ మోచేత్తో పొడిచింది. "నీకు





అవగూడని [illegible] [illegible]
అయినా [illegible] [illegible] పిల్ల
కాదు."

"[illegible]"

[illegible] [illegible] ఎక్కుతూ.
"[illegible] [illegible] సామ్రాజ్యం ఏమ
న్నట్టు" చెప్పింది.

సారథి ఆరోజు ఆఫీసర్‌తోబాటు క్యాంపుకి వెళ్ళవల్సి వచ్చింది. రెండు రోజులుదాకా తిరిగి రావడం కుదరలేదు. అతడికి ఎంత తొందరగానైనా సామ్రాజ్యాన్ని కల్సుకోవాలని వుంది. క్యాంపు నుంచి రాగానే వామనరావు నూతన గృహప్రవేశం ఫంక్షనులో సామ్రాజ్యం కనిపించింది.

"భోంచేశాకా వెళ్ళిపోదామా?" దగ్గరకి పోయి అడిగాడు.

"సెలవు రోజుని సినిమా ప్రోగ్రాం పెట్టావా?"

"అంతకంటె ఎక్కువ."

ఒంటి గంటన్నరకి భోజనాలయినాయి. ఆటోలో సారథి సామ్రాజ్యం అతడి గదికి వచ్చారు, బాలాజీ మిత్రబృందం పేకాటలో వుంది. పెరటిదార్ని ఆమెని మేడమీదకి తీసుకెళ్ళాడు. ఫాన్ వేసి "కూర్చో... మజ్జిగ కావాలా" అనడిగాడు;

"విందుభోజనం దాహం చేస్తోంది."

నిమ్మకాయ పిండి మజ్జిగ తెచ్చాడు. సారథి తల్లి ఇచ్చిన గొలుసులు ఆమె చేతిలో వుంచి. "నువ్వు అయిదువేలు ఇచ్చావు? ఇవి ఎనిమిదివేలు చేస్తాయి. అమ్మి నీకు సొమ్ము ఇవ్వొచ్చు. కాని అమ్మ నగలు అమ్మాలని పించలేదు."

"నిన్ను డబ్బుకి తొందర చేశానా ?"

"అది నా బాధ్యత కాదా ?"

సామ్రాజ్యం నవ్వుతూ "నీకు బాధ్యత బాగా తెల్సునా?" అంది.

సారథి తెల్లబోయి సర్దుకున్నాడు. "నేను లోన్‌చేసి నీ అప్పు తీరుద్దామనుకున్నాను. కాని ఇంతలో అమ్మ వచ్చింది. గొలుసులు రెండు నీకిమ్మంది."

"నీకు డబ్బు ఇవ్వడం వల్ల నాకు మూడువేలు లాభం అన్నమాట"

"ఇంకా లాభముంది."

"ఏమిటది?"

"మన పెళ్ళి"

"సారథీ."

"అవును సామ్రాజ్యం. నేను చేసింది సవరించుకోలేని తప్పుకాదు. ఒకసారి నిన్ను పోగొట్టుకుని, నరకం అనుభవించాను. ఆ శిక్షచాలు నాకు."

సామ్రాజ్యం దిండు గోడకి చేరవేసి దానిమీద ఒత్తిగిల్లి పడుకుని "పెళ్ళి మన ఇష్టం కాదు. కుటుంబం ఇష్టం. మనమేం మాట్లాడుకున్నా వుపయోగం ఏమిటి? నీ నిర్ణయాన్ని మీ నాన్న అంగీకరిస్తాడా ? ఒక రోజున డబ్బులేక పెళ్ళి ఆగిపోయింది. ఈ రోజున డబ్బువున్నా మేం కట్నం ఇవ్వం. ఒప్పుకుంటాడా మీ నాన్న!"

"నా పెళ్ళి నా ఇష్టం. ఆయనకేం సంబంధం లేదు;"

"నావల్ల మీ తండ్రీ కొడుకులు శాశ్వతంగా శత్రువులయి పోతారేమో!"

సారథి సిగరెట్ వెలిగించి కాస్త రిలాక్స్ అయ్యాడు. "ఆయనకి డబ్బు కావాలి. మనుషులు కాదు. డబ్బుకంటె కొడుకుగా నేను ఎక్కువకాదు. ఆయనకి మమతల గురించి తెలియదు. తెల్సుకునే విధంగా ఆయన జీవితం ఇక రూపాంతరం చెందదు. మొదటి నుంచి ఆశయాల విష





యంలో మేం ఘర్షణ పడుతూనే వున్నాం. నేను వుద్యోగం చెయ్యడం కూడా ఆయన కిష్టం లేదు. ఇంటి దగ్గరవుండి వ్యవసాయం, వడ్డీ వ్యాపారం చూసుకుంటే చాలు కాని నేను ఆ పని చెయ్యలేను. డబ్బు తెచ్చే అమ్మాయే ఆయనకి కోడలు. కాని నేను భార్యగా అంగీకరించలేను. ఇలా మా శత్రుత్వం కొనసాగుతూనే వుంది. కొత్తగా వచ్చిన వుపద్రవం లేదు.

తండ్రిగా ఆయన్ని గౌరవిద్దామంటే నా జీవితాన్ని మోసం చేసుకోవాలి, సుఖాలని అన్వేషించడం కంటె, అందినవే సుఖాలనుకోవాలి. సామ్రాజ్యం! ఒక జీవిత కాలం మన సొంతం సెంటిమెంట్సు దగ్గర పట్టీ కొట్టడం నా కిష్టంలేదు. ఇసుక

నేలలో ఇంకిపోయే సముద్ర కెరటం నా తండ్రి వ్యక్తిత్వం. అది ఏదో మాగాణాన్ని సస్యశ్యామలం చేస్తుందని ఆశించ డం వెర్రితనం."

ఆవేశంతో అతడి ముఖం ఎర్ర బెక్కింది. సిగరెట్ పడేసి గ్లాసుడు మంచినీళ్ళు త్రాగాడు. "మీరు ఆపదలో వుండగా నా తండ్రి డబ్బు దగ్గర ముఖం చూసుకున్నాడు స్నేహ వాతావరణంలో. నేను చిక్కుల్లో వుండగా మీరు శత్రుత్వ మయినా డబ్బు సాయం చేశారు. ఈ దౌర్భాగ్యానికి పెళ్ళి సమాధానం కాదు. కొంతలో కొంత మనశ్శాంతి పొందడానికి మన పెళ్ళి మార్గం. నేను అటు తండ్రిని- ఇటు నిన్ను కూడ పోగొట్టుకుని ఏకాకిగా బ్రతకలేను సామ్రాజ్యం! ఒంటరితనంతో విసిగిపోయాను. పరిస్థితులతో పోరాడే శక్తి ఇక నాకు లేదనిపిస్తోంది."

అతడి కంఠం గద్గదికమైంది. అతన్ని చూడగానే ఆమెకి జాలివేసింది. "నిన్ను పోగొట్టుకొని నేను వుండగలనా సారథీ! నువ్వు చేతకానితనంలో వూరుకుండి పోయావని నీ మీద కోపించాను. నీలో కదలిక వచ్చింది. అదిచాలు నాకు."

"అయితే పెళ్ళి నీ కిష్టమేనా?" ఆత్రంగా అడిగాడు.

"నీ కోసమేకదా ఎదురు చూస్తూంట."

సారథిలో ఉత్తుంగమైన ఉత్సాహ తరంగాలు లేచాయి. సామ్రాజ్యాన్ని దగ్గరగా లాక్కున్నాడు.

"అడ్వాన్స్‌గా ఏం లాభం లేదు!" నవ్వుతాలుగా అంది.

కౌగిలి బిగించాడు. ముఖం మీద, వక్షం మీద ముద్దులు పెట్టేసుకున్నాడు.

"సశేషం చెయ్యి..." సామ్రాజ్యం నవ్వి విడిపించుకుంది.

సారథి సిగరెట్ వెలిగించుకుని ఆమెకి దగ్గరగా కూర్చున్నాడు. "అయితే పెళ్ళి సంగతి మీ యింట్లో చెప్పెయ్!"

"నాకు సిగ్గు బాబూ" నవ్వింది.

"నేనే వచ్చి చెప్పాలా? మగ పెళ్ళి వారం గదా!"

"సంతోషించాంలే. రాత్రి నేను చెబు తాను. ప్రొద్దుట రా!"

"దట్స్ గుడ్. రేపు సెలవు పెడతాం. నేను కూడా..."

సామ్రాజ్యం తలూపి వాచీ చూసు కుంది. "అయితే ఇక నేను వెళ్ళొస్తాను. ప్రొద్దుట వస్తావు కదా!" గుమ్మం దాకా వెళ్ళి ఆగింది.

"ఆ...ఆగు...!" సారథి మంచం మీది గొలుసులు తీసి ఆమె మెడలో వేశాడు.

"దాకి మరచిపోలేదా?"

"దాకోదు దాంపత్యం. ఆ తర్వాత నగలు కొసరి కిచ్చాను"

"థాంక్స్! నా కష్టంతరం లేదు."

సారథి రోడ్డుదాకా వెళ్ళి ఆటో ఎక్కించి వచ్చాడు.

తెల్లవారే సారథి వెళ్ళాడు. సామ్రాజ్యం కూరలు కొంటూ గుమ్మంలోనే సారథిని [illegible] నవ్వింది. ఆమె రాగానే "ఏమన్నారు?" అనడిగాడు.

"అమ్మా నాన్నా విజయనగరం వెళ్ళారు. మధ్యాహ్నం వస్తారు" సామ్రాజ్యం లోపలకెళ్ళి పూరీ ప్లేటు, మంచినీళ్ళు తెచ్చి టేబిల్ మీద పెట్టింది.

"మన సంగతి చెప్పలేదా?"

"చెప్పాను, ఉదయం వస్తామన్నా రట. నీతో మాట్లాడతారట."

సారథి కాఫీ త్రాగి లేచాడు. "అయితే సాయంత్రం వస్తాను."

"చాల్లే. సెలవు పెట్టావు కదా! ఎక్కడ పూరేగుదామని? మా వాళ్లు వచ్చేదాకా వెళ్ళడానికి వీల్లేదు" శాసిస్తున్నట్లు చెప్పింది.

"పెళ్ళాం లక్షణాలు అప్పుడే వచ్చేశాయి నీకు!"

సామ్రాజ్యం మ్యాగజైన్లు పడేసి "ఇవి చదువుతూండు. నేను స్నానం చేసి వంట ప్రారంభిస్తాను. ఏం వండను నీకు?" అంది.

"నీకు బాగా వచ్చింది వండు."

"నాకు చారు పెట్టడమే బాగా వచ్చు" సామ్రాజ్యం లోపల కెళ్ళింది.

సారథి అరగంట పుస్తకాలతో కుస్తీ పట్టాడు. అక్షరాల మీద లేదు దృష్టి. సామ్రాజ్యం మీద వుంది. వంటింట్లోకి వెళ్ళాడు.

సామ్రాజ్యం కత్తిపీట మీద కూర్చుని వంకాయల్ని ముక్కలు చేస్తోంది. తలంటుకి శిరోజాలు స్వేచ్ఛగా ఎగురుతున్నాయి. ఎరుపంచు తెల్ల చుక్కల నూలు చీర, మోకాళ్ళపైన కుచ్చిళ్ళు లాక్కోవడం వల్ల నీలం లంగా కనిపిస్తున్నాయి.

"ఏమైనా సాయం చెయ్యనా?" సారథి దగ్గరికి వెళ్ళాడు.

"ఉల్లిపాయలు ఒలు ... నీకు గరిట తిప్పడం వచ్చా!" ఉల్లిపాయలిచ్చి అంది.

''రాదు."

''నేర్చుకో. లేకపోతే నేను అవస్థ పడాలి.''

''అదేమిటి నేను వండి పెట్టాలా రోజూ!"

"అప్పుడప్పుడు ఓ మూడ్రోజులు!"

పన్నెండు దాటేసరికి వంట పూర్తయింది. సారథి కిష్టమని పుల్లి గారెలు, సేమ్యా చేసింది. మామిడికాయ పప్పు, గుత్తివంకాయ కూర, పెరుగుపచ్చడి, సాంబారు, అప్పడాలు, వడియాలు, ఆవకాయ...ఇవన్నీ చూసి సారథి దడుసుకున్నాడు.

భోజనాలయ్యాక సారథి, సామ్రాజ్యం హాల్లో కూర్చుని మాట్లాడుకుంటూండగా రాఘవయ్య, సీతమ్మ రిక్షా దిగారు.

వారి భోజనాలయ్యాక——

"రాత్రి అమ్మాయి చెప్పింది బాబూ! నీవల్ల మాకు ఇప్పటికైనా మంచి రోజులు వచ్చాయి! ముహూర్తం పెట్టి మీ నాన్నకి పంపించనా?''

"ఆ పని చెయ్యకండి. పెళ్ళయ్యేదాకా తెలియకూడదు. తెలిస్తే చెడగొడతాడు"

''దయానందం నన్ను తప్పు పడతాడేమో!''

"ఆ బాధ్యత నాకు వదిలేయండి. పెళ్ళికి అమ్మ వస్తుంది.''

తర్వాత నలుగురూ పెళ్ళి ఎప్పుడు, ఎక్కడ, ఎలా జరిగితే బాగుంటుందోనని ఆలోచనలో పడ్డారు. రాఘవయ్య సిద్ధాంతిని కూడా తీసుకు వచ్చాడు. ఆయన పదిరోజుల్లో ముహూర్తం సిద్ధం చేశాడు.

పెళ్ళి సింహాచలం ఆలయంలో!

ఇవన్నీ పూర్తయ్యేసరికి సాయంత్రమైంది. సామ్రాజ్యం టీ తెచ్చి ఇచ్చింది సారథికి. అతడు ప్రయాణమవడం చూసి "వుండిపోరాదూ. వుదయం వెళ్ళొచ్చు" అంది.

''రాత్రి ఒంటిగా ...'' సారథి అంటూండగానే నోరు నొక్కింది. ''సిగ్గు లేకపోతే సరి"

* * *

పెళ్ళయిపోయింది. సారథి ముహూర్తం అయ్యేదాకా భయపడుతూనే







వున్నాడు. ఏదోలా ఇదంతా తండ్రికి తెలిసి, ఎక్కడ వచ్చి అడ్డుపుల్ల వేస్తాడనో. అతడు భయపడినట్టేం జరగలేదు. సలక్షణంగా సామ్రాజ్యం మెడలో మూడు ముళ్ళు వేశాడు.

పెళ్ళికి దమయంతి వచ్చింది. నాలుగు రోజుల క్రితమే ఆమె కోసం బాలాజీని పంపించాడు. బాలాజీ దయానందం ఇంట్లో లేకుండా చూసి పెళ్ళి వార్త చెప్పాడు.

దమయంతి వ్యాకుల పడింది. ఎలా వెళ్ళడమాని? ఆమె ఇంతవరకూ కుటుంబపరంగా ఏ విధమైన సాహసాలు చెయ్యలేదు. ఇంటి దగ్గర అట్టహాసంగా జరగవలసిన పెళ్ళి, ఎక్కడో దొంగతనంగా జరగడమా?

"బాధ పడకండి. ఈ పరిస్థితిలో ఇంతకంటె దారిలేదు. కొన్నాళ్ళుపోయాక పరిస్థితులు చక్కబడతాయి" బాలాజీ ధైర్యం చెప్పాడు.

"అన్నిటికీ ఆ దేవి దయ. నువ్వు మళ్ళీ ఎప్పుడు వెళతావు?"

"రేపు మిమ్మల్ని తీసుకు వెళతాను విశాఖ ఎక్స్‌ప్రెస్‌కి."

బాలాజీ వెళ్ళిపోయాక భరతో ఏం అబద్ధం చెప్పాలోనని తీవ్రంగా ఆలోచించింది. కాకినాడలో వున్న అక్క దగ్గరకి వెళుతున్నట్లు చెప్పింది.

"ఇప్పుడెందుకు ?"

"పెద్ద కూతురికి సూడిదలు ఇస్తున్నారు."

ఏ కళనున్నాడో దయానందం అడ్డు చెప్పలేదు.

బాలాజీని బస్ స్టాండ్‌లో కలుసుకుంది దమయంతి. ఇంటి నుంచి కదిలే దాకా ప్రయాణం జరుగుతుందని ఆమెకి నమ్మకం లేదు.

తల్లి రావడం కొండంత సంతోషంగా వుంది సారథికి.

"నువ్వయినా వచ్చావు. చాలమ్మా."

ఆ సాయంత్రం సారథి, సామ్రాజ్యం ఆఫీసు స్టాఫ్‌కి, స్నేహితులకి పార్టీ చేశారు రాఘవయ్యగారింటి దగ్గర.

సాయంత్రం దాకా అటు - ఇటు తిరుగుతూ నలుగుర్నీ రిసీవ్ చేసుకుంటూ వున్నారు. ఎనిమిదింటికి అతిథులు నెమ్మదిగా జారుకున్నారు. చివర్న వచ్చాడు బాలాజీ!

"పెళ్ళి పెద్దవు ఇప్పుడా రావడం?" సారథి కోపంగా అడిగాడు.

"ఈరోజు ఆట బాగుందిలే, రెండొందలొచ్చాయ్"

"అలాంటిదేదో వుందనుకున్నాను. సమయం ఇప్పటికైనా జ్ఞాపకం వచ్చింది."

సామ్రాజ్యం టిఫిన్, డ్రింక్ తెచ్చి ఇచ్చింది.

బాలాజీ జేబులోనుంచి ఎరుపు, నీలం రెండు వుంగరాలు తీసి సారథికిచ్చాడు.

"ఇది నా చిట్టి కానుక, పరస్పరం మార్చుకొండి"

"చాలా హడావిడే చేశావు ?"

"మార్చు ముందు"

సారథి సామ్రాజ్యానికి ఎరుపు వుంగరం తొడిగాడు.

"కానియ్ చెల్లెమ్మా"

సామ్రాజం సిగ్గుగా తొడిగింది.

"పేర్లు కూడ చెప్పమ్మా ?" సారథి అడిగాడు.

"నేను చెప్పేది విను."

"ముందర టిఫిన్ కానీయ్ అన్నయ్యా! ఆయన మాటల ధోరణిలో నువ్వేం తినడం లేదు" సామ్రాజ్యం హెచ్చరించింది.

"మిమ్మల్ని చూస్తూనే కడుపు నిండుగా వుంది. ఇంకేం తినను ?"

"హోటల్ వాడికిచ్చే డబ్బులు మాకిచ్చేసి చూస్తూ కూర్చో. తిండి శ్రమ వుండదు."

కాసేపుండి బాలాజీ వెళ్ళిపోయాడు.

ఇంతలో కరెంటు పోయింది. సామ్రాజ్యం కొవ్వొత్తులు వెలిగించడానికి లోపలకెళ్ళింది. సారథి సిగరెట్ వెలిగించి విశ్రాంతిగా కూర్చున్నాడు.

"అత్తయ్యగారు పిలుస్తున్నారు" సామ్రాజ్యం కేకవేసింది.

దమయంతి పెరడులో మడతమంచం మీద విసురుకుంటూ పడుకునివుంది.

"పిలిచావా" సారథి ఆమె పక్కన కూర్చున్నాడు.

"ఎన్నాళ్ళు పెట్టావురా సెలవు ?"

"పది రోజులు."

"నేను రేపు వెళుతున్నాను."

"రెండ్రోజులుండమ్మా."

"రాత్రి కార్యం అయిపోతుంది. ఇంకా నేనెందుకు ? మీ నాన్న ఈపాటికే





చిందులు తొక్కుతూ వుంటారు. పెద్దమ్మ దగ్గరకని చెప్పాను."

"ఒక్కదానివే వెళ్ళగలవా? ఎవర్నయినా పంపనా?"

"ఎక్కడా మారక్కర్లేదు కదా. బస్సు ఎక్కించు"

"నాన్నగారితో పెళ్ళి మాట చెబుతావా?"

దమయంతి వెంటనే మాట్లాడలేదు. "పెళ్ళి ఎలాగూ అయిపోయింది. ఇంకా దాచడం ఎందుకు? శుక్రవారం సామ్రాజ్యాన్ని తీసుకురా!"

"ఎందుకూ... గొడవకా?"

"కొత్తకోడలు అత్తవారింటికి రావడం అనమాయితీరా. ఆయన తిట్టినా, ఏమన్నా నువ్వు లెక్క చెయ్యకు. నా ముఖం చూసి రారా!"

సారథి కాదనలేకపోయాడు "అలాగేనమ్మా."

అలారం తొమ్మిదిన్నర చూపిస్తోంది. సారథి లేచాడేమోనని రెండు మూడు సార్లు వచ్చి చూసింది సామ్రాజ్యం.

అవతల దమయంతి ప్రయాణమయి కూర్చుంది, కొడుకుతో చెప్పి వెళదామని ఆగింది. లేపమని చెప్పలేక ఆగిపోయింది.

సామ్రాజ్యం అలారం చెవి దగ్గర పెట్టింది.

సారథి దుప్పటి తీశాడు. గ్రీన్ వెల్వెట్ శారీలో లోయలోని మైదానంలా సామ్రాజ్యం దర్శనమిచ్చింది. "వాట్ డార్లింగ్" దగ్గరకి లాక్కున్నాడు.

"అవతల అత్తయ్యగారు చూస్తున్నారు"

"ఇప్పుడేం లాభంలేదు"

"అలాగని చెప్పేదా?"

"నిన్ను వెళ్ళనిస్తేకదా" ముద్దు పెట్టుకోబోయాడు. సామ్రాజ్యం విడిపించుకుని "మీతో చెప్పమని ఆవిడ ఎప్పుడో వెళ్ళిపోయారు లెండి" అంది.

"అమ్మ వెళ్ళిపోయిందా?" దిగ్గున లేచి సారథి బయటకి వెళ్ళాడు. దమయంతి వంటింటి గుమ్మంలో సీతమ్మతో సంభాషిస్తోంది.

"ఏరా నాయనా బస్ ఎక్కిస్తావా?"

"వచ్చేస్తున్నా" సామ్రాజ్యం యిచ్చిన బ్రష్ తీసుకొని బాత్‌రూంలోకి వెళ్లాడు. సారథి తెమిలి బట్టలు వేసుకునే సరికి గంటన్నర పట్టింది.

"ఎటూ కాని వేళ. భోంచేసి వెళ్ళండి" సీతమ్మ బలవంతం చేసింది. దమయంతి రెండు మెతుకులు తిని బయలుదేరింది.

సామ్రాజ్యం కూడా వచ్చింది బస్ స్టాండ్ దాకా.

దమయంతి యిద్దర్నీ రమ్మని మరీమరీ చెప్పి బస్సు ఎక్కింది. బస్ బయలు దేరాక టౌన్‌లో పని వుందని సారథి వెళ్ళిపోయాడు. సామ్రాజ్యం యింటికి వచ్చింది.

రూప హిందూ చూస్తూ కనిపించింది. "హీరోతో బీచ్‌లో డ్యూయెట్లు పాడుతున్నావా? నేను వచ్చి గంటన్నర యింది."

"నిన్న రావల్సింది. యివాళ కరెక్ట్ టెంకి వచ్చావన్న మాట! నిన్న ఏమయిపోయావు? సారథిగారు కూడ అడిగారు"

"వద్దామని విశ్వప్రయత్నం చేశాను. మా దూరపు బంధువు జీర్ణించిన జబ్బు మాయం చేసుకోడానికి విశాఖ సందర్శించింది."

సీతమ్మ ఫలహారం తెచ్చింది..

"పిన్నిగారూ! సామ్రాజ్యానికి



ముప్పయి ముళ్ళు వేయించేశారు"

"ఇక నీకే వేయించాలి."

"శుభం...కానివ్వండి"

సీతమ్మ నవ్వి లోపలికి వెళ్ళి పోయింది. రూప టిఫిన్ చేస్తూ సామ్రాజ్యంతో వివాహం తరువాత కనిపించే ఎంత శోభని పరిశీలిస్తోంది. సామ్రాజ్యం అందం సహజమైనది. శీతాకాలపు ఉదయం చలి ఎండలో మెరుస్తున్న వికసించిన బంతి చెట్టులా వుంటుంది. లేత అరటి తోటలా కళకళలాడి పోతూ వుంటుంది.

"ఏమిటా చూపు?"

"దిష్టి తగలదుటే"

"ఆఫీసు కబుర్లేమిటి ?"

"గురుమూర్తికి ట్రాన్స్‌ఫర్ అయింది. మరో యిద్దరికి తగల వచ్చు"

"అలాగా. గురుమూర్తి విశాఖదాటి ఎక్కడికీ వెళ్ళనంటాడే !"

"అందుకే అనంతపురం పడేశారు. నీ సెలవు పొడిగిస్తావా ?"

"అవసరం వుండక పోవచ్చు"

ఆఫీసుకి గుడ్‌బై యా ?"
సామ్రాజ్యం చురుగ్గా చూసింది
"మనవి పూర్వం పెళ్ళి చదువులు. ఇపుడు పెళ్ళి వుద్యోగాలు."
"అంటే !" సామ్రాజ్యానికి అర్థం కాలేదు.
"ఉద్యోగం చేస్తూంటే కట్నాల బాధ అంతగా వుండదు. అందుకు"
రూపకి పాతికేళ్ళు. ఎరుపుగా వున్నా స్ఫోటకం మచ్చలతో ముఖం అలుక్కుపోయినట్లు వుంటుంది. ఆకర్షణ కోసం ఆమె వాడని కాస్మొటిక్స్ లేవు.
"ఇంతకీ మీ బావ ఏమంటున్నాడు ?" సామ్రాజ్యం అడిగింది.
"ఈ నెలలో వస్తానని రాశాడు."
"రూపమ్మ పెళ్ళికూతురాయెనే !"
"అప్పుడే జనగణమణ పాడెయ్యకు. క్షణక్షణముల్ పురుష చిత్తముల్"
"నాది హామీ! మీ బావ నిన్ను దాటి పోడు"
రూప నాలిగింటి దాకా కూర్చుంది. వెళ్ళేటప్పుడు సామ్రాజ్యానికి బొట్టుపెట్టి చీర ప్రజంటు చేసింది. "ఉద్యోగం మాత్రం మానెయ్యకు"
గేటుదాకా వెళ్ళింది సామ్రాజ్యం. "అలా ఎందుకనుకున్నావ్ ?"
"సారథిగారికి యిష్టముండదేమోనని"
సామ్రాజ్యం మాట్లాడలేదు.

"సీయూ..." రూప రోడ్డు ఎక్కింది.
రూప మాటలు సామ్రాజ్యాన్ని ఆలోచింపచేశాయి. ఫాన్ వేసుకుని సోఫాలో ఒరిగిపడుకుంది.

రూప చెప్పేదాకా తనకా విషయం తట్టలేదు. సారథికి తను ఉద్యోగం చెయ్యడం అభ్యంతరంగా వుంటుందా ?
వివాహం ఒక మలుపు. మౌలికమైన మార్పులుజరగడానికి అవకాశముంటుంది. సారథి మానేయమంటే ?...




దమయంతి యింటిముందు జట్కా దిగేసరికి, దయానందం వీధి అరుగు మీద వడ్డీ కోసం ఎవరితోనో దెబ్బలాడుతున్నాడు.
దమయంతి లోపలకి వెళ్ళిపోయింది. సమయం రాత్రి ఏడుగంటలు. దమయంతి బట్టలు మార్చుకుని వంటింటిలోకి వెళ్ళింది. వంట చేసినట్లులేదు.
కుంపటి రాజెయ్యసాగింది.
"కాకినాడేనా వెళత?" గుమ్మంలోంచి దయానందం కరకుగా అడిగాడు.
దమయంతి గుండెలు గుబగుబలాడేయి. విశాఖ కొడుకు పెళ్ళి కెళ్ళిన సంగతి తెల్సిపోయిందా? దమయంతికి భర్తకేసి చూసే ధైర్యం కూడా లేకపోయింది.
"అదేం అలా అడుగుతున్నారు?"
"నువ్వు వెళ్ళగానే మీ బావ వచ్చాడు కాకినాడ నుంచి."
అదా విషయం! దమయంతి కాస తేరుకుంది. "నేను వెళ్ళేటప్పటికే ఆయన లేడండీ!"
"మధ్యాహ్నం మూడింటికి బయలుదేరా

నన్నాడు. ఉదయం బయలుదేరిన దానివి కాకినాడ ఎంతసేపు వెళతావు?"

"బస్సులు దొరకలేదు.''

"డైరక్టు విశాఖ బస్సు ఎక్కావు కదా!"

భర్త క్రాసింగ్‌కి కంపరం వస్తోంది. దారిలో చెడిపోయింది."

"మన ముఖం రోడ్డెక్కితే ఏవో అవాంతరాలే!" సణుగుకుంటూపోయాడు.

దమయంతి బలంగా వూపిరి పీల్చుకుంది! ఇప్పటిదాకా తెలియలేదు.అయినా ఎన్నాళ్ళుదాచడం? తెలియకమానదుకదా!

దమయంతికి ప్రయాణపు అలసట వల్ల రాత్రి నిద్ర పట్టలేదు. ఎల్లుండి కొడుకు,కోడలు వస్తారు. రాగానే పోట్లాట వేసుకుంటాడు భర్త. శుభమాని వాళ్ళు రాగానే గొడవడేనికి! అది క్షేమం కాదు. అంటే వాళ్ల వచ్చేసరికి ఈయన యింటి దగ్గర వుండకూడదు! ఎక్కడికి పంపడం? ఎలా పంపడం? తను చెబితే వినే మనిషా?

ఏం చేయాలో తెలియకుండానే నిద్ర పోయింది.

మామూలుగానే తెల్లవారింది. దమయంతి కాఫీ పెడుతూండగా ''దొడ్డా! పూలివిగో" సజ్జలో మందారాలతో తులసి వచ్చింది.

''మీ నాన్న ఏం చేస్తున్నాడే?''

ఆలోచనగా అడిగింది.

"పొలం వెళ్ళాడు."

''రాగానే నేను రమ్మన్నానని చెప్పు."

నర్సింమూర్తి దయానందం జ్ఞాతి. కరణీకం అతడిదే. తామర తంపరలాగ సంతానం. కరణీకంలో ఎంత సంపాదించినా కుటుంబానికి చాలదు. దయానందం అవసరానికి వాడుకుంటాడు తప్ప, పైసా రాల్చడు. చాటుమాటుగా దమయంతే అవి యివి సర్దుతుంది. ఒకళ్ళు కష్టపడితే చూసే స్వభావంకాదు ఆమెది.

"వదినా! పిలిచావా?" ఆమె వంటవు తూండగా నర్సింమూర్తి వచ్చాడు.

దయానందం వేపచెట్టుకి గేదెను కట్టి కడుగుతున్నాడు. పాలేరుమానేసి నాలుగు రోజులయింది. భర్త బయటికి వెళ్ళేదాకా బాతాఖానీ వేసింది.కాఫీయిచ్చింది.'ఎల్లుండి సారథి, పెళ్ళాం వస్తున్నారు. మీ అన్నయ్య సంగతి తెల్సిందే కదా! గావు కేకలు పెడతారు. రాగానే బాగుంటుందీ!"

"సారథికి పెళ్ళయిందా?''

"స్వామ్రాజ్యంతో. ఆపిల్లంటేయిష్టంగా వుంది. అది మీ అన్నయ్య గ్రహించరు. కాపురం చేసుకునేది వాడుకదా!"

"తన పట్టుదలే తప్పఇంకేంచూడడు."

"ఎల్లుండి మధ్యాహ్నం మీఅన్నయ్యని తీసుకెళ్లి, మర్నాడు తీసుకు రా.తర్వాత ఏం జరిగినా బాధలేదు."

నర్సింమూర్తికి అర్థమైంది. "అలాగే వదినా!''

దమయంతి యాభైయిచ్చింది.

"అమ్మాజీ పెళ్ళిచూపులకని తీసుకు వెళతాను.''

"బాగుంది."

శుక్రవారం వుదయం నర్సింమూర్తి దయానందం దగ్గరికి వచ్చాడు. ప్రయాణానికి సిద్ధంగా వుండమన్నాడు.

"ఇవాళ ఎలా కుదురుతుంది? దింపు తీయించాలి.''

వ్యవహారం చెడేలా వుందనిపించింది. నర్సింమూర్తి మాటలధోరణి మార్చి వేశాడు. ''పెద్దవాడివి నువ్వు లేకుండా ఎలాగ వెళ్ళడం అన్నయ్యా! మళ్ళా సరైన ముహూర్తం దొరకదాయె!

అబ్బాయి సెలవుమీద వచ్చాడుట. మళ్ళా ఢిల్లీ వెళ్ళిపోతే మనం ఖర్చులు యిచ్చుకోవాలి. అది భరించగలమా ?"

దయానందం పంచాంగం చూస్తూ "రేపూ బాగానే వుందిరా. రేపు వెళదాం! నాకూ తీరుబడిగా వుంటుంది" అన్నాడు.

"నాకు రేపు కలెక్టరు ప్రోగ్రాంవుంది."

"అన్నీ యిలాగే పీకలమీదికితెస్తావు" దయానందం విసుక్కుంటూ అంగీకరించాడు.

దమయంతికి తొలకరి వాన పడినట్టయింది.

దయానందం వెళ్ళిన అరగంటకే సామ్రాజ్యం, సారథి రిక్షా దిగారు !

దమయంతి హారతియిచ్చి వారిని లోపలకి తీసుకెళ్ళింది. తండ్రి ఎక్కడ వూడిపడతాడో, ఎలా నచ్చచెప్పాలోనని సారథి ఆలోచిస్తున్నాడు.

కొడుకు ఆలోచన గమనించి "ఏదో పనిమీద నర్సాపురం వెళ్ళారు. రేపు మధ్యాహ్నం కాని రారు" అంది.

సారథికి ముసురుమీద సూర్యోదయం.

"అమ్మా ! ఇక్కడికి వెళదామంటే సామ్రాజ్యం వద్దంది" ఫిర్యాదు చేశాడు.

"నేనలా అన్నానా ?"

"అనలేదూ! నేను బలవంతంగా లాక్కొ వచ్చానమ్మా. నీ కోడలికి గట్టిగా క్లాసు యివ్వు, ఎప్పుడూ ఎదిరించకుండా" సారథి నవ్వాడు.

"నేను అలా అనలేదత్తయ్యా !"

"వాడి మాటలు నేను నమ్ముతానుటమ్మా. నడవండి భోజనాలు చేద్దురు గాని. ఒంటిగంట దాటుతోంది" దమయంతి లోపలికెళ్ళింది.

సామ్రాజ్యం సూట్ కేస్‌లో నుంచి లుంగీ, చీర తీస్తూ "అయిందా అబ్బాయి గారిపని. కోతలు కోసినా నమ్మేవారులేరు" ఎగతాళి చేసింది.

"అమ్మడూ! అత్తాకోడళ్లు పోట్లాడుకుంటేనే అందం. మీరు సయోధ్యగా వుంటే మగవాళ్లు యిరుకునపడతారు. అది మన సంస్కృతి కాదు."

సారథి పక్కన రిక్షాలో ఆడకూతురు రావడం గంగమ్మ చూసింది తన అరుగు మీదనుంచి. ఎవరు చెప్మా ! సారథిగాడికి పెళ్ళయిందా? మీమాంస పడిపోయింది సెనుపంచి గంగమ్మ. అడిగితే పోలే... కర్ర ఆడించుకుంటూ "దమయంతీ ఎవరే ఆ పిల్ల?" డైరెక్టుగా వంటింట్లోకి వచ్చేసింది.

"మా కోడలు!"

"అంత గుట్టుచప్పుడు కాకుండా చేశారేమే పెళ్ళి."

"వాడే చేసుకున్నాడు. మేం కాదంటామని?"

"ఔరా!ఏం కలికాలం వచ్చిపడిందిరా, అంతా బ్రహ్మంగారు అన్నట్లే జరిగిపోతోంది. మాకు బూరిముక్కలు లేకుండా చేశావు కదరా సారథీ"

"రేపు వండిస్తాను కావల్సినన్ని."

"పెళ్లిబూరి రుచి వస్తుందిరా...... అమ్మాయ్! ఏవూరు మనది ?"

"రాఘవయ్యగారి సామ్రాజ్యం" దమయంతి గుర్తుచేసింది.

"ఓసి నీ కడుపుడక నువ్వటే! మర్చిపోయాను. అన్నట్టు మీ అమ్మా నాన్నలకయినా తెల్సా పెళ్లి సంగతి."

"తెల్సులెండి..."

గంగమ్మకి కుతూహలం ఎక్కువైంది. ఇక్కడా అక్కడా భోగట్టాలుచేసి వాటికి మెరుగుపెట్టి ప్రచారంచేస్తేగాని గంగమ్మకి

నిద్రపట్టదు.

"కట్నం ఏమిచ్చారే పిల్లా?"

"యాభై వేలు బామ్మా" సారథి చెప్పాడు.

"ఓ నెల వుంటారా యిక్కడ?"

"సెలవు లేదండీ."

"నువ్వూ వుద్యోగం చేస్తున్నావా?"

"మరే, నా ఆఫీసులో...."

"ఇద్దరూ ఒకేచోట. నీ జీతం ఎంత మ్మాయ్?"

సామ్రాజ్యానికి విసుగ్గావుంది. అందు కని మాట్లాడలేదు. గంగమ్మ మరికొన్ని అనుబంధ ప్రశ్నలువేసి, "నీ కోడలు బాగానేవుందే. బంగారు తల్లి" యోగ్యతా పత్రం యిచ్చి కదిలింది.

"ఏమనుకోకమ్మా! పల్లెటూరు కదా, చాదస్తంగా అడుగుతారు." కోడలు ఎక్కడ బాధపడుతుందోనని అనున యించింది.

భోజనాలైనాయి.

సామ్రాజ్యం తాంబూలం చుట్టి భర్త దగ్గరికి పట్టుకెళ్లింది. ఈమెనిచూసి దొంగ నిద్రనటించసాగాడు.

"ఇంచక్కా పిలవగానే వచ్చేస్తోంది నిద్ర" సామ్రాజ్యం కితకితలు పెట్టింది.

సారథి అటు ఇటు కదులుతూ "నిద్ర పాడుచేసున్నావు" అన్నాడు.

"పోతేగదా పాడుచెయ్యడానికి."

సారథి ఆమెను మంచంమీదకిలాగేడు.

"తలుపులు తీసివున్నాయి"

"ఇపుడు మన గదిలోకి ఎవరొస్తారు లేద్దూ"కౌగలి బిగిస్తూ అన్నాడు.

"మీ నాన్నగారు..."

సారథి వదిలేశాడు. సామ్రాజ్యం దిగి వెళ్లి దమయంతి దగ్గర కూర్చుంది.

* * *

సారథి నిద్ర లేచాడు. బద్ధకంగా ఒళ్లు విరుచుకుంటూ కూర్చున్నాడు. సామ్రాజ్యం అలికిడి ఎక్కడా కనిపించలేదు. పిలి చాడు. పలకలేదు.

సామ్రాజ్యం వంటింటిలో హల్వా చేస్తోంది. దమయంతి దగ్గర కూర్చుని అవీ యివీ చెబుతోంది. సారథి వచ్చాడు.

"మీ యింట్లో ఎవరికీ చెముడు లేదు. నీకెలా వచ్చింది?" అంటూ పీటవాల్చుకుని గోడకి జేర్లబడి కూర్చున్నాడు. "అమ్మా! నువ్వుఅర్జంటుగా టీ పెట్టి యివ్వు. నేను అలా పోయిరావాలి."

"నీ భార్య వుండగా నాతో చెబుతా వేంరా?"

"నువ్వు రిటైర్ అయిపోయినట్లా? ఇంకా నువ్వు కొన్నాళ్ళ సర్వీసులోవుండు. దానికి వంటరాదు. మొన్న దొండకాయ వండితే అది కాకరకాయ కూరలా వుంది."

సామ్రాజ్యం ఏం మాట్లాడలేదు. పళ్లతో పెదాలు కొరికి చూడసాగింది.

దమయంతికి వారి సరాగం కన్నుల పండుగగా వుంది.

సామ్రాజ్యం భర్తకి ప్లేటులో హల్వా పెట్టింది. సారథి కోపంగాచూస్తూ కూర్చు న్నాడు. "నాకు హల్వా సహించదు!"

"అదేమిట్రా...చేస్తుండగానే తినేసే వాడివి" దమయంతి అడిగింది.

"అది పూర్వం."

అత్తగారికి ప్లేటు యిచ్చి, తను తీసు కుని "మీరు తినండి. ఆయనకి నిజంగానే సహించదు" నవ్వు ఆపుకుంటూ అంది.

"సహించనపుడు ఎందుకు చేశావే!"

"మీకు, నాకు యిష్టంకదా" తింటూనే అంది.

"నీ పక్షపాతబుద్ధికి తగిన శిక్ష విధించ

 



బడును" ఉక్రోషంగా అన్నాడు.

"అత్తయ్యా! ద్రాక్షపళ్ళతో మంచి రుచివచ్చింది. తినని వాడిది పాపం! ఏం చేస్తాం... మీకు కాస్త వేస్తా నాగండి'' ఓరగా మొగుడ్ని చూస్తూ వుడికించింది.

"వాడు తినకుండా ఎలాగమ్మాయ్?''

"అయనకి శుక్రవారం మధ్యాహ్నం టిఫిన్ చెయ్యకూడదని నియమం వుంద త్తయ్యా! మీరేం బాధపడకండి''. సారథికి ఒళ్ళు మండి సోపు తీసుకుని బావి దగ్గరికి వెళ్ళాడు. ముఖం వాష్ చేసుకుని, నేరుగా తన గదిలోకి వెళ్ళిపోయాడు. ఈల వేస్తూ-బట్టలు వేసుకోసాగాడు. సామ్రాజ్యం హల్వా, జీడిపప్పు తీసుకువచ్చింది.

''పతిదేవా! ఆరగించండి.''

"ఫలహారాన్నా? పెళ్ళాన్నా?'' ఆమెకి దగ్గరగా వెళ్ళాడు.

"డైలాగులు ఘోరం. అచ్చు సినీ విలన్?''

''ఇప్పుడు నేను విలన్నే. మా అమ్మ

అంత చూసుకుని నన్ను పరిహసిస్తావా? నువ్వేంపెట్టినా తినను, త్రాగను. ఇదే నా శపథం."

కుడికాలు పైకి మడచి మంచం వారగా కూర్చుంది. "ప్లీజ్! నా ముఖంచూసి మీ శపథం వుపసంహరించుకోరూ? ప్లీజ్!"

"లాభం లేదు."

"ఇక్కడ మీకు ప్రయివేటుగా పెడదామని అలా చేశానండీ."

"నిజా!"

"ముందర హల్వా తినండి."

"ఆల్‌రైట్?"

సారథి టీ తాగి సిగరెట్ వెలిగించి "నేను అలా వూర్లోకి పోయివస్తాను. ఓ గంటలో వచ్చేస్తాను" చెప్పి నడిచాడు.

సాయంత్రం కాంతిలో పల్లె ఉదయం పూట గోధుమ చేనులా మెరసిపోతోంది. ఊర్లో జరిగిన మార్పులు గమనిస్తూ పోతున్నాడు సారథి.

"సారథీ..." కిళ్ళీకొట్టునుంచి పిలుపు.

సారథికి ఎవరు పిలిచారో తెలియలేదు. రోడ్డుమీద గొల్ల మంగన్న మేకలు తోలుకు పోతూ "కిళ్ళీ కొట్టాయన పిలిచాడండీ'' అని చెప్పాడు.

సారథి కొట్లోకి వెళ్ళాడు. "నువ్వా!" అన్నాడు రావుని చూసి.

రావు సోడాలు పడుతున్నాడు. కర్ర స్టూలు బయట వేశాడు సారథి కూర్చోడానికి!

"ఈ షాపు నీదేనా!"

రావు తలూపాడు. సారథికి నిమ్మ సోడా తయారుచేసి యిచ్చాడు.

"యం. కాం. ప్యాసయి కిళ్ళీదుకాణం పెట్టావా?" బాధగా అడిగాడు సారథి.

"యం.కాం. డిగ్రీ విలువైనదనుకుంటున్నావా? చదువుకోసం ఇరవై వేలు తగలేసుకున్నాక తెల్సింది. ఎవర్నో ప్రాధేయ పడితే లాభంలేదు. సొంత కాళ్ళమీద నిలబడాలి."

"స్వయం ఉపాధి పథకమా?"

"ఇంటర్వ్యూలకి తిరిగి తగలేయగా ఇంకా అర ఎకరం మిగిలింది. అది అమ్మి పెట్టాను."

సారథికి బాధ వేసింది. ఇలా ఎందరో రావులు వున్నారు.వారికి వెలుగు ఎప్పుడు? వెన్నెల ఎప్పుడు?

"నా గొడవకేం గాని నీ విషయాలు చెప్పు. ఆ మధ్య నీ పెళ్ళి ఆగిపోయిందన్నారు కట్నం పేచీవల్ల!"

"తిరిగి జరిగింది రహస్యంగా''

"అదేం?''

"మానాన్న విలన్ అవుతాడని.''

"ఆ అమ్మాయేనా?"

"అవును."

"సాధించావు. డబ్బు మనం ఎలాగయినా ఎప్పుడైనా సంపాదించుకుంటాం సారథీ! వ్యక్తులని జీవితకాలంలో సంపాదించుకోలేం.''

"ఈ సూత్రం అందరికీ తెలిస్తే బాగుండును"

సారథి అతడు కొట్టు కట్టేసే దాకా కబుర్లు చెబుతూ అక్కడే కూర్చున్నాడు. రావు అతణ్ని ఇంటి దగ్గర దిగబెట్టాడు.

* * *

దమయంతికి ఆరోజు చాల పెందరాళే మెలకువ వచ్చేసింది. కోళ్లు కూస్తున్నాయి. ఇంకా వెలుగు విచ్చుకోలేదు. దమయంతికి నిద్ర పట్టలేదు. అంతా అందోళనగా వుంది. భర్త ఇంటికి తిరిగివచ్చే రోజు. ఏం గొడవవుతుందో?

తలంటుపోసి బట్టలు పెడితే తనకి




బాధ వుండదు. భర్తవస్తే ఇవన్నీ పీలు పడకపోవచ్చును! "సామ్రాజ్యం" అని పిలిచింది.

"అదిగో మీ అమ్మగారుపిలుస్తున్నారు. వదలండి."

"ఇంకా తెల్లవారి వుండదు. ముసలి వాళ్ళకి నిద్రపట్టదు. పడుకుందూ!''

"మీకు సిగ్గులేదుకాని, నాకు వుంది.''

సామ్రాజ్యం విదిలించుకుని లేచి వెళ్లింది.

తొమ్మిది గంటలయింది. దమయంతి ఇద్దరికీ తలంటుపోసి కొత్త బట్టలు పెట్టింది. మిగిలిన తన నగలుకూడ కోడలికి ఇచ్చివేసింది.

"అన్యాయం అమ్మా! అన్నీ దానికేనా? నీకు పక్షపాతం ఎక్కువయిపోయింది.''

"దానికి ఇవ్వక ఎవరికిస్తారా?''

"నీ దగ్గర ఇవన్నీ కొట్టెయ్యడానికి వినయం నటిస్తున్నానని రాత్రి నాతో చెప్పింది. దాని నాటకంలో పడిపోయావు నువ్వు.''

"ఏమిటా మాటలు. నిజపస్తుకో గలరు.''

"నీ విషయంలో వాడేం చెప్పినా అబద్ధమే అనుకుంటాను'' అంది దమయంతి ఆప్యాయంగా.

సామ్రాజ్యం పాదాభివందనం చేసింది అత్తగారికి.

"కలకాలం సుఖంగా వుండండమ్మా!" నిండుగా ఆశీర్వదించింది.

"బంగారు సామ్రాజ్యం'' ఆమె చేతిలో నగలు చూసి నవ్వాడు.

"దుద్ధగా వుంది. మీరే పెట్టుకోండి'' నగలు ఇస్తూ అంది.

దమయంతి వంట చెయ్యడానికి లోపలకి వెళ్ళింది. సామ్రాజ్యం టిఫిన్ తీసుకు వచ్చింది సారథికి.

మరికాసేపట్లో ఎదురుచూసిన ఉపద్రవం రానే వచ్చింది. మధ్యాహ్నం రెండు గంటల ప్రాంతంలో...సారథి నిద్రపోతున్నాడు. హాల్లో దమయంతికి పత్రిక చదివి వినిపిస్తోంది సామ్రాజ్యం. దయానందం కండువాతో ముఖం తుడుచుకుంటూ 'ఏం ఎండలు ఘోరంగావున్నాయి' అనుకుంటూ లోపలికి వచ్చాడు.

దమయంతి ''లోపలికిరా అమ్మాయ్'' అని వసారాలోకి వెళ్ళిపోయింది. దయానందం ఇంకా పరీక్షించి చూడలేదు.

"నా పనంతా తగలేశాడు సన్యాసి'' దయానందం కుర్చీలో కూర్చున్నాడు.

సామ్రాజ్యం ఆయనకి మంచినీళ్ళు ఇవ్వబోయింది. దమయంతి వారించింది "నేను యిస్తాలే."

"ఫర్వాలేదండీ'' సామ్రాజ్యం గ్లాసు తీసు కెళ్లింది.

"ఎవరూ?''కళ్ళజోడు తీసిచూశాడు.

"నమస్కారం మామయ్యగారూ! సామ్రాజ్యాన్ని.''

దయానందం ఉలిక్కిపడ్డాడు. మంచి నీళ్లు త్రాగడం కూడ మరచిపోయాడు.

''వరుస బాగానే కలిపావు. పెళ్లి కోసం నిన్ను తోలాడన్నమాట మీ నాన్న.

''ఆయనేం చెయ్యలేదు లెండి. మీ అబ్బాయే చేశారు.''

''అంటే...'' కటువుగా చూశాడు.

''నన్ను పెళ్లి చేసుకున్నారు."

బాంబు పడినట్లయింది దయానందానికి. హడావిడిగా లేచాడు. ''పెళ్లి చేసుకున్నాడూ? ఎవర్ని అడిగి? అంతా వాడి ఇష్టమేనా?''

సామ్రాజ్యం మాట్లాడలేదు.

దయానందంలో చెప్పలేని అశాంతి.



కొడుకు ఏదోనాడు తనమాట వినక పోడని, 'యాభై వేల'సంబంధం చేసెయ్యొచ్చునని అనుకుంటూ వచ్చాడు. అసలుకే మోసం వచ్చింది!

కొడుకు తనని నిర్లక్ష్యం చేశాడు. దెబ్బకొట్టాడు. గడ్డిపరకలా తీసివేశాడు. తన మాటే తుది తీర్పుగా చలాయించే దయానందం యాభైయేళ్ళ వయసు తీవ్ర మైన ఆశాభంగం చెందింది. మాట తిరగక నిశ్చేష్టుడై కూర్చుండిపోయాడు బల్లమీద!

సామ్రాజ్యానికి ఆయన ధోరణి తెలియనిది కాదు.

"మిమ్మల్ని సంప్రదించమని చెప్పాను కాని ఆయనకి మీరంటే భయం ఎక్కువ కదా! మిమ్మల్ని ఒప్పించలేమని తగ్గిపోయారు. దానికి మమ్మల్ని క్షమించండి. మిమ్మల్ని అవమానం చేద్దామనికాదు."

"నోర్ముయ్! అంతాచేసి యిపుడు నీతులు చెబుతున్నావా? వాణ్ని వలలో వేసుకుంటే చాలని చూశావు తండ్రీ కూతురూ. శభాష్......తెలివి అలాగ వుండాలి. కానీ కట్నంలేకుండా ఖరీదైన

మొగుణ్ని సంపాదించావు."

"మమ్మల్ని అర్థం చేసుకోండి."

"ఆ అవసరం నాకేంలేదు."

"మీరు విశాల హృదయంతో మన్ని స్తారని ఆశతోనేవచ్చాం" అంది చేతులు జోడిస్తూ.

దమయంతి ఉద్వేగంగా చూస్తోంది.

"అఘోరించావు! తప్పులు చేస్తూ వుండండి. నేను వెర్రి వెధవలా మన్నిస్తూ కూర్చుంటాను" దయానందం భార్యకేసి తిరిగాడు "ఇలారా!"

దమయంతి వచ్చింది.

"నువు కాకినాడ వెళ్ళావు, అవునా?"

"........."

"మీ అప్పగారి కూతురి సూపీపలకి వెళ్ళావు."

"వెయ్యి అబద్ధాలాడి పెళ్లి చేయ మన్నారు. అవునా? మొన్న నువ్వు విశాఖ పట్నం వెళ్లి కొడుకు పెళ్లి చేయించి వచ్చావు. అవునా?" కర్కశంగా అరి చాడు.

"మీరు ఆవేశపడకండి."

కొట్టినంత వేగంగా దగ్గరకెళ్ళాడు. "మీరేం చేసినా నేను వెధవలా నోర్మూసు కుని కూర్చోవాలి! అవునా? పిలవడానికి వాళ్ళకి బుద్ధిలేకపోతే, వెళ్ళడానికి నీకెలా బుద్ధిలేకపోయింది? నేనంటే లక్ష్యంలేదు. అవునా?"

"కుర్రాళ్లు యిష్టపడ్డారు ... మనం కాదన్నా ఆగుతారా?"

"అందుకే అక్షింతలు వేసి వచ్చావు. నేను చచ్చాననుకున్నావా? నీకింత స్వతం త్రం ఎలా వచ్చింది? వాళ్ళతోబాటు నువ్వూ నన్ను గాడిదని చేస్తావా?"

"మీరనుకుంటున్నారు కాని, మీరంటే వాళ్ళకి గౌరవం పోలేదు. మీ ఆశీస్సుల కోసమే వచ్చారు!"

"అవుని చంపి చెప్పులు దానంచెయ్య డం! మంచి నీతిపాఠం. మీరంతా ఒకటై వెన్నుపోటుపొడిచారన్నమాట. కానివ్వండి యింకేం చెయ్యదల్చుకున్నారో."

దయానందం ఓడిపోయిన ఆటగాడిలా ముఖం నలుపుచేసుకున్నాడు.

"ఎందుకండీ అంత మాటలు? పెళ్ళి చేసుకున్నారు కాని, అపరాధంఏమీ చెయ్య లేదుకదా? మీ మీద భయంవల్ల చెప్పరే దంతే."

"నీకు సంబరంగావుందేమో బోడి పెళ్లి. నేను కాదన్న సంబంధం నాకు తెలియ కుండా చేసుకు వస్తాడా? ఇదంతా నామీద గౌరవం వల్ల, భయంవల్ల.కొడుకుని, కోడ లిని వెనకేసుకుని వస్తావు. నీకు ఇంగితం వచ్చిందా?"

దయానందానికి రోహిణీఎండలో రాతి బండమీద నడుస్తున్నట్లుంది. ఆవేశంతో ఆగ్రహంతో మనిషి చలించి పోతున్నాడు.

ఈ కేకలకి సారథికి మెలకువ వచ్చింది. వెంటనే లేచి హాల్లోకి వచ్చాడు. దయా నందం రోతగా చూశాడు.

"రాఘవయ్యగారి అల్లుడుగారా?"

"మీ కొడుకును కూడా."

"నా కొడుకు వయితే ఈ పనిచెయ్య వురా? ఛీ...నీ బ్రతుకు చెడ. ఇంతకంటె మంచిసంబంధం రాదనుకున్నావా? ఇంత కంటె రంభ దొరకదనుకున్నావా? మన ఆస్థికి అంతస్థుకి సరిపడ్డ సంబంధమేనా యిది? ఎర్రగా బుర్రగా వుందని వాళ్ళ గుమ్మాలలో పడి ఏడ్చావు. బుద్ధిలేని కుంకలు పబ్బం గడుపు కున్నారు."

సామ్రాజ్యానికి తనవాళ్ళని నిందించ డంతో కోపం కల్గింది. కాని తమాయించు కుంది. వాళ్ళ మాటల మధ్య తను తల

మార్పువం ఎందుకని ఆగిపోయింది.

దమయంతి భర్త యింకా భోజనం చెయ్యలేదని గమనించింది. "పొద్దు పోయింది. లేవండి భోజనానికి."

"చాల్లే ... యిప్పటికే కడుపునిండి పోయింది. ఇంకా అన్నం ఏమవక్కర్లేదు."

దయానందం చిరాగ్గా మంచంమీద కూర్చున్నాడు. చాలాసేపు ఏం మాట్లాడ లేదు. అందరూ బొమ్మల్లా నిలబడి వున్నారు.

"పెద్దవాడి వయ్యావు. నా అవసరం లేదు. నేను కావన్నా నీకు లెక్కలేదు. రెక్కలు వచ్చాయి. పెళ్ళాన్ని పోషించు కుంటావు. ఏరుదాటాకా తెప్పఎందుకురా ? నీలాంటి కొడుకుని కన్నందుకు చాలా గర్వంగా వుంది."

దయానందంలో వ్యథ తొంగి చూసింది.

"సామ్రాజ్యం సంబంధం మనం చిన్నప్పటి నుంచీ అనుకుంటున్నది. డబ్బు దగ్గర ఆమెని పోగొట్టుకోవాలనిపించలేదు. ఆమెను తప్ప వైవాహికంగా ఎవర్ని చేసుకున్నా నేను సుఖపడలేను. అందుకే ఈ విషయంలో మిమ్మల్ని ఎదిరించాను."

"నోర్ముయ్! పెంటమీద దొరుకు తాయి పూలు. అంచేత కళ్ళకద్దు కుంటామా? మా అభిప్రాయం, అంతస్తు నీ కక్కరలేదు. పెళ్ళి చేసుకుని సిద్ధ మయ్యావు. మేం చప్పట్లు కొట్టాలి. ఈ దయానందం అలాంటి పిచ్చిపని చెయ్యడు. నీకు తోచినట్టుగా నువ్వు చేశావు. బాగుంది. మేం కూడా మాకు తోచినట్టు చేసుకుంటాం!"

కోపం, బాధ, నిరాశ, నిస్పృహాయత దయానందంలో తొంగిచూశాయి. తండ్రిని చూడగానే, సారథికి కాస్త జాలి వేసింది. తన మూలంగా ఆయన బాధపడు తున్నాడు మానసికంగా. కాని తను తప్పు చేశాడా? ఒకే వస్తువుని వేర్వేరు రంగుటద్దాలలో తాము ఇద్దరూ చూస్తు న్నారు.

ఆయన రంగు ఆయనది. తన రంగు తనది.

"ఈ రోజునుంచి నువ్వు నా కొడుకువి కాదు. నాకు కొడుకే లేడనుకుంటున్నాను. నీ పెళ్ళాన్ని తీసుకుని దయచేయి. ఎప్పుడూ రాకు. ఈ ఇంటితో ఇక నీకు ఎలాంటి సంబంధమూ లేదు. గుర్తుంచుకో!"

"మీరు మమ్మల్ని అర్థం చేసుకోవడం లేదు."

"చేసుకున్నది చాలు. చేసిన నిర్వాకం చాలు. ముప్పయి ఏళ్ళు పెంచిన తండ్రిని వదలి నువ్వు వుండగలవు! ఆ టక్కులమారి లేకపోతే బ్రతకలేవు. శభాష్! దాన్ని పెట్టుకునే కులుకు! ఇలా వచ్చి వూళ్లో నన్ను గాడిదను చెయ్యకు. నీ నీడకూడా ఇంటి మీద పడడానికి వీల్లేదు. పట్టుదల వస్తే నేను రాక్షస ముండాకొడుకుని!"

"వాళ్ళతోపాటు పంతాలకి పోతా రేమిటి? పిల్లలన్నాక తప్పులు చెయ్యరా? మనమే చిరాకుపడితే ఎవరు చూస్తారు వాళ్ళని?" దమయంతి ఎదురొక్కంది.

"నువ్వు వాగితే పళ్ళు రాలకొడతాను. కావలిస్తే వాళ్ళతో నువ్వుకూడా చావు. నాకు పీడ వదులుతుంది. నేను కావాలను కుంటే వాడా పని చేయడే ! ఉన్నాడుగా మామ! రాఘవయ్య... కూతుర్ని వుసి కొల్పి పెళ్ళి చేయించిన దవట... చూస్తాడు."

సామ్రాజ్యం ముఖం పొంగింది. సారథి ఆమె దగ్గరకొచ్చి "బట్టలు సర్దు.

ఇంకా ఎందుకు? మనమేం చెప్పినా లాభం లేదు" నెమ్మదిగా అన్నాడు.

సామ్రాజ్యం లోపల కెళ్ళింది.

"ఈ ఆస్తిలో నీకు పైసారాదు, గుప్త పెట్టుకో" అక్కసున్న చూపాడు.

"నాకు మనుషులు కావాలి. డబ్బు కాదు."

"ఈ వెధవ కబుర్లకేంలే! కీళ్లు వంగితే కాని డబ్బు విలువ తెలియదు. అప్పుడు అఘోరిస్తావు - చేసింది ఎంత చవట పనో!"

సారథి గదిలోకి వెళ్ళి బట్టలు వేసుకున్నాడు. సామ్రాజ్యం రెడీగా వుంది. లోపలకెళ్ళి దమయంతికి పాదాభివందనం చేసింది.

"ఆయన మాటలేం పట్టించుకోకమ్మా. వాడసలే అశ్రద్ధ మనిషి. నువ్వయినా ఉత్తరాలు రాస్తూండు. నాకు తోచదు లేకపోతే."

"మీరేం బెంగ పడకండి. త్వరలోనే పరిస్థితులు చక్కబడతాయి. మావగారు మన్నిస్తారు మమ్మల్ని."

సారథి కూడా తల్లితో చెప్పి సూట్ కేస్‌తో వచ్చాడు. పయానందం ఋసలు కొడుతూ అరుగుమీద కూర్చున్నాడు.

"వెళ్ళి వస్తాం నాన్నగారూ!" సారథి చెప్పాడు.

"వెళుతున్నారు. రావానికి మీకేం అధికారం లేదు. రావద్దు కూడా. వస్తే వెట్టివాడిచేత గెంటిసాను" తలుపులు ఢఘ్మన మూశాడు లోపలికెళ్ళి.

"ఏం మనిషో" సారథి నిట్టూర్పు విడిచాడు.

దమయంతి పెరటి తలుపు తీసుకుని, పక్కగేటు గుమ్మం ద్వారా రోడ్డుకేసి చూడసాగింది. దూరమై పోతున్న కొడుకూ—కోడలు. ఆమె మనస్సు విహ్వలతకి లోనయింది. దుఃఖం ముంచుకు వచ్చింది.

"ఎందుకే ఆ వెధవ ఏడుపు?" బావి దగ్గర కాళ్లు కడుక్కుంటూ కసురు కున్నాడు.

"ఇప్పుడు కడుపునిండుగా వుందా మనకి? మన మర్యాద మనం నిలబెట్టుకుంటే వాళ్ళు ఎదిరించి పెళ్ళి చేసుకునే స్థితి ఎందుకు వస్తుంది? ఒక్క నలుసు. ముద్దు మురిపెంగా చూసుకుందామన్న జ్ఞానం లేదాయె!"

దుఃఖోద్వేగంతో దమయంతి మంచి పడింది.

వచ్చిన పదిరోజులదాకా సారథి ఆ షాక్‌నుంచి కోలుకోలేదు. తండ్రి తిట్టి నందుకు అతడు పెద్దగా బాధపడలేదు. తండ్రి భావాలు చిన్నప్పట్నుంచి పరిచయమైనవే. కాని తను శాశ్వతంగా ఆ యింటికి దూరమయ్యాడు. తను లేవను కునే స్థితికి తండ్రి వచ్చాడు. ఇంతదారుణమైన నిర్ణయానికి తండ్రి రావడం అతడికి బాధగా వుంది.

యాంత్రికంగా ఆఫీసుకి పోయి వస్తున్నాడు. మనిషిలో స్తబ్దం. నిశ్శబ్దం. భర్తని సామ్రాజ్యం గమనిస్తోంది.

ఓనాటి వుదయం. సారథి ముఖం కడుక్కుని వార్తలు వింటూ కూర్చున్నాడు. సామ్రాజ్యం కాఫీ అతడికిచ్చి తను కూడా తెచ్చుకుని ఎదుట కుర్చీలో కూర్చుంది.

సారథి త్రాగేస్తున్నాడు.

"అయ్యో పంచదార వెయ్యలేదండీ!'' అని రుచి చూసిన సామ్రాజ్యం లేచి పంచదార తెచ్చింది.

"అవస్తుండా తాగేస్తున్నారంటే, మీ ప్రశ్నే ఇక్కడ లేవన్నమాట. మీప షంతా అదే ఆలోచిస్తున్నారా?"

"లేదు"

"లేకపోతే మీరింత దిగులు పడటం దేనికి?"

"అమ్మని చూడటం పడదనే నా బాధ సామ్రాజ్యం!"

"ఎక్కడికో వెళుతున్నానని చెప్పి, ఆవిడ ఎలాగూ వస్తారు. మీరు అన్నీ ఆలోచించుకుని బాధపడకండి. రోజులన్నీ ఒకేలా వుండవు. పట్టుదలలు కూర్చుంటాయా?"

సారథిలో స్పందన ఎక్కువ. ప్రతీ చిన్న విషయానికి చలించిపోతాడు. దాన్నే ఆలోచిస్తూంటాడు. బెంగపడతాడు. బేజారు పడతాడు.

"మీరిలా డల్ గా వుంటే నాకేం తోచడంలేదు" తిరిగి ఆమె అంది.

తనవల్ల సామ్రాజ్యం కూడా బాధపడుతోందని తెల్సి సర్దుకున్నాడు. నవ్వుతూ "తోచాలంటే ఏం చేయాలి" అనడిగాడు.

"ముద్దు అబ్బాయికి అన్నీ చెప్పాలి."

"ముద్దు అబ్బాయా? సరే కాఫీతో పాటు ముద్దు కూడా పడేసుండు."

"నేనూ అదే అనుకుంటున్నా" అతడి చిరునవ్వు చూసి సంతోషపడింది.

రోజులు గడుస్తున్నాయి. సామ్రాజ్యం ఎన్నాళ్ళ నుంచో భర్తను అడగాలనుకుని మరచిపోతోంది ఆ సంగతి. ఓ రోజున ఆఫీసునుంచి వస్తూండగా, సిటీ బస్ దొరకలేదు. ఆటోలో బయలుదేరారు ఇద్దరూ.

"పెళ్ళయ్యాక రూప వుద్యోగం మానివేస్తుందిట" కాల్పనికంగా అంది.

"ఎందుకు?"

"వాళ్ళ బావకి పెళ్ళాం వుద్యోగం చెయ్యటం ఇష్టం లేదట"

"వెనుకబడిన మనిషి మాట."

"నన్ను కూడా "మానేస్తావా?" అని అడిగింది."

"ఏమన్నావ్?"

"నేనేం చెబుతాను? మీ యిష్టం."

"నేను మానెయ్యమంటాననా నీ వుద్దేశం?"

"మీ ఇష్టం ఏదైనా సరే! నాకు ఆనందమే."

"నాకోసం నీ వ్యక్తిత్వాన్ని కుదించుకో నక్కరలేదు సామ్రాజ్యం! అన్నిటిలోను నీకు స్వేచ్ఛ వుంది. ఒకర్ని శాసించడం నా కిష్టముండదు."

సామ్రాజ్యం హృదయం తేలికపడింది.

సారథి ప్రసంగం మార్చాడు. "మీ చిదంబరం జాడ తెల్సిందా?"

"బుద్ధి తిరిగితేనే కాని రాడు. కావాలని వెళ్ళినవాణ్ని వెతకడ మెందుకు?"

"చిదంబరం నాలుగు సినిమాల్లో నటించి వసే మావాడు అంటూ బ్రహ్మరథం పట్టేస్తారు మీరు"

"బావమరిది లక్షలు గడించి వస్తాడని కలలు గంటున్నారా?"

"నీకు ఘనంగా ఆడపడుచు లాంఛనాలు పెడతాడు."

"మీక్కూడా ఒకటో రెండో లక్షలు పడేసాడు."

"విశాల హృదయంతో మీ చెల్లిని పెళ్ళిచేసుకున్నాను కనుక ఇవ్వడం నీ ధర్మం అని చెబుతాను చిదంబరం వచ్చాక!"

ఆటో గుమ్మంలో ఆగింది.

నెలరోజులు గడిచాయి. సారథికి






యింకా మావగారి యింట్లో వుండటం భావ్యంగా తోచలేదు, బాలాజీని యిల్లు చూడమన్నాడు.

వారం రోజుల్లో తమ పక్క మేడ లోని వాటా ఖాళీ అయిందని చెప్పాడు. సారథి వెళ్ళి చూశాడు. అతనికి నచ్చింది. సామ్రాజ్యానికి చూపించి సాయంత్రం అడ్వాన్స్ ఇచ్చేశాడు.

మంచిరోజు చూసి యింట్లోకి మారారు. రాఘవయ్య వద్దంటున్నా మృదువుగా తిరస్కరించారు. రాఘవయ్య, సీతమ్మ వచ్చి నాలుగూ సర్దుకునేదాకా వున్నారు. మామగార్ని, అత్తగార్ని తమ దగ్గరే వుండమన్నాడు.

"ఇంకా ఓపిక వుంది కదోయ్!"

మర్నాడు రాఘవయ్య, సీతమ్మ వెళ్ళిపోయారు. బాలాజీ దగ్గర రెండు వేలు తీసుకుని ఇంట్లోకి కావాల్సిన సామాన్లు కొన్నాడు.

సామ్రాజ్యానికి సేవింగ్స్ ఇంకా నాలుగు వేలున్నాయి. అవి వుండగా అప్పు ఎందుకంటుంది ఆమె!

"డబ్బు వుంటే ఖర్చవదా? అవసర మొస్తే అదీ ఖర్చుపెడదాం"

ద్విపాత్రాభినయం ఎంత కష్టమో సామ్రాజ్యానికి తెలిసి వచ్చింది. ఇన్నాళ్ళు తల్లి వంట సంగతి చూసుకునేది. సమస్య లేదు. ఇపుడు యింటి పని చూసుకుని ఆఫీసుకి వెళ్ళాలి. ఇంటాబయట పనులతో ఆమెకి విశ్రాంతి వుండటం లేదు.

"ఒక పూట వంట నీది. రెండో పూట నాది. అలా పంచుకుందాం" సారథి సూచన చేశాడు.

"సంతోషించాం"

"నువ్వు అవస్థపడితే చూడలేకుండా వున్నానమ్మడూ"

"కళ్ళు మూసుకుంటే సరి!"

సారథి కూడా చిన్న పని పెద్ద పని సాయం చేస్తూనే వున్నాడు. సామ్రాజ్యానికిది తెరిపిగా వుంది. కష్టపడుతున్నా భర్త ఔదార్యంలో తెలియడం లేదు.

రోజులు గడుస్తున్నాయి. సామ్రాజ్యం అత్తగారికి సర్వీసుపూర్తి అడ్రెస్‌కి వుత్తరాలు రాస్తోంది. దమయంతి కూడా తరచుగానే రాస్తోంది.

దయానందం కొడుకుతో సంబంధాలు తెంచుకోడంతో ఆగలేదు. ఓ పెళ్ళిలో సూర్య భగవాన్ కనిపించాడు దయానందానికి. సూర్య భగవాన్, సారథి ఆఫీసరు అని తెల్సుకున్నాడు. దయానందం అయిదువందలు అతడి చేతిలో పెట్టి "మా వాడి వుద్యోగం ఎలాగయినా వూడగొట్టాలి" అని కోరాడు.

సూర్య భగవాన్ ఆశ్చర్యపోయాడు.

"ఎందుకండీ!"

"నేనంటే లెక్కలేదు వాడికి. ఉద్యోగం పోతే తెలుస్తుంది. పెళ్ళాం మీదపడి ఎన్నాళ్ళు తింటాడు? నా కాళ్ళమీద పడవల్సిందే?"

సూర్యభగవాన్ లంచాల మనిషి మరో రెండువేలు గుంజి అలాగే చేస్తానని ఒప్పుకున్నాడు. వారం రోజులు రంధ్రాన్వేషణం చేసి, ఛార్జిషీటు తయారు చేసి సస్పెండు చేశాడు. ఈ పరిణామానికి సారథి విస్తుపోయాడు.

"ట్రిబ్యునల్‌కి వెళ్ళమని" మిత్రులు ఒత్తిడి చేశారు.

సారథి లాయర్‌ని మాట్లాడాడు. కేసు నడుస్తోంది.

న్యాయం ఈ దేశంలో ఖరీదైనది. దాన్ని పొందడానికి ధనం వుండాలి. సారథికి కేసులో తల దూర్చాక ఎంత డబ్బూ చాలడం లేదు.

లాయర్ టెలిగ్రాం యిచ్చాడు. హైదరాబాద్ రమ్మని. అతడి దగ్గిర డబ్బంతా అయిపోయింది, ఇక సామ్రాజ్యాన్ని అడగాలి. అందుకు చిన్నతనంగా వుంది.

మంచంమీద భారంగా పడుకున్నాడు. సామ్రాజ్యం సాయంత్రం రాగానే వైర్ చూసింది. "ఎప్పుడెళతావు?"

"డబ్బు వచ్చాక"

సామ్రాజ్యం టీ పెట్టడానికి వెళ్ళింది. తన దగ్గర కూడా భర్త ముఖమాటం పడటం ఆమెకి నచ్చలేదు.

మర్నాడు బ్యాంకునుంచి నాలుగు వేలు డ్రా చేసి అతడికిచ్చింది.

"ఎందుకింత? ఇప్పటికే..." ఆగిపోయాడు.

"పూర్తి చేయండి...అవమానంగా




భావిస్తే ఎలా? మీరు వేరు, నేను వేరు అని నేను అనుకోవడం లేదు. మీరు మాత్రం అనుకుంటున్నారు అనుక్షణం" సామ్రాజ్యానికి గొంతు గాద్గదికమై చీర కొంగుతో కళ్ళు వత్తుకుంది.

"నువ్వు యింత బాధపడతావనుకో లేదు"

"మరోసారి మీరిలా చేస్తే నేను భరించలేను"

"ప్రామిస్. నవ్వుతూ శకునం పోయినా ఈ దెబ్బతో మన బాధ విముక్తి అవు తుంది!"

సారథి వెళ్ళిపోయాడు. అతడు వెళ్ళాక దయానందం దగ్గర్నుంచి వుత్తరం. "ఇప్పటికయినా నా తడాఖా తెల్సిందా. నీకు వుద్యోగం కావాలంటే వచ్చి నా కాళ్ళమీద పడు"

ముసలాయన ఏదో గూడుపుఠాణీ జరిపించాడనిఅర్థమయింది సామ్రాజ్యంకు.

దావా నెగ్గినట్లు సారథి టెలిగ్రాం యిచ్చాడు.

సామ్రాజ్యంలో తొలకరి.

సారథి తన సీటులో పనిచేసుకుంటు న్నాడు. జవాను వచ్చి అయ్యగారు పిలు స్తున్నారని చెప్పాడు.సారథి ఆఫీసర్ గది లోకి వెళ్ళాడు. అక్కడ హెడ్‌గుమాస్తా, సామ్రాజ్యం కూడా వున్నారు. సారథిని చూడగానే సూర్యభగవాన్ ముఖం చిట్లించాడు. అతడు తిరిగి జాయిన్ అవడం అతనికి మంటగా వుంది. "ఈ ఫైలు నువ్వేనా పుటప్ చేసింది ?" ఎదరికి విసిరి అడిగాడు కోపంగా.

సారథి చూసి "యస్సార్" అన్నాడు.

"నిద్రపోతూ రాశావా ? నువ్వేదో అఘోరించావని నేను చూడకుండా హెడ్ ఆఫీసుకి పంపించాను. వాళ్ళు నాకు మెమో యిచ్చారు"

"సారీ సర్! పొరపాటయిపోయింది"

"అది తెలుస్తూనే వుంది. అదే ఎందుకు రావాలి !" గద్దించాడు.

"........."

"ఎందుకొచ్చిన సర్వీసయ్యా! ఛ! అను భవమున్న వాడు అలా రాయడమా ? షేం! నీకు పనంటే శ్రద్ధలేదని, జీతం డబ్బుల కోసం వస్తున్నావని తెలుస్తోంది"

"పార్డన్! ఈ సారి పొరపాటు రాని వ్వను"

"ఆ జ్ఞానం ముందర ఏవ్వాలి. ఇల్లు కాలాక నుయ్యి తవ్వుతావా ?"

మరొక్కడప్పుడయితే సారథి భయ పడేవాడు కాదు. ఆఫీసర్ని ఎదిరించే వాడు. సామ్రాజ్యం పక్కన వుండటంతో తల తీసేసినట్లయింది. దానివల్ల బుర్ర పనిచేయలేదు. సమయం గమనించి ఆఫీసరు రెచ్చిపోతున్నాడు.

"సామ్రాజ్యం! ఇతడు యింటి దగ్గర కూడా నిర్లక్ష్యంగా వుంటాడా?" ఆఫీసర్ ఆమెకేసి తిరిగాడు.

సామ్రాజ్యం ఏం చెబుతుంది ?

హెడ్ గుమాస్తా పక్కికిలించాడు.

సారథి తల ఎత్తలేదు.

"మిస్టర్! బాధ్యత నేర్చుకో. నీ కంటే మీ ఆవిడ నయం. నీకు తెలియకపోతే ఆవిణ్ని అడుగు. మొగుణ్నాని విర్ర వీగక !"

హెడ్ గుమస్తా భజన. "మా బాగా సెలవిచ్చారండయ్యా"

రోజూ మధ్యాహ్నం సారథి, సామ్రాజ్యం రీసెస్‌లో కలసి టిఫిన్ తీసుకుంటారు. అతడి కిష్టమైనది చేసి పట్టుకువస్తుంది. ఆ రోజు టిఫిన్‌కి రాలేదు సారథి. భార్య ముఖం చూడ





లేక హోటల్‌కి పోయాడు. అతడు తిరిగి సీట్లోకి వచ్చాక, ఏదో కాగితం కోసం వచ్చినట్లు వచ్చి "టిఫిన్ చెయ్యలేదేం?" అనడిగింది.

సారథికి ఆమె మీద కోపంగా వుంది. మాట్లాడ లేదు. సాయంత్రం ఆఫీసు వదిలాక యిద్దరూ కలసే వసారు. ఏదైనా పని వుంటే చెప్పి వెళ్ళిపోతాడు. ఆ రోజు అసలు పల్కరించకుండా వెళ్ళి పోయాడు !

రెండు సినిమాలు చూసి ఒంటిగంటకి వచ్చాడు. సామ్రాజ్యం భోంచెయకుండా ఎదురుచూస్తూ కూర్చుంది. అతడు రాగానే లుంగీ యిచ్చింది.

"పనిమీద వెళ్ళారా ?"

"అన్నీ నీకు చెప్పాలా ?"

సారథి మంచం ఎక్కాడు. సీరియస్‌గా

"మజ్జిగ ఇవ్వనా ?"

విసుక్కున్నాడు. సామ్రాజ్యం అతడి పక్కన పడుకుంది. రోజూలా ఆమెని దగ్గరకి తీసుకోలేదు. దూరంగా జరిగాడు

తెల్లవారింది. సారథి ఆఫీసు ఫైల్సు దగ్గర వేసుకుని కూర్చున్నాడు. సారథికి కాఫీ యిస్తూ "నేను రాస్తానండి" అంది సామ్రాజ్యం.

"అక్కర్లేదు. చివాట్లు వచ్చేలా రాశావ్ కదా!"

సారథి ఆఫీసుపని దగ్గర బద్ధకస్తుడే. ఆఫీసులో పని చెయ్యక యింటికి మోసుకు వస్తాడు ఫైల్సు.

అవి సామ్రాజ్యం రాయాలి.

"నీ మొక్కుబడి తీర్చుకున్నావు గాని సరిగ్గా చేస్తే కదా! ఒకసారి అక్షింతలు వేయిస్తే మళ్ళీ అడగను కదాని ఎత్తువేశావు?"

"ఎందుకలా అపార్థం చేసుకుంటారు. మీరు దావా నెగ్గారని ఆయనకి ఉక్రోషంగా వుంది. దాన్ని యిలా తీర్చుకుంటున్నాడు"

సారథి ఆమె మాటలు వినలేదు.

"నీకు పని చెప్పడం నాదీ బుద్ధి తక్కువ" ఫైల్సులో ముఖం దాచుకున్నాడు-ఆమెని చూడటం యిష్టంలేక.

సామ్రాజ్యం మనస్సు చివుక్కుమన్నా కదల్లేదు. "రాత్రి భోంచెయ్యలేదు. టిఫిన్ చెయ్యమంటారా?"

"డోంట్ డిస్టర్బ్ మి" చిరాగ్గా అరిచాడు.

"ఆఫీసరు ఏదో అన్నాడనేగదా మీ బాధ. పైవాళ్ళు ఆయన్ని, ఆయన మిమ్మల్ని, మీరు నన్ను మందలించారు. నేనేం చెయ్యను?"

సారథి కోపం కొద్దిగా తగ్గింది.

"భార్యాభర్తలు ఒకే చోట పని చేయడంతో కొన్ని మౌలికమైన సమస్యలు ఏర్పడతాయి. వాటి ప్రభావం సంసారం మీద పడకూడదు"

సామ్రాజ్యం లోపలకెళ్ళి పోయింది.

సారథికి ఆమె మాటలు ఆలోచించగా నిజమనిపించాయి! ఆఫీసర్‌గాడు ఉక్రోషంతో ఏదో వాగాడు. దానితో తను సామ్రాజ్యాన్ని హర్ట్ చేశాడు. ఛ.... దర్టీ బిజినెస్.

"వంటలో సాయం చెయ్యనా?" లోపలకి వెళ్తూ అన్నాడు.

"కోపగృహం దిగారా?" సామ్రాజ్యం నవ్వింది.

* * *

సారథికి ఏలూరు ట్రాన్స్‌ఫర్ అయింది. సాయంత్రం టపాలో వచ్చింది ఆర్డర్. తల నొప్పిగా వుందని మధ్యాహ్నం సెలవు పెట్టి సామ్రాజ్యం వెళ్ళిపోయింది. ట్రాజడీ హీరోలా ఇంటికి వెళ్ళాడు.

"ఏమైంది?" భర్తని చూసి ఆందోళనగా అడిగింది.

"ఇక ఎవరి దారి వారిది"

"అదేం?"

"నన్ను ఏలూరు ట్రాన్స్‌ఫర్ చేశారు"

"దానికేనా యింత హడావిడి!" సామ్రాజ్యం ఊపిరి పీల్చుకుంది. టీ తెచ్చి అతడికి ఇచ్చి పక్కన కూర్చుంది.

"నీకిది చిన్న విషయంగా కనిపిస్తోందా?"

"కొన్ని సుఖాలకి ఆశ పడుతున్నప్పుడు కొన్ని త్యాగాలకి సిద్ధపడాలి"

"స్కూలు మేస్టరులా సుభాషితాలు చక్కగా వల్లిస్తావు" ఆమె గాజుల చెయ్యి అందుకుంటూ నవ్వాడు.

రెండు మూడు రోజులు ట్రాన్స్‌ఫర్ ఆపుకోడానికి ప్రయత్నించాడు. కుదరలేదు. చివరికి ఏలూరు వెళ్ళి జాయిన్

అయ్యాడు.

"నువ్వు రోజుకో ఉత్తరం రాయాలి" హెచ్చరించాడు.

ఒక వారం అతడు వస్తే, రెండో వారం ఆమె. సామ్రాజ్యం ట్రాన్స్‌ఫర్ కోసం కూడా ప్రయత్నించాడు. ఇంకా ఫలించలేదు.

సారథి వెళ్ళిపోయాక రాఘవయ్య కూతుర్ని తన దగ్గరే వుండమన్నాడు. సామ్రాజ్యానికి అంత పెద్ద ఇల్లు అనవసరంగా తోచింది. ఖాళీ చేసేసింది.

సీతమ్మకి అనారోగ్యం చేసింది. రెండు వారాలు వెళ్ళలేక పోయింది. సామ్రాజ్యం వస్తుందని అతడు ఆగిపోయాడు.

సీతమ్మ తిరిగి లేచి తిరుగుతోంది.

"స్టార్ట్ ఎట్ వన్స్!" ఓ రోజున సారథి దగ్గర్నుంచి టెలిగ్రాం.

"నేను కూడా రానుటమ్మా" రాఘవయ్య ఆందోళనగా అడిగాడు. టెలిగ్రాం అంటే అతడికి భయం. టెలిగ్రాం చెడ్డ వార్తలే తెస్తుందని అతని నమ్మకం.

"మీరు ప్రయాణం చెయ్యలేరు. నేను వెళ్ళి వస్తాను" బయలుదేరింది సామ్రాజ్యం!

రిక్షా నవరుపేట కేసి పోనీయమంది ఏలూరులో దిగగానే. సారథిని ఏ పరిస్థితిలో చూడాలా అని ఆమె భయం.

తలుపు కొట్టింది.

"హాయ్!" తలుపు తీస్తూనే ఆమెని అందుకున్నాడు.

"ఏం జరిగింది? ఒంట్లో బాగుందా?"

"ప్రేమ జ్వరం పట్టుకుంది"

"ఎంత హడలి పోయానో తెల్సా?"

"పధ్నాలుగు రోజుల విరహం నాచేత ఆ పని చేయించింది. ముందర స్నానం చెయ్యి! నువ్వు వస్తావనే క్యారేజీతో సహా రెడీగా వుంచాను అన్నీ."

సామ్రాజ్యం స్నానం చేసి వచ్చేసరికి భోజనాలు వడ్డించాడు. సామ్రాజ్యం ఇంటి దగ్గర్నుంచి పచ్చళ్ళు, కందిపొడుం తీసుకు వచ్చింది.

"ఎన్ని రోజులు సెలవు పెట్టావు సామ్రాజ్యం?"

"నాలుగు!"

"ఓ.కె. అసలు నేనే వద్దును. మా సన్యాసి సెలవు ఇవ్వడు"

సాయంత్రం అయిదు గంటలు. "ఏమిటోయ్ ఇంకా రాలేదు?" అంటూ వచ్చాడు శ్రీపతి. సామ్రాజ్యం, సారథి సినిమా ప్రోగ్రాం మీద వున్నారు.

సారథి పరిచయం చేశాడు. "ఇతడు శ్రీపతి. మన ఆఫీసులోనే పని చేస్తున్నాడు. ఏలూరులో అన్నీ చూసి పెట్టింది ఇతడే. ఇవాళ శ్రీపతి యువరాజు బర్త్‌డే. మరచే పోయాను"

శ్రీపతి, సామ్రాజ్యం విష్ చేసుకున్నారు.

"మీరు కూడా రావాలి" బలవంతం పెట్టి తీసుకెళ్ళాడు.

పార్టీ నుంచి వచ్చేసరికి పదయింది. కబుర్లు చెప్పుకుంటూ కూర్చున్నారు. "ఇక మీరు టెలిగ్రాములు కురిపించినా రాను" అందామె.

"అదేం!"

గోడమీది కాలెండరుకేసి చూపెట్టింది. ఒక బిస్కెట్ కంపెనీ కాలెండరు. ఏడాది పిల్లవాడు బిస్కట్ తింటున్నాడు.

"నీ కోడ్ భాష అర్థం కావటంలేదు!"

సామ్రాజ్యం ఎలా చెప్పడమాని తచ్చాడి, "మీకు యువరాజు కావాలా? యువరాణి కావాలా?" అడిగింది.





"నాకు మహారాణి కావాలి" ఆమె భుజంమీద చేయి వేసి, దగ్గరకు జరిగి "ఈ వా ర ఇంత ఆ ల స్యం గా నా చెప్పడం?" అడిగాడు.

"చెప్పకుండానే తెల్సుకుంటారను కున్నాను"

* * *

దయానందం కొడుక్కి ఉద్యోగం మళ్ళీ రావడంతో డబ్బు తిని ద్రోహం చేసినందుకు సూర్యభగవానుని తిడుతూ ఉత్తరం రాశాడు. అంతటితో ఆగాలని పించలేదు. వాళ్ళని ఎలాగయినా దెబ్బ కొట్టాలి. తన కాళ్ళమీద పడేసుకోవాలి. అద్భుతమైన పథకం వేసుకుని విశాఖ వెళ్ళాడు. నేరుగా ఆఫీసుకి వెళ్లాడు. మామగార్ని చూసి ఆమె నివ్వెరపోయింది. ఎలా పలకరించడమాని విస్తుపోయింది?

"ఏమ్మా...కులాసా?"

ఎన్నడూ లేని చిరునవ్వు, సౌమ్యం ఆమెకి కొత్త దయానందాన్ని చూపించాయి. "నమస్కారం మామయ్యగారూ!" గౌరవంగా పిలిచింది.

"సారథి యింకా రాలేదామ్మా!"

"ఆయనకి ఏలూరు ట్రాన్స్‌ఫర్ అయింది"

"అలాగా!"

"పర్మిషన్ అడిగి వస్తాను. యింటికి వెళదాం" ఆమె వెళ్లబోయింది.

"సాయంత్రం వస్తానమ్మా అప్‌లాండ్స్‌లో పని చూసుకుని వస్తాను"

"తప్పక రావాలి. మీరొచ్చేదాకా యిక్కడే వుంటాను"

సామ్రాజ్యం సంతోషంగా సీటులోకి వెళ్ళింది. మామగారిలోని మార్పు సారథికి తెలిస్తే ఎంత సంతోషిస్తాడు. మార్పు మనుషుల ముఖ్య లక్షణం. ఎల్లకాలం ఒకేలా వుండలేరు.

ఆఫీసు వదలడానికి పావుగంట ముందే వచ్చాడు దయానందం. ఇద్దరూ ఆటోలో బయలుదేరారు. "అప్సరా" కి పోనీ అన్నాడు దయానందం.

కోడలికేసి తిరిగి "నెయ్యి, సప్పులు తెచ్చానమ్మా" అన్నాడు.

ఆటో హోటల్ ముందు ఆగింది. "లోపలికి రామ్మా...కొంచెం స్థిమితపడి వెళదాం" రెండవ అంతస్థులోని తన గదికి దారి తీశాడు.

"సాంబం! తలుపు" కొడుతూ అరిచాడు.

నల్లటి కుర్రాడు తలుపు తెరిచాడు.

"హార్లిక్సమ్మా! నాతో మీ అత్తయ్య కూడా ప్రయాణమైంది. నేను వెళ్ళి వచ్చాక వెళుదువుగానని ఆపుచేశాను. ఇంటి దగ్గర ఎవరూ లేకపోతే ఎలా?"

దయానందం సర్వర్‌ని పిలిచి టిఫిన్ పట్టుకురమ్మన్నాడు.

"ఆ మూటలు ఆటోలో పెట్టనా!" నల్లటి కుర్రాడు వచ్చి అడిగాడు.

"తొందరగా కానియ్యి"

నల్లటి కుర్రాడు పక్క గదిలోనుంచి మూట ఎత్తుకువస్తూ పడిపోయి, గిలగిల కొట్టుకోసాగాడు.

"ఫిట్టు వచ్చింది. సామ్రాజ్యం వీణ్ని గట్టిగా పట్టుకో. లోపల మందు వుంది" దయానందం లోపలకి పరుగెత్తాడు.

సామ్రాజ్యం వచ్చి పట్టుకుంది. సాంబం కొట్టుకోడం మానేశాడు. సామ్రాజ్యంని పట్టుకుని మూల్గసాగేడు.

దయానందం హడావిడిగా వచ్చి "ఆ మందు కనిపించడం లేదమ్మా...వీణ్ని హాస్పిటల్‌కు తీసుకువెళ్ళి వస్తాను. అడ్రస్ యిచ్చి వెళ్ళు" అన్నాడు.

సామ్రాజ్యం అడ్రస్ ఇచ్చి వెళ్ళిపోయింది. ఇంటికి వెళ్ళగానే తల్లి తండ్రితో చెప్పింది. ఆ రాత్రి వాళ్ళు దయానందం కోసం ఎదురు చూశారు. మర్నాడైనా రాలేదు. సామ్రాజ్యం అప్పారాకి ఫోన్ చేసింది. దయానందం రూం ఖాళీ చేశాడని చెప్పారు.

వస్తానని ఎందుకు రాలేదు? ఆ సాంబం కేమయినా అయిందా?

దయానందం వచ్చినట్లు భర్తకి రాసింది. ఇరవై రోజులయినా సమాధానం లేదు. నెలయింది. మరో రెండు ఉత్తరాలు రాసింది. శూన్యం.

కొడుకు పుట్టినట్టు రాసినా సమాధానం లేదు. భర్తని చూసి నాలుగు నెలలయింది. బయలుదేరి వెళదామంటే పిల్లవాడితో అవస్థ. సామ్రాజ్యానికి తీవ్రమైన అశాంతి. సారథి గురించి ఏమీ తెలియక పోవడం. అలుక వహించాడా? తండ్రిని పంపుదామంటే ఆయన ఆరోగ్యం తిన్నగా లేదు.

ఓ రోజున బాలాజీ కనిపించి "రాత్రి విజయవాడ వెళుతున్నాను. వచ్చేటప్పుడు సారథిని కల్సి వస్తాను" అన్నాడు.

"ఓసారి రమ్మను అన్నయ్యా! పిల్లాడు పుట్టాడన్నా కబురు రాలేదు. ఏం మనిషో!"

"నువ్వు బాధపడకమ్మా. నేను పంపిస్తాగా!"

విజయవాడలో పని చూసుకుని సాయంత్రం ఏడున్నరకి ఏలూరు రోడ్లో సారథిని కలుసుకున్నాడు బాలాజీ.

"వెల్‌కం!" స్నేహితుణ్ణి సాదరంగా పిలిచాడు.

ఇద్దరూ కాఫీకి హోటల్‌కి బయలుదేరారు.

"నాన్నవయిపోయాక అలుస య్యావయిందా? ఉత్తరం కూడా రాయడం లేదు."

"కారణముంది!"

"ఏమిటి?"

"ఇంటికి వెళ్ళాక చూపిస్తాను."

తిరిగి వచ్చాక సారథి ఓ ఫోటో తీసి బాలాజీ మీదకి విసిరాడు. సామ్రాజ్యం ఒడిలో ఎవరో! బాలాజీకి అది నమ్మశక్యంగా కనిపించలేదు. ఆ ఫోటోలోని కుర్రాడెవరో తనకు తెలుసు.

"నిన్ను ఎవరో మోసం చేశారోయ్! ఇదంతా అబద్ధం."

"కళ్ళు మోసం చెయ్యవు బ్రదర్. ఎదురుగా కనిపిస్తోందిగా"

"సామ్రాజ్యాన్ని అనుమానిస్తున్నావా?"

సారథి మాట్లాడలేదు. ఈ ఫోటో ఆకాశరామన్న ఉత్తరం వచ్చినప్పటి నించి అతనికి మతిలేదు.

"శ్రీరాముడి వయ్యావా సారథీ..."

"ప్లీజ్! నా మనసేమీ బాగాలేదు."

"నాతోరా...సామ్రాజ్యాన్ని అడుగుదువుగాని."

"వద్దు. నాకా అవసరంలేదు."

"నీకు లేకపోవచ్చు. నాకుంది. ఈ ఫోటో ఇయ్యి. సామ్రాజ్యాన్ని అడుగుతాను. ఆమె నీకోసం కుళ్ళి ఏడుస్తున్నది."

ముభావంగా ఫోటో ఇచ్చాడు.

బాలాజీ బయలుదేరుతూ "సామ్రాజ్యంతో ఏమైనా చెప్పనా?" అనడిగాడు.

"ఏముంది చెప్పడానికి?" ముభావంగా అన్నాడు సారథి.

విశాఖరాగానే బాలాజీ సామ్రాజ్యాన్ని కల్సుకున్నాడు. "ఏమన్నాడు అన్నయ్యా!" ఆత్రంగా అడిగింది.







"నువ్వు సీతమ్మవి అయ్యావు'' ఫొటో, ఆకాశరామన్న వుత్తరం ఇచ్చాడు. సామ్రాజ్యం అవి చూడగానే చలించి పోయింది. ''మోసం! దగా...ఎంత పని చేశాడు...

"ఎవరమ్మా ?"

''దయానందం! ఆయన వుద్యోగం చెడగొట్టింది ఆ నీచుడే. సారథిగారు బాధ పడతారని ఆ వుత్తరం చూపించలేదు. అది ఫెయిల్ అవగానే రెండో ప్రయత్నం చేశాడన్నమాట !"

దయానందం రాక-హోటల్‌కి తీసుకు వెళ్ళడం చెప్పింది.

"ఇడియట్ ! కాపురంలో నిప్పులు పొయ్యాలని చూస్తున్నాడన్నమాట. రేపు మనవూరు వెళుతున్నాను. వాడిసంగతి నేను చూసుకుంటాను. నువ్వు ధైర్యంగా వుండమ్మా..."

సీతమ్మ రాఘవయ్య జరిగింది తెల్సుకుని...

''ఎందుకు యేళ్లు రాగానే సరా? వివేకం లేని జన్మ. ఈ పెళ్ళి ఏదోలా చెడగొట్టి మళ్ళీ కొడుక్కి పెళ్ళిచేయాలని చూస్తున్నాడన్నమాట అతడు చెయ్యడం కంటె సారథి నమ్మడం నాకు బాధగా వుంది.ఇన్నాళ్ళు ఇది మనసులో పెట్టుకుని రావడం మానేస్తావా?'' అన్నాడు రాఘవయ్య.

''సారథిని నిందించకండి ఆ పొజిషన్‌లో ఎవరున్నా నమ్ముతారు.అలా నమ్మేలా చేశాడు. బాబయ్యగారూ నేను ఇంటికి వెళ్లి అన్నీ తెల్సుకువస్తాను, సారథిని మీ ఇంటికి రప్పించే బాధ్యత నాది,'' బాలాజీ హామీయిచ్చాడు.

''తొందరగా కానీయ్ బాబూ! అది అతడు రావడంలేదని తల్లడిల్లిపోతోంది.'' అంది సీతమ్మ.

''పోనీ, నేను ఏలూరు వెళ్లి రానా అన్నయ్యా!'' సామ్రాజ్యం అడిగింది.

''ఎందుకమ్మా! నేను వచ్చాక వెళుదువుగాని.''

బాలాజీ ఆ రాత్రే బస్సు ఎక్కాడు. సారథి స్నేహంకంటె సామ్రాజ్యం ఆత్మీయతే అతడ్ని పనికి పూనుకునేలా చేసింది.

బస్సు తెల్లవారుఝామున దిగింది. ''ఇప్పుడొచ్చావేంరా?'' అని తండ్రి అడిగినా సమాధానం చెప్పలేదు. మంచం ఎక్కి ఎనిమిదింటిదాకా నిద్రపోయాడు. లేచి స్నానం ముగించాడు. టిఫిన్ తీసుకుని వూర్లోకి బయలుదేరాడు. తను ముందర దయానందాన్ని కల్సుకోవాలా?సాంబాన్ని కల్సుకోవాలా? బాలాజీ ఆలోచనలో పడ్డాడు.

ఇంటిలో సాంబం చెరువు గట్టుమీద, తాడిక్రింద కల్లు త్రాగుతూ కనిపించాడు. బాలాజీ దగ్గరకెళ్ళాడు.

''ఏం బాబుగారూ!'' సాంబం వినయంగా అడిగాడు.

''నాతో రా!''

దేవాలయం అరుగుమీద ఎవరూలేరు. బాలాజీ అక్కడకూర్చుని ''నీగురించి విశాఖపట్నంలో పోలీసులు వెతుకుతున్నార్రా... దయానందంగారితో వచ్చి సామ్రాజ్యాన్ని మోసం చేసినందుకు. నీకు చెబుదామని వచ్చాను'' అన్నాడు.

''నాకేం తెలియదుబాబూ. దయానందంగారు కూడారమ్మన్నారు, పాతిక రూపాయిలిచ్చారు! ఫొటో తీసింది నర్సింహమూర్తిగారి అబ్బాయి కిష్టాయి.''

''అంతా బాగా నాటకమాడేర్రా. నల్లెండి కటకటాలు లెక్కపెట్టేయోగం వుంది కాబోలు.''

''డబ్బు కోసం కక్కుర్తిపడ్డాను బాబూ! ఏదోలా నన్ను కాపాడండి.''

''దయానందం దగ్గరికి నడు. అక్కడ నిజం ఒప్పుకోవాలి. లేకపోతే నిన్ను కాపాడేది లేదు. తెలుస్తోందా?''

సాంబం ఒప్పుకున్నాడు. బాలాజీ మాటమేరకి కిష్టాయినికూడా వెతికి తీసుకు వచ్చాడు. పోలీసులనగానే కిష్టాయి కూడా చేతులు ఎత్తేశాడు.ఇద్దర్నీ తీసుకుని దయానందం దగ్గరకెళ్ళాడు. దయానందం ఇంటి దగ్గరలేడు. గనువుమీద కొబ్బరితోట దింపు తీయిస్తున్నాడు.ముగ్గురూ అక్కడికి వెళ్ళారు.

''నువ్వు చెప్పింది నాకేం తెలియదు. నేనీమధ్య ఎక్కడికీ కదలలేదు. పెళ్ళయ్యాక వాడి ముఖం చూడనని చెప్పాను'' అన్నాడు దయానందం కోపంగా బాలాజీ చెప్పింది విని.

''అలాగా! పోలీసు కేసు పెట్టింది




మీకోడలు. అప్సరాలోదిగినట్లు రిజిష్టరులో మీ పేరుంది. ఆఫీసు జవాను మీరు వచ్చినట్లు సాక్ష్యం చెప్పాడు.''

దయానందం బెదిరినా బింకంగానే, "మీ ఇష్టమొచ్చినట్లు చేసుకోండి. నేను భయపడను...'' అన్నాడు

''ఎవరో కాదు, మీ నమ్మినబంట్లు మీకు వ్యతిరేకంగా, మీరు చేసిందంతా చెప్పబోతున్నారు. ఏరా సాంబం!కిష్టాయి" బాలాజీ గద్దించాడు.

''అవునుబాబూ! పోలీసుగొడవ. నిజం చెప్పకపోతే లాఠీలు విరక్కొడతారు. మీకోసం మేం ఎందుకు బాధపడాలి?'' అన్నాడు కిష్టాయి అలక్ష్యంగా.

దయానందం వుస్సూరు మన్నాడు.

"పచ్చటికాపురాన్ని పాడుచేసినందుకు శిక్ష మీరు తొందరలోనే అనుభవిస్తారు. సెలవు'' బాలాజీ బయలుదేరాడు.

"మాట..." దయానందం పిలిచి, తనేదగ్గరికి వచ్చాడు. ''ఆవేశంలో ఏదో చేశాను. తప్పే...గొడవలు లేకుండా చూడు" ...అన్నాడు నెమ్మదిగా.

"విశాఖరండి. ఇక్కడకాదు" తీర్పు చెప్పాడు బాలాజీ.

* * *

దయానందం రాయిలా కూర్చుని వున్నాడు. ఎదురుగా రాఘవయ్య,సీతమ్మ, సామ్రాజ్యం, బాలాజీ వున్నారు.

"నువ్వు చేసినపని ఏం బాగాలేదయ్యా, నాకు చాలా సిగ్గుగా వుందిసుమా! వాళ్లేం నీకు పరాయివాళ్లుకారే...కత్తికట్టడానికి!" అని మాత్రం అన్నాడు రాఘవయ్య.

సామ్రాజ్యం అసలు మాట్లాడలేదు. పిల్లాణ్ని ఎత్తుకుని కూర్చొంది. సీతమ్మ మాత్రం ఆవేశాన్ని ఆపుకోలేకపోయింది.

"పెళ్ళి చెడగొట్టాలని చూశావు. అది నీ తరం కాలేదు. కొడుకు వుద్యోగం పీకించాలని చూశావు. అదీ కుదరలేదు. సారథికి అనుమానం కలగజేసి నా కూతురు జీవితంలో నిప్పులు పొయ్యాలని చూశావు. అది నీకేం అపకారం చేసిందన్నయ్యా? మన పంతాల కోసం చిన్నవాళ్ళ జీవితాలు పాడుచెయ్యడమా ? మళ్ళీ కొడుకుని నీ వైపుకి తిప్పుకుని కట్నం పెళ్లి చేసేదాకా నిద్ర పట్టదా నీకు ?"

"అబ్బే..." నసిగాడు.

"ఎంత దారుణానికి వడిగట్టావు. ఇది తెల్సినప్పటినుంచి అది కంటిమీద నిద్ర లేకుండా అఘోరిస్తోంది. ఇప్పుడు నీకు తృప్తిగా వుందా?"

"నన్ను మన్నించమ్మా" దయానందం లేచి కోడలి చేతులు పట్టుకున్నాడు.

బాలాజీ ఫొటో తీశాడు.

"ఇది మీ కొడుక్కి పంపిస్తాను... ఇదిగో కవరు. వుత్తరం రాయండి. ఏం రాయాలో నేను చెబుతాను" బాలాజీ అన్నాడు.

దయానందానికి రాయాలనిలేదు. ఇప్ప టికే ముళ్ళమీద కూర్చున్నాడు. తను శాసించే చోట చేతులు నలుపుతున్నాడు. ఇది తలకొట్టేసి నట్లయింది.

"ఇంకా. వుత్తరాలు ఎందుకు ?" బింకంగా అడిగాడు.

"జైలుకి పోకుండా. రాయాలనిలేదా?"

దయానందం పెన్ను వుత్తరంతీశాడు. బాలాజీ చెప్పసాగాడు. ఆకాశరామన్న వుత్తరం, ఫొటో తను పంపినవే అని, సామ్రాజ్యంమీద కక్షవల్ల అలా చేశానని, యిందులో సామ్రాజ్యానికేం బాధ్యతలేదని దయానందం వుత్తరం రాశాడు.

"చాలా ?" అయిష్టంగా అడిగాడు దయానందం.



"నీ కొడుకు కళ్లు తెరిస్తే చాలు, లేక పోతే మళ్ళీ రావల్సివుంటుంది" అన్నాడు బాలాజీ కవరు అందిస్తూ.

దయానందం వెళ్ళడానికి లేచాడు.

"భోంచేసి వెళ్ళండి" సామ్రాజ్యం కోరింది.

దయానందం సిగ్గుపడి ఆగలేక పోయాడు. వీలైనంత తొందరగా బయటపడాలి! లేకుంటే తల ఎత్తుకోడానికిలేదు.

పరుగులాంటి నడకతో వెళ్ళిపోయాడు.

"తాతయ్యా పరుగు చూశావురా ?" బాలాజీ హాస్యమాడాడు కుర్రాణ్ని.

సామ్రాజ్యం నవ్వింది. "మేనమామ ప్రతాపం చూశాడు—కదురా నాన్నా."

"ఇంకేం భయపడకు. ఈ ఉత్తరం అందగానే వీళ్ళ నాన్న వచ్చిపడతాడు. చూస్తూండు" బాలాజీ ధైర్యంచెప్పి వెళ్ళిపోయాడు.

"మీ నాన్న వస్తార్రా" సామ్రాజ్యం ఆనందంగా కొడుకు ముఖంలోకిచూసింది.

నాలుగు రోజుల్లో ఫొటో, వుత్తరం సారథికి అందినాయి. మంచుపొరలు కరి

గాయి. తను సామ్రాజ్యాన్ని అనుమానించాడా? తండ్రి చేసిన ఘోరానికి పనికి పోయాడు. తీవ్రమైన పదజాలంతో తండ్రికి ఉత్తరం రాశాడు. రమ్మని సామ్రాజ్యం ఉత్తరం రాసినా సారథికి ఆమెను చూసే ధైర్యంలేదు. తన తండ్రి మూర్ఖుడు. తను వివేకంగల మూర్ఖుడు.

నాలుగు రోజులయినా సారథి వెళ్ళలేదు. జరిగినదానికి క్షమించమని ఉత్తరం మాత్రం రాశాడు.

సంకోచించవల్ల నావసరంలేదని సామ్రాజ్యం వైర్ ఇచ్చింది. సారథిరెండు రోజులు సెలవు పెట్టాడు కని, అది సెలవులే కనుక. సామ్రాజ్యానికి చీర, పిల్లవాడికి బొమ్మలు తీసుకెళ్ళాడు. విశాఖలో బస్సు దిగేసరికి యింకా తెల్లవారలేదు. రిక్షాలో యింటికి వచ్చాడు. ఇంకా ఎవరూ నిద్రలేవలేదు. తలుపు గొళ్ళెం చప్పుడు చేశాడు.

సామ్రాజ్యం తలుపు తీసింది. భర్తని చూడగానే ఆమె ముఖం వికసించింది. అతడి చేతిలోని సూట్‌కేస్ అందుకుని గదిలో పెట్టింది.

"నన్ను మన్నించు సామ్రాజ్యం!"

"మీరే నన్ను మన్నించ లేరని భయపడ్డాను" ఇన్నాళ్ళ ఆవేదన కన్నీళ్ళ రూపంలో బయటకి వచ్చేసింది. ఉద్వేగంగా అతడి ఒడిలో వాలిపోయింది. "మీరు దూరమైన రోజున నాకు బ్రతుకు లేదండీ! మీరు లేకుండా జీవించలేను."

"ఊరుకో...నేను త్త వెధవలా తయారయ్యాను. నిన్ను ఎంత క్షోభ పెట్టానో!" ఆమెకన్నీళ్లు తుడుస్తూ అన్నాడు. తర్వాత ఉయ్యాలలోని బాబు దగ్గరికెళ్లాడు.

సామ్రాజ్యానికి సంతోషంతో ఉక్కిరి బిక్కిరిగావుంది. కాఫీ లేవడానికి వెళ్లింది.

సీతమ్మ అప్పుడే లేచి నడవాలో వుంది.

"ఎవరే?...సారథా?"

"ఇప్పుడే వచ్చారు... రాత్రి పాలు వున్నాయా?"

"అల్మారాలో వున్నాయి."

సారథి కాఫీ తాగి నిద్రపోయాడు. పదయినా లేవలేదు. లేపటమెందుకని సామ్రాజ్యం ఆఫీసు కెళ్ళిపోయింది. పదకొండు గంటలకి అతనికి మెలకువ వచ్చింది. లేచి స్నానం చేశాడు. సీతమ్మ టిఫిన్ ఇచ్చింది.

"సామ్రాజ్యం ఆఫీసుకెళ్ళిందా?"

"ఒంటిగంటకి వస్తానంది" సీతమ్మ ముభావంగా అంది. కూతుర్ని అనుమానించి ఏడిపించాడని అంతరాంతరాల్లో ఆమెకి అక్కసుగా వుంది.

ఆప్యాయంగా పలకరించే ఆమె అప్రసన్నంగా వుండటం సారథికి బాధవేసింది. తను చేసిన పని ఆమె క్షమించలేక పోతున్నది.

సారథి తనగదిలోకి వెళ్ళిపోయాడు. కాస్సేపు పిల్లవాడితో ఆడుకుని, దినపత్రిక చూస్తూండగా నిద్రలోకి జారాడు.

మధ్యాహ్నం సామ్రాజ్యం వచ్చి లేపింది.

"లేవండి... భోంచేద్దాం!"

సారథి బాత్‌రూంలో ముఖం కడుక్కుని వంటింట్లోకి వచ్చాడు.

"మీకో శుభవార్త."

"ఏమిటి?" కూర కలుపుకోవటం ఆపి అడిగాడు.

"చెప్పుకోండి చూద్దాం."

"నా వల్లకాదు"

"నాకు ఏలూరు ట్రాన్స్‌ఫర్ అయింది"

ఎడంచేత్తో ఆమెను దగ్గరకి లాక్కుని,

"ఇంత చేటుగానా చెప్పడం అమ్మడూ? ఇక బస్సులకి రైళ్ళకి టాటా!" అసంతోషం వ్యక్తం చేశాడు.

* * *

ఏలూరులో సామ్రాజ్యం సారథి కాపురం పెట్టారు. రోజులు సాఫీగా గడిచి పోతున్నాయి. బాబుకి సురేష్ అని పేరు పెట్టారు. వాడి తర్వాత రాణి పుట్టింది.

రెండేళ్ళు గడిచాయి.

సారథి, సామ్రాజ్యం ఓసారి స్నేహితుడి పెళ్ళికి వెళ్లారు విజయవాడ. పెళ్లి అయ్యాక వారు డైనింగ్ హాల్‌కి వెళ్ళే సరికి అది జనంతో నిండివుంది.

కూరలు వడ్డిస్తున్న పాపమ్మ సామ్రాజ్యాన్ని చూసింది. "సీతమ్మ కూతురివి కదే" అని దగ్గరకి వచ్చింది.

పాపమ్మ దూరపు చుట్టం. మొగుడు వదిలేసి నప్పటినుంచి వంటలు చేసుకుని బ్రతుకుతోంది. పాపమ్మ వీరిని పక్క వసారాలోకి తీసుకెళ్ళి కూర్చోపెట్టి దగ్గర వుండి నాలుగూ వడ్డించింది.

"తిరగలేక పోతున్నానే పిల్లా! ఒక చోట పడివుండాలి. నీకు తెలుసున్న ఇంటిలో వంట మనిషి కావలిస్తే చెప్పు" అంది పాపమ్మ.

"అలాగే..."

పాపమ్మ వెళ్ళగానే, "ఏమండీ... మనం తీసుకువెళదామా? తెలుసున్న మనిషి కనుక నమ్మకంగా వుంటుంది." భర్తని అడిగింది.

ఇద్దరు పిల్లలతో సంసారం, అటు వుద్యోగం చేసుకోడానికి సామ్రాజ్యం అవస్థ పడుతోంది.

"రమ్మను. మనకీ అవసరమే."

పాపమ్మ ఆమె ఇచ్చే జీతానికి ఒప్పుకుంది.

రోజులు నడుస్తున్నాయి. వంట సమస్య, పిల్లల సమస్య తీరడంతో సామ్రాజ్యం డిపార్టుమెంటల్ పరీక్షకి కట్టింది.

"మీరు కూడా కట్టండి" సారథిని అడిగింది.

సారథికీ మధ్య కళాదురద బయలుదేరింది. పరిషత్‌కి తీసుకెళ్ళదామని నాటకం ప్రాక్టీసు చేస్తున్నారు. నాటకంలో సారథి ముఖ్యపాత్ర వేస్తున్నాడు.

"నాకు ఎక్కడ ఖాళీ! నువ్వు కట్టు"

"ఇద్దరం కడితే జంటగా స్టడీ చెయ్యొచ్చు."

"ఎక్కడ? మంచం మీదా?"

"సిగ్గులేకపోతే సరి!"

"అమ్మడూ నువ్వు కానియ్. నేను కూడా కూర్చుంటే తప్పడం ఖాయం. నా మొగుడి పరీక్ష పోయిందని నువ్వు రాగం తీస్తావు! ఆ బాధ లేకుండా చేస్తున్నాను."

అతడు చెప్పినా వినడని, తనుకట్టింది పరీక్షకి. శ్రద్ధగా చదవసాగింది. సారథి నాటకాల్లో వున్నాడు.




సారథి పాల్గొన్న నాటకం పరిషత్ పోటీలలో పాల్గొంది. ఉత్తమ నటుడిగా

సారథికి బహుమతి కూడావచ్చింది.సారథి ఆనందంగా ఏలూరు స్టేషన్‌లో దిగాడు. ఆఫీసులో పనిచేస్తున్న సన్యాసిరాజు స్టేషనులోనే కనిపించి ''ఇది విన్నావూ'' అంటూ చెవిలో వూ దే శా డు. సారథి వుద్వేగం ద్విగుణీకృతమైంది.

రిక్షా వేగంగా వెళుతున్నా అశాంతి గానే వుంది. ఎప్పుడు వెళ్ళి సామ్రా జ్యాన్ని చూద్దామా అన్న తహ తహ పీడించింది.

సామ్రాజ్యం లోపల వుంది. "డాడీ వచ్చారు" సురేష్ కేక వేశాడు. కుంపటి వెలిగిస్తున్న సామ్రాజ్యం, ఆ పని వది లేసి హాల్లోకి వచ్చేసింది.

"నిన్ననే వస్తారనుకున్నాను" మంచి నీళ్లు యిస్తూ అడిగింది.

"డాడీ" అంటూ సు రే ష్ దగ్గర కెళ్ళాడు. సారథి వాడ్ని ఎత్తుకున్నాడు. సామ్రాజ్యం కొత్తగా కనిపించింది.

"ఈ వా ర్త విన్నప్పట్నుంచీ ఒకటే ఆత్రం."

"ఏం విన్నారు బాబూ!''

"ఏం వింటానో నీకు తెలియదా !"

"నాకు జ్యోతిష్యం రాదు."

సురేష్ స్వీట్లు తీస్తున్నాడు సంచీలో నుంచి. మాత రావడం లేదు.సామ్రాజ్యం రెండు వాడికి పెట్టి రెండు రాణికి పెట్టింది.

"తమరికి సంతోషం సేవే కాని, పతి సేవలేదా ఆఫీసరుగారూ'' నవ్వాడు.

"అప్పుడే ఎవరో వూదేశారే.''

సామ్రాజ్యం డిపార్టమెంటల్ పరీక్ష ప్యాసయింది, ఏలూరులోనే ఆఫీసరుగా ప్రమోట్ చేశారు. నిన్ననే కొత్త బాధ్య తలు స్వీకరించింది. భర్త ఢిల్లీనుంచి రాగానే తనే మొదట చెప్పాలని అను కుంది.

"స న్యా సి రా జు చెప్పినప్పటినుంచీ సంతోషం ఆగడం లేదు.''

"పేరు సార్థకం చేసుకున్నాడు. నేనే చెప్పాలనుకున్నాను.''

పాపమ్మ గుడినుంచి తిరిగివస్తూ "ఎప్పుడు వచ్చావు బాబూ...అమ్మాయి ఆఫీసరయింది తెలుసా?" అంది.

"పిన్నీ కొంచెం టీ పెట్టు'' సామ్రా జ్యము పురమాయించింది.

సారథి స్నా నం చే సి వచ్చాడు. ఫ్యాను క్రింద కూర్చుని టీ త్రాగుతూ "ఏం కావాలో కోరుకో సామ్రాజ్యం" అడిగాడు.

"నాకేం కావాలో నాకే తెలియడం లేదు"

"ఏమైన సరే కోరుకోవాల్సిందే"

"ఏం వరం అనుగ్రహిస్తారు"

"నేను నీకు యిచ్చేది ఏముంటుం దనా?" భారంగా అడిగాడు.

సామ్రాజ్యం కొద్దిగా కంగారు పడింది. తనకోసం కన్నవారిని ఎదిరించి పెళ్ళి చేసుకున్నప్పటి నుంచి సారథి మీద ఆమె గౌరవం రెట్టింపయింది. అందుచేత సారథిని ఏ కోణంలో అల్పంగా చూడ డానికి ఆమె సాహసించలేదు. అతడి కోసం ఆతడికి నచ్చేలా అతడు కోరు కునేలా తన జీవితాన్ని మలచుకోవడం భర్త స్నేహం తాలూకు ఒక అవి భాజ్య అంశం !

"నాది పుత్త మట్టి బుర్రందీ ఏం తట్టటం లేదు"

"మట్టి బుర్ర నాది. నీది కాదు"

సామ్రాజ్యం ఆలోచించి "మీరూ కూడా డిపార్ట్‌మెంటల్‌లో పరీక్ష పాసవ్వండి" చెప్పింది.

"అదియుం దప్ప"

"ఓసారి మీ యింటికి వెళ్ళి అత్తయ్య

గార్ని చూసి వద్దాం"

"అదియుం దప్ప...అక్కడ రాక్షసుడుంటాడు"

"సతీసావిత్రి నాటకం ప్రాక్టీసు చేస్తున్నారా? అంత మీకిష్టం లేనపుడు గొప్పగా వరాలు యిస్తామని ఎందుకు చెప్పాలమ్మా" ముద్దుగా అడిగింది.

"తనకి హాని కలిగించే వరాలు ఏ దేవుడూ యివ్వడు''

"ఫలానా అని మీరు చెప్పాలి ముందు''

"బట్టలు 'నగలు' వస్తువులు''

"ఓ సూటు పట్టుకురండి''

"నువ్వు అడదానివి'' నవ్వుతూ అన్నాడు.

"తెలుసులెండి''

"ఏం చేస్తావబ్బా !"

"మా శ్రీవారికి నా కానుకగా యిస్తాను"

"నాకా ?'' విస్మయంగా అడిగాడు.

"ఈ విజయానికి కారణం మీరు. మీ సాయం లేకపోతే ముందడుగు వేసే దాన్ని కాదు. అందుచేత మిమ్మల్ని సన్మానించడం నా కర్తవ్యం"

సారథి దగ్గరగా జరిగి ఆమెని వొళ్ళోకి తీసుకున్నాడు. ఆమె గుండెల మీదకి వంగి నెమ్మదిగా "సన్మానం యిప్పుడే చేసెయ్యనా ?'' అన్నాడు.

నెలరోజులు గడిచాయి. సామ్రాజ్యం సిన్సియర్ ఆఫీసర్‌గా పేరు తెచ్చుకుంది. సమర్థవంతంగా విధి నిర్వహణ సాగిస్తోందని పై ఆఫీసు ప్రశంసించింది. సామ్రాజ్యం కేవలం పెత్తనం చెయ్యడం కాకుండా, నలుగుర్నీ సమాధాన పరచి ముందుకు సాగించే చతురత సంపాదించుకున్నది.

తను కచ్చితంగా వుంటుంది. ఎదుటి వారి దగ్గర్నుంచి కూడా అదే ఆశిస్తుంది. పనిదగ్గర ఆమెకి ఏ విధమైన ముఖమాటం లేదు.

సామ్రాజ్యం ఆఫీసరవడం చాలా మందికి కన్నుకుట్టింది. అందులో హెడ్ గుమస్తా గురుమూర్తికి యింకా బాగా బాగా కుట్టింది.

"గుడ్డు వచ్చి పిల్లని వెక్కిరించిందిట. ఈవిడ దగ్గరనేను వర్కు నేర్చుకోవాలా? నేను సిఫార్సు చేసిన ఎస్టిమేట్లు తిరిగి లెక్క వేయిస్తుందా ?. నా సర్వీసు ఎంతోయ్ భగవాన్లు ? నేను సర్వీసులో జేరేటప్పటికి నువ్వుపుట్టివుండవు..నా సీనియారిటీని కాదని, పరీక్ష ప్యాసయిందని ఈవిడకి ప్రమోషన్ యిస్తారా ? మన వాళ్ళకి ఎవర్ని ఎక్కడ వుంచాలో తెలియదోయ్ ! అసలు అనుభవానికి మించిన విద్య ఏముంది ? ఈవిడ ఆటలు మన దగ్గర సాగవు. నా సర్వీసులో ఎంతోమంది ఆఫీసర్లని యిరికించి వేశాను"

క్యాంటీనులో గురుమూర్తి తనబృందం మధ్య కూర్చుని లెక్చర్ యిస్తూండగా సారథి లోపలకొచ్చాడు.

"మొగుడొస్తున్నాడు"

"రానియ్...... వాడు కూడా మనకి మొగుడా ?"

నలుగురూ నవ్వారు.

''మనమీద సి.ఐ.డిగా భర్తగాణ్ని వేసిందేమో ?" సన్యాసిరాజు సందేహం.

"అందుకేరా సన్యాసీ ! నీకూ నాకూ ప్రమోషన్లు రాక యిలా ఏడుస్తున్నాం. మొగుడి చేత ఏ పనులు చేయించుకోవాలో తెలియని రకమా ఆవిడ ?"

గురుమూర్తి కామెంటులోని శ్లేష అందర్నీ ఆకర్షించింది.

తనని చూసి నవ్వుకుంటున్నారేమో నని సారథి అనుమానం. ఎంతో బాధ కలిగింది. ఇన్నాళ్ళు వ్యక్తులుగా ఎన్ని విభేదాలు వున్నా, అందరూ ఒకే గూటి పక్షులు కనుక ఒకచోట కూర్చుని బాతాఖానీ వేసుకునేవారు. ఈ నాడు తనకేం వ్యక్తిగతంగా ఆధిక్యం రాక పోయినా, ఆఫీసరుగారి భర్త వల్ల నలుగురూ ఎడంఎడంగా వుంటున్నారు. సారథి తమ మధ్య వుండటం ఇబ్బంది ఫీలవుతున్నారు.

గురుమూర్తి సందేహంగా చూశాడు సారథిని. తన లెక్చర్ వినలేదు కదా! ఇప్పటికే రెండు మెమోలు ఇచ్చింది.

"ఇలా రావోయ్ సారథీ" ఆప్యా యంగా పిలిచాడు.

సారథి అతడి దగ్గరికి వెళ్ళాడు. సర్వర్ రాగానే టిఫిన్ ఆర్డర్ చేశాడు.

"మీరు తీసుకున్నారా ?"

"ఇప్పుడే అయిందోయ్ ... మన వాళ్ళతో ఇప్పుడే అంటున్నాను. నా సర్వీస్‌లో యింత డిసిప్లిన్‌డ్ ఆఫీసర్ని ఎక్కడా చూడలేదని సామ్రాజ్యంగారి పరిపాలన సుభిక్షంగా వుంది"

సారథి ఏమనలేదు.

గురుమూర్తి అతడి ముఖంలోకి చూస్తూ "మార్పు ఒక్కసారి వచ్చేస్తుం దిటయ్యా! టైం తీసుకుంటుంది. అందరూ మేధావులే వుండరు కదా-మార్పుని స్వీక రించి మసలుకోడానికి. నాకు మెమో ! సన్యాసి రాజుకి మెమో ! క్రింది వాళ్ళని భయపెట్టి పనులు చేయించగలమా సారథీ. మన కష్టసుఖాలు కూడా ఆవిడ చూడాలి కదా ! ఇవ్వాళ ప్రమోషన్ వచ్చిందని మనమీద స్వారీ చేస్తే ఎలా?"

సామ్రాజ్యం మీద కంప్లయింటని సారథికి అర్థమైంది.

"నాతో ఎందుకు చెబుతున్నారు?"

"మీ ఆవిడతో చెప్పమని"

"చెబితే ఏం ఒరుగుతుంది ?"

"నీ మాట లెక్కచేయదుటోయ్ !"

"లెక్క చేయనివి కూడా చెప్ప మనా ?"

"తికమక పెట్టకోయ్ బాబూ! ముసలి ముండాకొడుకుని. ఏదో మనవాడివని, అడ్డు పడతావని చెవిని వేశాను. మరో విధంగా అనుకోకు."

సారథి తన వంక చూస్తున్న వారం దరినీ పరిశీలించి సిగరెట్ వెలిగించాడు. గురుమూర్తి ఎంత సహజంగా చెబు తున్నా, అపస్వరం వినిపిస్తోంది.

"నా కంటె మెమోలు కొత్తకాదు. ఇవాళో రేపో యింటికి పోతాను. కాస్త చూసి చూడనట్లు పోతే మనకి తెరిపిగా వుంటుంది. స్కూలుకుర్రాడిలా అన్నిటికీ మందలిస్తే బాగుంటుందా ? సన్యాసిరాజు తలనొప్పిగా వుందని కాస్సేపు కళ్ళు మూసుకున్నాట్ట...అది తప్పా ?"

"మనతప్పు మనకి తెలియదుకదా !"

"భలేవాడివోయ్. నాకు నచ్చావ్" కొరుకుడు పడటంలేదని గుర్రుగా వున్నా పైకి బోళాగా నవ్వేసి "స్టాఫ్‌ని బాధించ వద్దని మీ మిసెస్‌తో చెప్పు" అన్నాడు.

"నేను చెప్పను"

"ఇక్కడకాదు. ఇంటి దగ్గర"

"ఇంటి దగ్గర ఆఫీసు విషయాలు నేనేం మాట్లాడను. ఆఫీసుకి వచ్చాక నేనూ మీలో ఒకణ్ణే. నాకేం ప్రత్యేకత లేదు"

"ఎందుకు లేదోయ్ ! ఆఫీసరుగారి భర్తవి.నువ్వేంచేసినా ఆవిడ మాట్లాడదు"

నవ్వు కలుపుతూ చెప్పాడు గురుమూర్తి.

నవ్వారు అందరూ.

"నేను తప్పులు చేస్తున్నానని మీ అభిప్రాయమా ?"

గురుమూర్తి కంగారుపడి "అబ్బె ! అలా అర్థంచేసుకోకు మరి. ఒకవేళ తప్పు జరిగినా భార్యగా కాపాడదాని ? పెద్ద సింహాసనం వాళ్ళకి బంధుప్రీతి ఎక్కువగా వుంటుంది. ఇందిరాగాంధీని, మొరార్జీని చూడు ! కొడుకులేం చేసినా పసివాళ్ళంటారు. వాళ్ళే పాపం ఎరగరంటారు ? అవునా, కాదా?" సంభాషణ ధోరణి మార్చాడు.

"తప్పు చేసేవాళ్ళు పెద్దవాళ్ళయినా, మనకి ఆదర్శం కాదు. మనం తల వంచేది వ్యక్తికి కాదు. హోదాకి. డిసిప్లిన్ దగ్గర ఆమెకు అందరూ ఒక్కటే !"

"ఇంటి దగ్గర కూడ యిలాగయితే భలే అవస్థోయ్!... డిసిప్లిన్ భార్యలు మన మాట వినరు. వారితో కాపురం చెయ్యడం కత్తి మీద సాము...ముఖ్యంగా రాత్రులు..."

నవ్వుల వాన.

వారితో మాట్లాడటం వృథా అని



సారథి వెళ్ళిపోయాడు. తన సీట్లోకి పోయి ఫైలు చూడసాగేడు. టైం అయినా యింకా చాలామంది సీట్లలోకి రాలేదు. జవాను వరండాలోకి పోయి యింకా ఎవరు రాలేదో చూస్తున్నాడు. సామ్రాజ్యానికి రిపోర్టు యివ్వడానికి ఈ రూలు ఆమె పెట్టిందే. జవాన్ను చూసి నలుగురూ చేరుకుంటున్నారు.

సామ్రాజ్యం స్వయం కృషితో ఆ స్థాయికి చేరుకుంది. ఇది అందరికి అసూయగా వుంది. మాటల్లోను, చేతల్లోను అది రోజూ బయటపడుతోంది.

మర్నాడు నుంచి క్యాంటీనుకి పోవడం మానేశాడు. తనని చూసి వాళ్ల యిబ్బంది పడటం అతడికి నచ్చలేదు. దగ్గర్లో హోటలేం లేదు.

స్టోర్ రూం లోకి వెళ్ళి వస్తూ సామ్రాజ్యం విశాలమైన హాలులో భర్త ఒక్కడూ వుండటం చూసి దగ్గరకి వచ్చి "అలా వున్నారేం ?" అనడిగింది.

"అబ్బే..." ఎవరయినా వస్తారేమో, చూసే బాగుండదని కంగారుగా లేచాడు.

"టీ తీసుకోలేదా... నా రూంలోకి రండి" సామ్రాజ్యం వెళ్ళిపోయింది.

రెండున్నరయింది. సామ్రాజ్యం విజిట్ కి వచ్చింది. గుమస్తాలు పనులు చేస్తు



న్నట్లు నటిస్తున్నారు. అంతటా నిశ్శబ్దం. బాతాకానీలు చర్చలు బందయ్యాయి. 'నా సామ్రాజ్యం' గర్వంగా అనుకున్నాడు సారథి. ఇంత మందిని శాసించేది తన భార్య. ఆమెను శాసించేది తాను.

సారథికి గర్వం కలిగింది.

ఆమె వెళ్ళిపోయాక గురుమూర్తి ఫైలు తీసుకుని సారథి సీట్లోకి వచ్చాడు. "ఇదోసారి వెరిఫై చెయ్యవోయ్ !"

"మీరు రావడం ఎందుకు? జవాను చేత పంపరాదూ?"

"మనలో మనకేమిటోయ్ !"

గురుమూర్తి కింది ఉద్యోగుల మీద పులిలా పడతాడు. అధికారాన్ని దారుణంగా చూపిస్తాడు. సారథిని మంచి చేసుకోడానికి, అతణ్ని ఉపయోగించుకో డానికి ఎత్తు వేస్తున్నాడు.

జవాను వచ్చాడు సారథి దగ్గరికి. "అమ్మగారు పిలుస్తున్నారండీ!"

సారథి వెళ్ళగానే గుసగుసలు.

"మొగుణ్ని లోపలికి రమ్మంది - విరహం కాదుకదా !" వీరాస్వామి సందేహం.

"సారథిగాడు అదృష్టవంతుడు" సన్యాసిరాజు.

హెడ్ క్లర్కు గురుమూర్తి వారి నవ్వులు చూసి 'సైలెన్స్' అని డస్కు చప్పుడు చేశాడు. ఈ గోల లోపలికి వినపడితే తనకి అక్షింతలు.

సామ్రాజ్యం టపా చూస్తోంది. సారథిని చూసి "మీ అమ్మగారు వుత్తరం రాశారు. రేపు తెనాలి పెళ్ళికి వస్తున్నారట. మీరు అక్కడికి వస్తే యిక్కడికి తీసుకురావ చ్చని రాశారు" అంటూ ఉత్తరం యిచ్చింది.

సారథి వుత్తరం పైపైన చూసి "అమ్మ నీకే రాసింది - ఎలా గయినా మీరిద్దరూ ఒకటే. అత్తాకోడళ్ళ మధ్య ఇంత సయోధ్య పనికిరాదు" అన్నాడు.

"అసూయగా వుందా ?"

"ఉన్నా చేసేదేముంది ?"

"రేపు సెలవుపెట్టి వెళ్ళి తీసుకు రండి అత్తయ్యని"

"అజ్ఞ !" సారథి నవ్వుకుంటూ నడిచాడు.

* * *

తల్లిని తీసుకురావడానికి సారథి బస్ స్టాండుకి వచ్చాడు. విజయవాడ వెళ్ళే బస్సులు ఎక్కడా దర్శనంలేదు. స్టాండు అంతా గలీజుగా వుంది. సన్నసన్నగా తుంపర పడుతూండేమో, నేల తడిగా వుంది.

"హలో!"

సారథి వెనక్కి చూశాడు.

హేమ ! తమ నాటకాల్లో వేషాలు వేసే హేమ. నాటకానికి వచ్చినప్పుడే ధుమ ధుమలాడిపోతూంటుంది. ఎవరయినా మాట్లాడినా కరచినట్లు మాట్లాడుతుంది. అలాంటిది నవ్వుతూ పలకరించడం సారథికి థ్రిల్లింగ్‌గా వుంది.

హేమ వృత్తి నటికాదు. ఆమె భర్తకి వ్యాపారాలున్నాయి. అవి తెచ్చే లాభాలు న్నాయి. ఎప్పుడూ బొంగరంలా తిరుగు తూంటాడు. హేమ కాలక్షేపం కోసం కళాసేవ చేస్తోంది - పిల్లాపీచు లేరు కాబట్టి.

"ఎందాకా ?"

"తెనాలి !"

హేమ నవ్వింది.

"ఎందుకు నవ్వుతారు?"

"నేను ఇప్పుడే అక్కణ్నుంచి వస్తున్నాను. ఏమైనా ముఖ్యమైన పనా ?




మన నాటకానికి తెనాలిలో ఆఫర్ వచ్చింది. ఇంటికి రండి మాట్లాడుకుందాం !"

సారథి ఈ అవకాశం పోగొట్టుకో దలుచుకోలేదు. హేమని చూసి ఎప్పట్నించో గుటకలు మింగుతున్నాడు. హేమ అందగత్తె! లావణ్యం, సౌకుమార్యం ఆమెలో సమపాళ్ళ గావున్నాయి. అలాంటి హేమ రమ్మంటే...

తల్లిని తీసుకు రావడానికి తనే వెళ్ళక్కర్లేదు. సామ్రాజ్యాన్ని వెళ్ళమంటే సరి! ఆమెకి ఫోన్‌చేసి చెప్పాడు.

"మీరు ఎందుకు వెళ్ళరుట ?" సామ్రాజ్యం నిలేసింది.

సారథి ఫోన్ పెట్టేశాడు.

హేమ రిక్షా పిలిచి ఎక్కి కూర్చుంది. సారథి ఆమె పక్కన కూర్చున్నాడు. రోడ్ల గురించి, వాన గురించి ఆమెతో మాట్లాడేస్తున్నాడు.

"మీరు దగ్గరుంటే నోరు తెరవక్కర్లేదు !"

రిక్షా పాత మేడముందు ఆగింది. ఆ పెద్ద ప్రహరీ ఇంటిని చూస్తూ సారథి ఆమెతో లోపలకి వెళ్ళాడు. సింహద్వారం దగ్గర కునికిపాట్లు పడుతున్న నౌకరు, కుక్క మొరగడం చూసి లేచి "అమ్మగారూ" అంటూ ఎదురువచ్చి బేగ్ అందుకున్నాడు.

హేమ అతణ్ని తన ప్రయివేటు గదిలో కూర్చోబెట్టింది. "బట్టలు మార్చుకుని వస్తాను. వెయిటాన్!" అంటూ లోపల కెళ్లింది.

గోడమీద వున్న ఆయిల్ పెయింట్లు, రకరకాల భంగిమల్లో వున్న హేమ ఫొటోలు చూస్తూ కాలక్షేపం చేస్తుండగా. హేమ ప్లేటులో అనాస ముక్కలతో వచ్చింది.

హేమ పల్చటి చీరలో ఫ్రీగా వుంది. ఆమె ఒంపుసొంపులు పారదర్శక మవుతున్నాయి. సోఫాలో కాళ్లు వూపుతూ కూర్చోవడంవల్ల, ఫాను గాలికి చీర పైపైకి లేస్తోంది.

నాటకం గురించి చెబుతానన్న హేమ నాటకం గురించి చెప్పలేదు. సారథి అడగ లేదు. సారథికి మరో వూహ రాలేదు. సవాలు చేసే ఆమె అవయవాలు అక్షయ పాత్రల్లా కనిపిస్తున్నాయి.

"పేకాడుకుందామా ?" హేమ అడిగింది.

"నాకు అంతగా రాదండీ."

"కొద్దిగా వచ్చును కదా! నేను నేర్పుతాను !" హేమ లేచి బీరువాలోని డబ్బాయల్ తీసి ముక్కలు పంచింది.

సారథికి ఆట విసుగ్గావున్నా హేమ కోసం ఓపిక పట్టాడు. ఓపికవల్ల ఆటమీద ఇంట్రస్టు ఏర్పడింది.

రాత్రి ఎనిమిదిగంటలదాకా ఆట సాగింది. సారథి వెళ్ళడానికి లేచాడు. "భోంచేసి వెళ్ళండి" బలవంతం చేసింది.

భోజనాలయినాయి !

"మీవారు వూర్లో లేరేమో ! ఒంటరిగా వుండాలి కాబోలు !"

"మీరు కంపెనీ ఇస్తారా ?"

సారథి అసంపశరథి అయ్యాడు.

"వై నాట్ ?"

హేమ కౌగిలిలో నిద్రపోతున్న సారథికి, ఆమె లేపుతూండగా మెలకువ వచ్చింది. "ఆయన వస్తున్నానని ఫోన్ చేశారు" అంది వెళ్ళమని ధ్వనియిస్తూ.

సారథి హడావిడిగా బట్టలు వేసుకున్నాడు.

"సాయంత్రం వస్తారుకదా !" గుమ్మం

దాకావచ్చి టాటా చెప్పింది.

ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. చీకటి వుంది. రెండు ఫర్లాంగులు వెళితే కాని రిక్షా దొరకలేదు.

సామ్రాజ్యం తలుపు తీసింది. ఆమెను చూడటానికి గిల్టీగా ఫీలయ్యాడు. అతడి బట్టల నుంచి వస్తున్న సెంటు వాసన ఆమెని నిలవేసింది. సారథి తొందరగా పోయి మంచం ఎక్కాడు. సామ్రాజ్యం వచ్చి పిల్లల దగ్గర పడుకుంది.

"అమ్మ వచ్చిందా?" బెదురుగా అడిగాడు.

"వచ్చారు."

"నేను రాలేదందా ?"

"లేదు" ముభావంగా సమాధానం.

సారథికి ఆమెతో ఇక మాట్లాడే ధైర్యం లేకపోయింది. పడుకున్నాడు: కాని నిద్రపట్టలేదు. హేమతో గడిచిన నిన్న, గడిచినరాత్రి గుర్తుకొచ్చాయి. హఠాత్తుగా ఆమెకి తనమీద ఇంట్రస్టు ఎలా ఏర్పడింది?...ఇది సామ్రాజ్యానికి తెల్సిపోదు కదా !

తెల్లవారింది. సామ్రాజ్యం లేచింది. ఇంకా పాపమ్మ లేవలేదు. లేపితే విసుక్కుంటూ లేచింది. దమయంతి పూజ అప్పటికే అయిపోయింది.

సామ్రాజ్యం కాఫీ పెడుతూంటే, గుమ్మంలో కూర్చుంది ఆవిడ. "ఎప్పుడు వచ్చాడమ్మా వాడు?"

"ఇందాకనే! ఆఫీసు పనిమీద భీమవరం వెళ్ళారు."

భార్య తనని కాపాడడంతో సారథికి ధైర్యం వచ్చింది. "ఎప్పుడొచ్చావు?" అంటూ ఆమె పక్కన కూర్చున్నాడు!

"నిన్న నువ్వు వస్తావని ఎప్పట్నించి చూశారా? ఇంతలో సామ్రాజ్యం వచ్చింది."

"కుదరలేదమ్మా నేను వద్దామంటే."

సామ్రాజ్యం ఇద్దరికీ కాఫీ ఇచ్చింది.

"సామ్రాజ్యం ఆఫీసరయిందే అమ్మా!"

"చెప్పిందిరా! నిన్ను గుంజీలు తీయించమన్నాను."

"మీ అబ్బాయిగార్ని కూడా పరీక్షకి కట్టమంటున్నాను."

"పనికివచ్చే పని మావాడు చెయ్యడు."

"అందరూ ఆఫీసర్లయిపోతే ఎలాగ ? పల్లకి మోసేదెవరు?"

సుప్రభాతంలోని రంగవల్లికలా తీర్చి దిద్దిన వారి సంసారాన్ని చూసి దమయంతి సంతోషించింది. ముచ్చట పడింది. కొడుక్కి కన్న వాళ్ళుగా తాము ఏం చెయ్యక పోతున్నా సుఖపడుతున్నాడని తెల్సి ఆ తల్లి మనసు సంబర పడింది. ఇదంతా సామ్రాజ్యం ప్రయోజకత్వమని ఆమెకి తెల్సు.

దమయంతి వచ్చినందుకు ఆఫీసుకి సెలవు పెడదామనుకుంది. కాని డైరక్టర్ వస్తున్నాడు. ఆమె వెళ్ళడం తప్పనిసరి.

"పెందరాళే వచ్చేస్తాను అత్తయ్యా."

"వెళ్ళిరామ్మా."

ఆమె వెళుతూంటే సారథి సెలవు చీటి ఇచ్చాడు. సామ్రాజ్యం దాన్ని చదువుతూ "అమ్మతో కబుర్లు చెప్పుకోవాలా" నవ్వి అడిగింది.

"నీ కొడుకు నీతో కబుర్లు చెప్పడం లేదూ !"

"ఓ.కె." సామ్రాజ్యం జీపులో వెళ్ళిపోయింది.

తల్లితో కాస్సేపు కబుర్లు చెప్పి, హేమకి ఫోన్ చేశాడు. "రండి. మీ కోసమే ఎదురు చూస్తున్నాను" అంది.





"ఇప్పుడే వస్తాను అమ్మా" అంటూ వెళ్లాడు.

హేమ వరండాలో నిలబడి వుంది.

"మీ వారు లేరా?"

"సాధారణంగా వుండరు ఆయన."

ఇద్దరూ కాస్సేపు పేక ఆడుకున్నారు.

"వద్దు నాకింక బోరు కొడుతోంది" అన్నాడు సారథి.

"రిక్రియేషన్ ఏం కావాలి?"

"నువ్వు" దగ్గరకి తీసుకుని ఆవేశంగా పెదాల మీద, బుగ్గల మీద చుంబించాడు.

"తలుపులేనా వేయండి" ముద్దుగా మందలించింది.

సామ్రాజ్యం మూడు గంటలకే వచ్చేసింది. భర్త ఇంటి దగ్గర లేకపోవడం ఆశాభంగం చెందింది. సెలవు పెట్టి ఏం చేస్తున్నాడు ? అతడిలో కనిపిస్తున్న మార్పు ఏమిటి? సామ్రాజ్యానికి అశాంతి ఎక్కువ కాసాగింది.

"పిన్నీ... ఏదయిన టిఫిన్ చెయ్యి" పాపమ్మని కేకవేసింది.

పాపమ్మ నడవాలో పడుకునివుంది. "నాకు నడుం పట్టేసిందమ్మాయ్ ! కదల లేక పోతున్నాను" అంది లేవకుండానే.

నాలుగూ అమరగానే పాపమ్మకి బద్ధకం ఎక్కువయింది. భార్యా భర్తలు ఇద్దరూ వుద్యోగస్థులు కావడం ఆమెకి ఆట విడుపుగా వుంది.

సామ్రాజ్యమే లేచి గ్యాస్ వెలిగించింది.

"నేను చేస్తానమ్మా. తిరిగి వచ్చావు" దమయంతి పనిలో చొరబడింది కోడలి దగ్గర్నుంచి లాక్కుని.

సురేష్, రాణి అప్పచ్చుల కోసం ఎదురు చూస్తూ కూర్చున్నారు.

సారథి హడావిడిగా వచ్చాడు. "అమ్మా...సినిమా కెళదాం తెమలండి.. టికెట్లు తెచ్చాను."

"ఇప్పుడెందుకురా ?"

"రావల్సిందే."

టిఫిన్, కాఫీలయ్యాయి. దమయంతి తయారైంది. సామ్రాజ్యం వుదాసీనంగా కూర్చోవడం చూసి "తెమల్లేదా ?" అనడిగాడు.

"ఒంట్లో బాగాలేదు. పిల్లల్ని, అమ్మ గార్ని తీసుకెళ్ళండి."

"అంతలో ఏమొచ్చింది ?"

"తలనొప్పి !"

భర్త ప్రవర్తనే తలనొప్పిగా తయారైంది. ఆ అశాంతి వల్ల భర్తతో మాట్లాడటం కూడా అయిష్టంగా వుంది.

సారథి మరేం మాట్లాడలేదు. తల్లిని, పిల్లల్ని తీసుకొని వెళ్ళిపోయాడు. సురేష్ బుద్ధిగానే చూశాడు. కాని రాణి తల్లి లేక పోవడంతో ఏడుపు ప్రారంభించింది. బిస్కట్లు, స్వీట్లుకొనియిచ్చి బలవంతంగా ఆపాడు. ఆ చిరాకుతో అతడికి సినిమా చూడబుద్ధికాలేదు.

"పోదాం నడవరా ! వెధవసినిమాలా వుంది..."అంది దమయంతి కూడా.

ఇంటికి వచ్చారు. పాపమ్మ దొంగ చాటుగా ఫలహారం చేసి నిద్ర నటించ సాగింది, వడ్డన చెయ్యడం ఇష్టంలేక. సామ్రాజ్యం లేచి వడ్డించింది.

"నువ్వూ కూడా పెట్టుకోమ్మా" దమయంతి అన్నది.

"ఆకలేయందండి. ఫర్వాలేదు."

అందరూ తిని లేచినా, సామ్రాజ్యం తినలేదు. తినబుద్ధికాలేదు. మజ్జిగ మాత్రం తాగి వంటిల్లు శుభ్రం చెయ్యసాగింది

సురేష్ నిద్ర కళ్ళతో గదిలో కుర్చీ

మీద వున్న గ్లాసు పడేశాడు. అది పగిలి పోయింది. మంచంమీద వున్న సారథి వాడ్ని రెండు వేశాడు. ఏడుపు ప్రారంభించాడు.

"ఛీ...వెధవగోల" కసురుకున్నాడు.

సామ్రాజ్యం వచ్చింది ఏమిటోనని.

"గ్లాసులు ఎక్కడపడితే అక్కడ పెడతావా? నీకు పనంటే అశ్రద్ధ పట్టుకుంది! అన్నీ నేను చూసుకుని ఏడవాలా?" సారథి కోపం చూపాడు.

సామ్రాజ్యం ఎత్తసాగింది.

"రోజూ ఏదోపనుప్పు పోవడమే... ఛీ...నీకు బాధ్యతలేకుండా పోయింది. అక్కడికీ రోజూ చెబుతూనే వున్నాను. నామాట వినిపించుకుంటున్నావా?" ధ్వని పెంచాడు.

అంత చిన్న విషయానికి ఎందుకు గోల చేస్తున్నాడో ఆమెకి అర్థంకాలేదు.

"వాడు పడేస్తే అదేం చేస్తుందిరా? పిల్లలు పొగొట్టకుండా వుంటారా? అమ్మాయ్ జాగ్రత్త...చేతిలో గుచ్చుకుంటాయి" అంది దమయంతి వచ్చి.

"పిల్లలు పాడుచెయ్యకుండా చూసే జ్ఞానం దానికేడ్వాలి!"

సామ్రాజ్యం ఏమీ మాట్లాడకుండా గాజుపెంకులతో ఎత్తిపోవడం అతడికి తృప్తి నిచ్చింది. భార్య ఆఫీసరు అయిందని తల్లి తన వ్యక్తిత్వాన్ని ఎక్కడ అపార్థం చేసుకుంటుందోనని, ఆమెని మందలించాడు. ఆమె ఆఫీసరయినా, తన మాటకి ఎదురులేదని తల్లి దగ్గర రుజువు చేసుకోవానికి తాపత్రయం.

"సరేలే...అయిందిగా" దమయంతి వసిరి పడుకొండిపోయి.

సారథి నవల చదవసాగేడు. టేబిల్ లైట్ వున్నా అది వెయ్యక, ట్యూబ్‌లైట్ వేశాడు. సామ్రాజ్యం మరో మంచంమీద పిల్లలదగ్గర పడుకుంది ఆమెని హింసించడానికే అలా చేశాడు. దీపం కాంతికి పురుగులు ఎగరసాగేయి. సామ్రాజ్యం నిద్రపట్టకపోయినా బాధపడలేదు...భర్త ప్రవర్తన ఇంకా బాధాకరంగా వుంది.

మర్నాడు దమయంతి ప్రయాణమైంది.

"మీకోసం ఇవాళ సెలవు పెట్టాను. దుర్గగుడికి వెళ్లొద్దాం. మీరీమధ్య వెళ్ళలేదన్నారుగా!" అంది సామ్రాజ్యం.

దమయంతి కాదనలేదు. షేవ్ చేసుకొంటున్న కొడుకుని "నువ్వుకూడా రారా అబ్బాయి!" అని చెప్పింది.

సామ్రాజ్యం చెప్పలేదని "నాకు ఖాళీలేదమ్మా. మీరు వెళ్ళిరండి" నిన్న భార్య తనతో రాలేదన్న పంతంతో అన్నాడు.

దమయంతి, సామ్రాజ్యం మధ్యాహ్నం రెండు గంటలకి వెళ్ళారు.

సారథి ఆఫీసుకాగానే హేమ ఇంటికి వెళ్ళాడు హేమ విజిటింగ్‌రూంలో ఎవరితోనో మాట్లాడుతోంది.

"రండి సారథిగారూ...ఈయన మా ఫ్యామిలీ ఫ్రెండు రామలోకంగారు. సినిమాల్లో సంగీతం వినిపిస్తూంటారు"

హేమ ఇద్దర్నీ పరిచయం చేసింది. కళారంగంమీద చర్చలో పడ్డారు. నౌకరు టీ, టిఫిన్ తెచ్చాడు.

హేమ పేకలు తీసింది.

"చిన్నస్టేకుమీదయితే నేను ఆడను" అన్నాడు రామలోకం.

"డబ్బుపెట్టి ఆడే అలవాటు సారథిగారికి లేదే!" అంది హేమ.

అవమానం ఫీలయి "పర్వాలేదు చేయండి" అన్నాడు సారథి.




రాత్రి తొమ్మిది గంటలదాకా ఆట సాగింది. సారథికి తొంభై రూపాయలు వచ్చాయి. రామలోకం వెళ్ళిపోయాడు. హేమ భోజనానికి ఆపేసింది.

"సినిమాకి వెళదామా?" వక్కపొడి యిస్తూ అడిగింది.

"నడు..."

రిక్షా ఎక్కారు. బజారుకు రాగానే బ్రాందీషాపు దగ్గర ఆపు చేయించింది. "బాగ్ పైపరు తీసుకోండి" అంది వంద నోటుయిస్తూ.

"భలేవారే! మీరు ఇవ్వాలా" సారథి పుచ్చుకోలేదు. బాగ్ పైపర్ తెచ్చి ఆమెకిచ్చాడు.

"సినిమా అయ్యాక స్వర్గం" నవ్వింది.

సారథి వుదయంకాని ఇంటికివెళ్ళలేదు. సామ్రాజ్యం ఎక్కడికి వెళ్ళావని అడగ లేదు. తల్లి మాత్రం నిలవేసింది.

"మీరు రారని స్నేహితుడి ఇంట్లో ఆగిపోయానమ్మా" అంటూ అక్కడ నిలబడకుండా బాత్ రూంకి పోయాడు.

చాకలి బట్టలికి వచ్చాడు. సామ్రాజ్యం బట్టలు వెతికి వేస్తూంటే, సారథి ప్యాంటు నుంచి ఆకు పచ్చని సిల్కు రుమాలు చూసింది. దానిమీద ఒకమూల ఎర్ర దారంతో "హేమ" అని కుట్టబడి వుంది.

సామ్రాజ్యం అడుగుదామా? అనుకుని విరమించుకుంది.

దమయంతి భోజనంచేసి బయలు దేరింది. సామ్రాజ్యం అత్తగార్ని బస్ స్టాండ్ కి తీసుకెళ్లి బస్సు ఎక్కించింది.

ఆఫీసుకిపోయినా పనిమీద దృష్టి నిల్వలేదు ఆమెకి.

* * *

వారం రోజులు గడిచాయి. సారథి యింటిపట్టున వుండటం లేదు. వీలైనంత సమయం హేమ దగ్గరే కాలం గడుపు తున్నాడు. సారథిని సామ్రాజ్యం ఆఫీ సులోనే చూడవల్సి వస్తోంది. ఎందుకంటె సామ్రాజ్యం ఆఫీసుకి బయలుదేరే సమ యానికి గాని లేవడు. తిరిగి అర్ధరాత్రి రావడం. ఏ పాపమ్మో తలుపు తీస్తుంది. ఒకసారి ఆఫీసుగదిలో అడిగింది "ఎక్క డికి వెళుతున్నారు?" అని.

"ఇది యిల్లుకాదు. ఆఫీసు" తీక్ష ణంగా చూసి వెళ్ళిపోయాడు.

ఆరోజు రాత్రి మెలకువగా కూర్చుంది పట్టుదలగా. సారథి పెందరాళే తొమ్మి దింటికే వచ్చేశాడు.

"వడ్డిస్తాను ... రండి. నేను కూడా తినలేదు."

"నా భోజనం అయింది" లుంగీ చుట్టుకుని ఈజీ చైర్ లో కూర్చున్నాడు.

"ఎక్కడ. హేమ దగ్గరా?"

సారథి తొట్రుపడి సర్దుకున్నాడు. తన సంగతి తెల్సింది మాట. అయినా సారథి భయపడలేదు. "అవును!"

"భోజనం ఒక్కటేనా?"

తనని అనుమానిస్తుంది. "నేనేం శ్రీరాముణ్ని కాను" అన్నాడు.

"శ్రీరాముణ్నని రుజువు చేశారుగా!" తనని అనుమానించిన ఘట్టం గుర్తు చేసింది.

"సంతోషించాం తెలివికి" ఈస డించాడు.

"నాటకాల అమ్మాయేనా హేమ అంటే"

"బజారు రకం కాదు. అడ్వాన్స్డ్ ఉమన్ హేమ. నీలాంటి వాళ్ళు ఆమె దగ్గర చాలా నేర్చుకోవాలి"



సామ్రాజ్యం భర్త మాటలకి ఆవేశ పడలేదు. శాంతంగానే "హేమతో ఎందుకు తిరగవల్సి వస్తోంది ?" అనడిగింది.

"నీ మూలంగానే"

సామ్రాజ్యం నివ్వెర పడింది.

"నీకు పనీ పాటేతప్ప పడకింటిలో ఎలా వుండాలో తెలియదు. పిల్లలు పుట్టాక నీకు మడి ఎక్కువయిపోయింది. అది నాకిష్టముండదు"

"మిమ్మల్ని కాదన్నానా ?"

"మొక్కుబడి దేనికి ?"

"సరే !" సామ్రాజ్యం పక్క గదిలోకి వెళ్ళిపోయింది.

పెద్ద పోట్లాట జరుగుతుందని,



సామ్రాజ్యాన్ని చీల్చి చెండాడవచ్చునని వుబలాట పడ్డాడు. కాని ఆమె హఠాత్తుగా తగ్గిపోవడంతో అతడికి నిరాశ కల్గింది. పుస్తకం చదువుతూ మంచం మీద పడుకున్నాడు. సామ్రాజ్యం పిల్లల్ని పక్క గదిలో పక్కవేసి పడుకోబెట్టింది.

'అలక సాగిస్తుంది కాబోలు ... ఏడ్వనీ ! తను లెక్కచెయ్యడు'

పుస్తకం రసవత్తరంగా వుండటం వల్ల యింట్రస్టుగా చదువుతున్నాడు. సామ్రాజ్యం వచ్చి పుస్తకం లాగేసింది.

ఆమెను చూసి విస్తుపోయాడు. సామ్రాజ్యం తెల్లటి షిఫాన్ చీరలో, జడనిండా వత్తుగా మల్లెలతో, సెంటు వాసనతో ఘుమఘుమ లాడుతోంది. సామ్రాజ్యం టీ పాయ్ మీద 'నవరాత్రి' అగరవత్తులు వెలిగించింది.

గది సుగంధమయం. సామ్రాజ్యం తలుపు వేసి వచ్చింది. సారథి ఆమె ప్రత్యేక అలంకరణ చూసి ముగ్ధుడయ్యాడు. అతడి కసి అంతా మటుమాయమైంది.

"ఎలా వున్నావో తెల్సా ?" ఆమెను చేతులలో ఎత్తి మంచం మీద పడేశాడు.

"మీ సరదాలు వద్దంటున్నానని అనుకోవద్దు. కాని బాధ్యతలు కూడా గుర్తు చేసుకోవాలని కోరుతున్నాను."

"అలాగే సామ్రాజ్యం నువ్వు చెప్పినట్లే వింటాను"

రెండు రోజులు ఆమె చెప్పినట్లే విన్నాడు, తర్వాత మామూలే. బలహీనతలు గల వ్యక్తి శపథాలు చేసినా, ప్రతిజ్ఞలు చేసినా ఒకటే. హేమ కబురు పెట్టడంతో జెండా ఎత్తేశాడు. సామ్రాజ్యం ఉసూరుమంది.

సామ్రాజ్యానికి రోజులు భారంగా గడుస్తున్నాయి.వంటలో సాయం చేస్తుందని పాపమ్మని తెచ్చుకుంది. పాపమ్మ జీతాలు, మామూళ్ళుపుచ్చుకుంటూనే పనిమీద శ్రద్ధ తగ్గించింది. ఆమెకే సామ్రాజ్యం చేయ వల్సివస్తోంది. పాపమ్మ కూడా సరకులు కాష్ చేసుకుంటోంది. చిన్న చిన్న వస్తువులు కనిపించడంలేదు.

సామ్రాజ్యం నిలేస్తే "దొంగబుద్ధి నాకు లేదేవ్. ఎలా పోయాయో చూసుకో" అంటూ దండకం చదివింది.

పిల్లలు కూడా ఆమె వద్ద వెధవ బుద్ధులు నేర్చుకుంటున్నారు. ఏడవకుండా వుంటుందని పాపమ్మ రాణికి అవీ - యివీ పెట్టేసేది. దాంతో ఆ పిల్ల ఆరోగ్యం దెబ్బతింది. ఒక రోజు న మధ్యాహ్నం ఆఫీసునుంచి సారథి తల నొప్పిగా వుందని హఠాత్తుగా వచ్చాడు. పాపమ్మ తాము పడుకునే పందిరి మంచం మీద పవళించి వుంది. ఫ్యాను వేసుకుని రాణి, సురేష్ ఒకర్ని ఒకరు కొట్టు కుంటున్నారు.

సారథి కేకలకి వులిక్కిపడి లేచింది. కంగారుగా పెరట్లోకి వెళ్ళిపోయింది. సారథి ఆమె కూడ వెళ్ళాడు.

"నువ్వు మనిషివే. అసలు నువ్వు తినేది అన్నమా? గడ్డా? పిల్లల్ని వదిలేసి మంచం ఎక్కుతావా?... మేం వుపయోగించే వస్తువులు వాడకూడదని గతంలో చెప్పాను. మళ్ళీ చేశావంటే అర్థం ఏమిటి?"

పాపమ్మ తప్పు ఒప్పుకోలేదు. ఆమె దృష్టిలో సారథికి విలువలేదు. సామ్రాజ్యం ఆఫీసరు కావడంతో ఆమె అంటేనే విలువ ఎక్కువ.

"ఇప్పుడేమయిందని... కాస్సేపు పడుకున్నాను. అదీ తప్పే? ఇలా మాటి మాటికీ నిలెయ్యడం ఏం బాగా లేదయ్యోయ్. మాటంటే పడేదాన్ని కాదు."

"పడకపోతే దయచెయ్యి."

"పోతాను. చాకిరీ చేసే ముండని. నీ ఇంటికే పుస్తి కట్టానా? ఎక్కడ చేసినా ముద్ద వెళ్ళిపోతుంది. ఇలాంటి కొంపలు బోలెడు నాకు."

ఆ తిరస్కారంతో అతడికి ఒళ్ళు మండి పోయింది. "నీ సామాను తీసుకుని తక్షణం నడు! మాటకి మాట చెబితే అసహ్యం నాకు."

సారథి లోపలికి పోయి లుంగీ చుట్టుకుని, పిల్లలిద్దరికి బిస్కట్లు పెట్టి మాలిమి చేసుకున్నాడు. పాపమ్మ కాకీ సంచీలో బట్టలు సర్దుకుని కూర్చుంది నడవాలో

"ఇంకా కదలవేం?"

"మీ ఆవిడ రానీ!" నీ మాటేం లెక్క లేదన్నట్టు చూసింది.

"అది వచ్చి చెప్పేదేమీ వుండదు. అది రావాలంటే, ఏ రోడ్డు మీదో నిలబడు. ఇక్కడ మాత్రం ఆగడానికి వీల్లేదు" గావు కేక పెట్టాడు.

పాపమ్మ సణుక్కుంటూ ఎదురింటికి పోయికూర్చుంది.ఇంజనీర్ గార్ఫి పెళ్ళాంతో సారథి కుటుంబంమీద లెక్కలేనన్ని

చాడీలు చెప్పింది.

"వాడు త్త చవటమ్మా! పెళ్ళాం చాటున బ్రతుకుతున్నాడు. అది మంచి పిల్ల కనుక వీడి ఆటలు సాగుతున్నాయి. మరొకత్తి అయితే ఎప్పుడో గెంటి వేసును."

"మగవాడు ప్రయోజకుడవ్వాలమ్మా. మొగుడికి అదేం భయపడుతుంది ఆఫీసరు గిరీ చేస్తూ? పెళ్ళాం దగ్గర చేతులు నలుపుతూ వుద్యోగం చెయ్యడం... ఛ...ఛ...నాకేం నచ్చలేదు."

సాయంత్రం స్వామ్రాజ్యం జీపు రాగానే పాపమ్మ హడావిడిగా వచ్చి సారథి వెళ్ళి పొమ్మనట్లు ఫిర్యాదు చేసింది. "పోతానమ్మా? నాకేం బ్రతకలేనా?"

స్వామ్రాజ్యం భయపడింది. పాపమ్మ తప్పుకుంటే వంట, పిల్లలు వుద్యోగం తను నిర్వహించగలదా? పాపమ్మ వుండటం కొంచెం వెసులుబాటుగా వుంటోంది.

"కోపం మీద అని వుంటారు. నేను చెబుతాలే. వెళ్ళి పని చూసుకో!"

సారథి రివ్వున అక్కడికి వచ్చాడు. "నేను పొమ్మన్నదాన్ని, నువ్వు రమ్మనడం...పనివాళ్ళ దగ్గర నన్ను గాడిద చెయ్యాలని చూస్తున్నావా?"

"అదేం కాదండీ"

"అది ఇక్కడ పని చెయ్యడానికి వీల్లేదు. పాపమ్మ కావాలనుకుంటే,దానితో పాటు నువ్వు కూడా ఫో" స్పష్టంగా కర్కశంగా చెప్పి సైకిల్ దింపాడు.

సైకిల్ ఎక్కుతూ "నేను వచ్చేసరికి అది వుండకూడదు" హెచ్చరించాడు.

'ఈ మనిషికేం పిచ్చి ఎక్కలేదు కదా?' అనిపించింది స్వామ్రాజ్యానికి.

పాపమ్మని పంపడం తనకి అవస్థ తనని బాధ పెట్టడానికే సారథి ఈ నిర్ణయం తీసుకుని వుంటాడు. బాధా కరమైనా పాపమ్మని పంపి వేసింది.

*　　*　　*

స్వామ్రాజ్యానికి రోజు గడిస్తే యుగం గడిచినట్లు వుంటోంది. తెల్లవారు ఝామున లేస్తే అర్థరాత్రే విశ్రాంతి. పూర్వం సారథి ఇంటి పనులు సాయం చేసేవాడు. ఇపుడు తన పనులు కూడా స్వామ్రాజ్యానికే పురమాయిస్తున్నాడు. నిత్యం గొడవ పడటం ఎందుకని స్వామ్రాజ్యం తగ్గి వుంటోంది. ఆమె రాజీ పడే మనిషి.

గ్యాసు, కుక్కరు, ఫ్రిజ్... ఇలా ఆధునికమైన సదుపాయాలు ఇంట్లో వుండటంవల్ల వంట భారంగా లేకపోయినా పిల్లలు సమస్య అయ్యారు. సురేష్‌కి అయిదు వచ్చింది. రాణికి రెండో యేడు దాటుతోంది. తాము ఆఫీసుకు పోతే వారి నెవరు చూస్తారు? పొరుగు వారికి అప్ప గించడం నచ్చలేదు! ఆఫీసు నైట్ వాచర్‌ని ఇంటి దగ్గర పెట్టింది వాడికోసం

రోజులు గడుస్తున్నాయి. రూపకి ఏలూరు ట్రాన్స్‌ఫర్ అయింది. స్వామ్రాజ్యం ఇక్కడికి వచ్చాక స్నేహానికి ముఖం వాచి పోయింది. రూప రావడంతో ఆ సమస్య తీరింది.

తను కనిపెట్టిన మందులు భారీ ఎతున తయారు చెయ్యడానికి బొంబాయి లోని ఓ కంపెనీ సహకారం కోరాడు రాఘవయ్య. వాళ్ళు అంగీకరించారు. రాఘవయ్య అయిదారు నెలలు వుండడానికి సీతమ్మని స్వామ్రాజ్యం దగ్గర దింపి వెళ్ళిపోయాడు.

పిల్లల సమస్య తీరింది స్వామ్రా

జ్యానికి. సురేష్ ని కాన్వెంటులో వేసింది. ఇంటి పని తగ్గడంతో ఆమెకి విశ్రాంతి లభించింది.

ఆ రోజు ఆదివారం. సారథి తొమ్మిది న్నరకి లేచి కాఫీ తాగాడు. సిగరెట్ కాలుస్తూ వరండాలో పేపరు చూస్తు న్నాడు.

హేమ పదేళ్ళ కుర్రాణ్ని పంపింది. "రెండు వందలుంటే పంపండి. రేపు బ్యాంకు తీయగానే పంపిస్తాను"

జీతాలు వచ్చి వారంరోజులైనాయి. అప్పుడే సారథి జీతం సరదాలకి, పేకా టకి అయిపోయింది. హేమకి లేదని చెప్పడమా ?

"సామ్రాజ్యం" పిలుస్తూ పెరట్లోకి వెళ్ళాడు.

సురేష్‌కి తలంటు పోస్తోంది సామ్రాజ్యం. పులుసు కంట్లో పడుతోం దని ఏడుస్తున్నాడు వాడు.

"రెండు వందలియ్యి, కావాలి." ముకసరిగా అడిగాడు.

పూర్వం జీతం రాగానే తన జీతం కూడా ఆమెకే ఇచ్చేవాడు. రెండు నెలల నుంచి ఇవ్వడంలేదు. సామ్రాజ్యం అడగడంలేదు.

"ఇంకా ఇవాళ ఏడో తారీఖు ?"

అప్పుడే నీ జీతం అయిపోయిందాని ఆమె ప్రశ్న.

"ఇస్తాను, ఇవ్వను. డైరక్టుగా చెప్పు, సనిగితే సరిపడదు" కసురుకున్నాడు.

"బీరువాలో వున్నాయి తీసుకోండి" తగ్గిపోతూ అంది.

"ఆ ఏడుపు ముందరే ఏడవచ్చుకదా" విసురుగా వెళ్ళిపోయాడు.

* * *

"అమ్మగారు ఎపిబి ఫైలు పట్టుకు రమ్మంటున్నారు" జవాను వచ్చిచెప్పాడు.

సారథి రాక్‌లో, తన టేబిల్ మీద చూశాడు. లేదు. కంగారుగా వెతక సాగాడు. నిన్న సాయంత్రం క్లోజ్ చేసి రాక్‌లోనే పెట్టినట్లు జ్ఞాపకం. సన్యాసి రాజుని, వీరాస్వామిని అడిగాడు – పక్క టేబిల్సు కనుక. వారు తెలియదన్నారు. జవాను మరల వచ్చాడు.

"కనపడటంలేదు...ఫో..." కసురు కున్నాడు.

జవాను చెప్పగానే సామ్రాజ్యం స్వయంగా అతడి టేబిలు దగ్గరికి వచ్చే సింది. ఏం జరుగుతుందాని నలుగురూ ఆసక్తిగా చూస్తున్నారు.

"ఫైలు ఏమైంది?" సూటిగా అడి గింది.

"వెతుకుతున్నా"

"అంటే కనపడటంలేదా? అది యివాళ డిస్పాచ్ చెయ్యాలని నిన్న చెప్పాను కదా!"

"........."

"ఫైలు మిస్ అవడం స్వల్ప నేరం కాదు. శిక్ష ఏం పడుతుందో మీకూ తెల్సు."

సారథి కృంగిపోతున్నాడు. నలుగు రిలో జరుగుతున్న అవమానం భరించ లేనిదిగా వుంది. ఎగాదిగా చూడ్డం మినహా యించి ఏం మాట్లాడలేకపోయాడు.

"ఎక్కడి వక్కడ వదిలేస్తాడండీ !" మెప్పుదలకోసం అన్నాడు పద్మనాభం.

సామ్రాజ్యం వురిమి చూసింది. "ఇది మీ విషయం కాదు. అంచేత నోరుమూసు కుంటే మీకే క్షేమం."

"సారీ!"

"సారథిగారూ! సాయంత్రంలోగా మీరు ఫైలుని ప్రజంటు చేయాలి" సామ్రాజ్యం

 

లోపలకి వెళ్ళిపోయింది.

సారథి జీవచ్ఛవంలా కూర్చున్నాడు. నలుగురూ అతడ్ని ఎగాదిగా చూస్తున్నారు. సారథి క్యాంటిన్‌లోకి పోయి కూర్చున్నాడు.

"మొగుడని చూడకుండా యింత అవమానం చేస్తుందీ!"

"నిన్ను ఫూల్‌ని చేసింది"

"హోదా తెచ్చిన గుడ్డితనం బ్రదర్. విచారించకు, మనం తల్చుకుంటే ఏమైనా చెయ్యగలం"

క్లర్కులు వచ్చి ఓదారుస్తున్నట్లు నటిస్తున్నారు. వాళ్ళకి యిపుడు పండగలా వుంది. గురుమూర్తి దగ్గరకివచ్చి "ఆ ఫైలు తనే దాచేసి నిన్ను యిరుకున పెట్టడానికి ప్రయత్నిస్తున్నదని ఛార్జిషీటు తయారుచెయ్యి. మేమంతా నీ వెనుక వుంటాం. అవసరమైతే సమ్మె చేస్తాం ఎన్ని రోజులయినా. మొగుడ్నే నిలబెట్టేసిందే, మమ్మల్ని వూరుకుంటుందా? నమిలేయదూ!" హితోపదేశం చేశాడు.

సారథికి తిక్కగా వుంది.మధ్యాహ్నం సెలవు చీటి రాసి జవానుకి యిచ్చి వెళ్ళిపోయాడు. రూప, సామ్రాజ్యం టీ తీసుకుంటూండగా జవాను యిచ్చాడు చీటీ.

"ఆయన అప్‌సెట్ అయినారు" విచారంగా అంది.

"నలుగురిలోనూ కాకుండా, లోపలికి పిలిచి అడగాల్సింది" అంది రూప.

"అదే పొరపాటు రూపా! నేను చర్య తీసుకోవాలని గదా అవతలి వారి వుద్దేశం. సారథిగార్ని ఇరుకున పెట్టడానికి ఎవరో నాటకమాడుతున్నారు"

"నిజమే"

"ఆయనకి, నాకు విభేదం సృష్టించాలని చేశారు. నేను మౌనంగా కూర్చుంటే వాళ్ళు ఫైలు తగలేసి పైకి రిపోర్టు చెయ్యొచ్చు. అప్పుడెంత ప్రమాదం? కొంచెమయినా భేదాభిప్రాయాలు రావడం తప్పనిసరి. అందుకే నలుగురిలో మందలించాను"

"నేను అంతదూరం ఆలోచించలేదు."

"ఆయన ఎలాగూ పట్టించుకోరు రూపా! నువ్వే ఆ ఫైలు గురించి వాకబు చెయ్యి. ఆలస్యం అయ్యేకొద్దీ ప్రమాదం"

"అలాగే నువ్వేం వర్రీ కాకు" రూప తన సీటులోకి వెళ్ళిపోయింది.

ఆఫీసులో సారథి ఈ మధ్య ఎవరితోను క్లోజ్‌గా మాట్లాడటంలేదని రూప గ్రహించింది. సామ్రాజ్యం మీద కోపాన్ని స్టాఫ్ సారథిమీద తీర్చుకుంటున్నారు. ఒక విధంగా అతడు ఏకాకి. రూప టైం చూసింది. రెండు నలభై. సన్యాసిరాజు వరండాలో సిగరెట్ కాల్చుకుంటున్నాడు. రూప అతడి దగ్గరకెళ్ళింది.

"ఫైలు దొరికిందండీ. సారథిని యిరికించాలని చేశారు. సస్పెండు ఆర్డర్స్ నాలుగు టైప్ అవుతున్నాయి"

"నా పేరు వుందా?" కంగారుగా అడిగాడు.

"అందులో మీకూ భాగముందా? నిజం చెప్పండి. మిమ్మల్ని కాపాడతాను. ఉద్యోగం పోయిందా దొరకడంగోవిందా!"

"కాపాడతారా?"

"తప్పకుండా?"

"పద్మనాభం దాచేసి స్టోర్ రూం చెత్తబుట్టలో పడేశాడు. ఉందా లేదాని మధ్యాహ్నం నన్నోసారి చూసి రమ్మన్నాడు. అంతే! నాకేం తెలియదండి. సాయంత్రం తగలపెట్టేద్దాం అంటున్నాడు సన్యాసిరాజుతో"

"ఇదేం చెప్పకండి. మీకేం రాదు

వెళ్ళండి"

రూప స్టోర్ రూం చెతబుట్ట చూసింది. ఫైలుంది. దాన్ని అక్కడే పెట్టి, పద్మ నాథం మీద కన్నేసి వుంచింది. ఇది స్రామాజ్యంతో కూడా చెప్పింద.

ఆఫీసు అయిపోయాక రూప ఔట్ హవుస్ వెనకాల దాగివుంది. స్రామాజ్యం కూడా పక్కనే ఉంది. పద్మనాభం స్టోర్ రూంలోకి వెళ్ళి చేతి సంచీతో గబగబా బయటికి వస్తున్నాడు. రూప జవానుకి సైగ చేసింది. పట్టుకున్నాడు వెళ్ళి. ఫైలు కింప పడింది.

"వాటీజ్ డిస్?" స్రామాజ్యం గద్దించింది.

పద్మనాభం బిక్కచచ్చిపోయాడు.

మర్నాడు పద్మనాభం సస్పెండ్ చేయబడి ఆ తర్వాత సర్వీసునుంచి తొలగించబడ్డాడు. అందరికీ స్రామాజ్యమంటే భయం పట్టుకుంది.

* * *

ఇద్దరూ లోపలకి వెళ్ళారు. ఏసీలో నీలి రంగు డిమ్మర్సు వెలుగుతున్నాయి. సారథి తడుముకుంటూ ఒక టేబిల్ ముందు కూర్చున్నాడు.

"రా...అది రిజర్వ్డ్ !" శ్రీపతి ముందుకెళ్ళాడు.

సారథి కిలాంటి వాతావరణం కొత్త. విస్మయంగానూ వుంది. బెదురుగానూ వుంది. శ్రీపతి కూర్చున్నాక అతడి పక్కకి పోయి కూర్చున్నాడు.

స్టేజిమీద వెస్ట్రిన్ మ్యూజిక్ జరుగ తోంది. ఉల్లి పొరలాంటి జీన్స్‌తో ఓ వయ్యారి భామ స్టెప్స్ వేస్తోంది!

బేరర్ వచ్చాడు.

"మెక్‌డవల్ హాఫ్...తందూరీ చికెన్" శ్రీపతి ఆర్డర్ యిచ్చాడు.

స్టేజిమీద గ్రూప్ డాన్స్ ప్రారంభమైంది.

"మనం కూడా వెళదాం రా!" శ్రీపతి అన్నాడు.

"నాకు స్టెప్స్ రావు"

"నేర్చుకుందువుగాని"

"ఇప్పుడొద్దు. మరోసారి"

ఒకనిబ్ తాగాడు. ఒళ్ళంతా తేలి పోతున్నట్లుంది సారథికి. మధ్యాహ్నం నుంచి మండిపోయిన మనస్సు చల్ల బడింది.

శ్రీపతి తిరిగి గ్లాసు నింపి "కారీ ఆన్" అన్నాడు.

చేదుగా వున్నా, మింగడం కష్టంగా వున్నా, మిగతా వారిని చూసి సారథి వుద్రేకం తెచ్చుకున్నాడు. కళ్లు మూసుకుని గ్లాసు ఖాళీ చేశాడు.

మరో రౌండు కొట్టేసరికి సారథి ఔట్. శ్రీపతి పూర్తిచేసి సారథిని లేపాడు. సారథి టేబిల్‌మీద వంగి వున్నాడు. అతడిలో కదలిక లేదు. 'పూర్ ఫెలో' శ్రీపతి బేరర్‌కి బిల్లు పడేసి, మిత్రుణ్ని బయటకి నడిపించుకుని వెళ్ళి, రిక్షా ఎక్కించాడు.

చల్లగాలికి సారథికి మెలకువవచ్చింది

"ఏ...క్కడికి...పోతున్నాం"

"ఇంటికి"

"మా యింటికి వద్దు...హోటల్‌కి పోనీ!"

"పోనీ మా యింటికి వెళదాం. ఫ్యామిలీ లేదు"

"స రే!" ఆ మత్తులో కూడా స్రామాజ్యం గుర్తు వచ్చి కోపంతో వణికి పోయాడు.

 

ఇంటికి రాగానే శ్రీపతి పక్కలువేసి, సారథిని పడుకోబెట్టాడు. శ్రీపతి ఎంత తాగినా కంట్రోలులో వుండగలడు.

సారథి మర్నాడు లేచేసరికి, శ్రీపతి ఆఫీసుకి తయారవుతున్నాడు. సారథికి యింకా ఒళ్ళంతా తిమ్మిరిగా వుంది.

"ఆఫీసుకి రావా ?"

"రాను ... లీవ్ లెటరియ్యి" అని నాలుగు రోజులకి రాశాడు.

"ముఖం కడుక్కో, ఫ్లాస్కులో కాఫీ వుంది."

"అలాగే"

''లంచ్‌కి వస్తాను. కలిసి తిందాం"

శ్రీపతి వెళ్ళిపోయాడు. సారథి బెడ్ కాఫీ తాగి సిగరెట్ వెలిగించాడు. తను రాత్రి యింటికి రాకపోయినందుకు సామ్రాజ్యం గోల చేస్తూ వుంటుంది. ఏడవనీ! దానికా శాస్తి జరగవల్సిందే. నలుగురిలో తనని వెధవని చేస్తుందా? సారథి నెమ్మదిగా లేచి స్నానం చేశాడు. హోటల్‌కి పోయి లోడ్‌గా టిఫిన్ తిని కడుపు నిండేసరికి, మందు మీదికి పోయింది దృష్టి.

పదకొండు నలభై.

రెండు మూడు షాపులు తిరిగాడు. అవి ఇంకా తెరవలేదు. సందులోని దుకాణం తెరిచారు. ''విస్కీ కావాలి'' అన్నాడు.

''ఏ కంపెనీ సార్ ?''

సారథికి తెలిస్తేగా. అద్దంలోనుంచి చూపించాడు. ఆ ప్యాకింగ్ తీసుకుని గంటలో సీసా ఖాళీ చేశాడు, చిప్స్ తింటూ.

''ఓర్నీ...నన్ను మించిపోయేలా వున్నావు'' శ్రీపతి ప్రశంసించాడు వచ్చి.

సారథి నవ్వాడు.

"నీ భార్య చంపేసిందోయ్! నువ్వు ఇంటికి రావడంలేదని కంగారు పడుతోంది. నువ్వు ఎక్కడ వున్నావని నన్ను క్రాస్ చేసింది''

''చెప్పేశావా?''

''లేదోయ్. ఆఫీసుకి వస్తుంటే కనపడి ఇచ్చాడన్నాను.''

''గుడ్."

"కాని ఆవిడనమ్మినట్లు కనిపించదు.''

''దాని పొగరు నేను అణచివేస్తా'' కసిగా పళ్ళు కొరికాడు.

శ్రీపతి క్యారేజీ విప్పి కంచాల్లో వడ్డించాడు. సారథి ఏదో ఎంగిలిపడి తిరిగి పక్కమీద చేరుకున్నాడు.

మూడ్రోజులు గడిచాయి.

సారథి ఇంటికి రాకపోవడం, సామ్రాజ్యానికి దిగాలుగా వుంది. కనిపించినవారినల్లా అడుగుతూనే వుంది. భోజనం, నిద్ర లేకుండా ఎదురు చూస్తోంది.

''నీ వరస బాగుందే ... ఎక్కడ వూరేగుతున్నాడో. అతని గురించి నువ్వు అన్నం మానెయ్యడమేమిటి? ఇద్దరు పిల్లల తండ్రి. బాధ్యత లేకుండా గాలికి తిరుగుతున్నాడంటే అర్థం ఏమిటి?" సీతమ్మ చిరచిరలాడిపోయింది.

"ఆయన్నే మనకు."

"నీకున్న అభిమానంలో వెయ్యోవంతు వుందిటే! గాలికి తిరక్కపోతే ఆ పరీక్షలకి కట్టరాదూ ? ఆడదానివి నువ్వే ప్యాసయ్యావు."

"నీకెందుకే?" భర్తని తల్లి విమర్శించడం ఆమెకు నచ్చలేదు.

"నీ దగ్గర చేతులు నలుపుకుంటూ పని చెయ్యడం నాకూ నచ్చలేదే! అలాంటి వాడికి నలుగురిలో గౌరవంఏముంటుంది?"

తల్లిని విసుగ్గా చూసి "ఇక్కడికే



ధస్తున్నాను. నా సంసారాన్ని వీధి ఎక్కి-స్తావేమిటే ? అసలే ఆయన తిక్కగా తయారయ్యారు. నీ మాటలు ఏవైనా వింటే ఇక నా ముఖం కూడా చూడరు" మందలించింది.

"చూడకపోతే నష్టమా ? నెలకి పద్దె నిమిది వందలు సంపాదించుకుంటున్నావు. వాడి అవసరం ఏముంది?"

"డబ్బుటే ప్రధానం ? సంసారం విచ్ఛిన్నమయ్యాక డబ్బేం చేస్తుందే ? నాకు ఆఫీసరుహోదాలో బ్రతకడం కంటె, సారథి భార్యగా బ్రతకడమే ఇష్టం?" ఉద్వేగంగా చెప్పిందామె.

"నువ్వో వెర్రికుట్టివి. అందుకే బాగా ఆడిస్తున్నాడు."

మరో రెండు రోజులు గడిచాయి. సామ్రాజ్యం మరింత దిగజారిపోయింది. ఆఫీసుకి సెలవు పడేసింది?

సారథి ఏ అఘాయిత్యం చెయ్యలేదు కదా ! తనని శాశ్వతంగా వదలిపోలేదు కదా...అదే జరిగితే తనకి బ్రతుకే ముంది? భవితవ్యం ఏముంది?

సామ్రాజ్యం ఏడుస్తూ కూర్చుంది.

"ఎందుకే అమ్మా...ఏడుస్తున్నావు" రాణి అడిగింది.

"ఏం లేదమ్మా" అది చూసిందని తమాయించుకుంది.

సురేష్ వచ్చాడు. "అమ్మా ! జవాను కేకేస్తున్నాడు."

సామ్రాజ్యం వీధి గుమ్మంలోకి వెళ్లింది.

"అయ్యగారు కనిపించారమ్మా.



రమ్మని చెప్పాను నేను. నాకు వచ్చే అవసరం లేదన్నారు. పోస్టాఫీసు దగ్గర కిళ్ళీబడ్డీదగ్గరున్నారు. ఎవరో రావాలిట.."

సామ్రాజ్యం రిక్షాలో వెళ్ళింది. అక్కడ సారథి వున్నాడు. సామ్రాజ్యాన్ని చూసి ముఖం తిప్పుకున్నాడు. కిళ్ళీ దుకాణం రష్‌గా వుంది. జనమున్నారు.

"ఇలా వస్తారా?" దీపం చాటునుంచి పిలిచింది.

"నన్ను రోడ్డుమీద కూడ వెధవని చెయ్యాలని చూస్తున్నావా ?" అంటూ వచ్చాడు.

"నన్ను క్షమించండి. పిల్లలు బెంగ పెట్టుకున్నారు."

సారథికి వెళ్ళాలనే వుంది. శ్రీపతి ఫ్యామిలీ వచ్చేసింది. హేమ మద్రాసు వెళ్ళింది. సారథి ఇంటికి వెళ్ళడం ఇష్టంలేక హోటల్లో వున్నాడిన్ని రోజులు. పైసలు అయిపోయాయి. అప్పయిచ్చే వాడు దొరకలేదు.

"మీరేశిక్ష విధించినా సరే...రండి... ఇంటికి వెళదాం" సామ్రాజ్యం ప్రాధేయంగా చేతులు పట్టుకుంది.

"నడు...పిల్లలు బెంగ పెట్టుకున్నారన్నావు" రిక్షా ఎక్కాడు.

సామ్రాజ్యం దానికే పొంగి పోయింది. 'వారి మీద అభిమానమున్నా చాలు! తన బ్రతుకు పండినట్లే.'

ఇంటికి రాగానే బయట గదిలో విచారంగా కూర్చున్నాడు. సిగరెట్లకి కూడా డబ్బులు లేవు. నాలిక పీకేస్తోంది. సామ్రాజ్యాన్ని ఎలా అడగడం ?

సమయం ఏడు గంటల రాత్రి.

"టీ తాగుతారా ?"

"అల్మారాలో సిగరెట్టు పెట్టె వుందేమో చూడు" అన్నాడు హుందాగా. సామ్రాజ్యం సరకులతోనే అతడి సిగరెట్లు కూడా తెప్పిస్తుంది.

"లేవు." జవాన్ను పంపి రెండు తెప్పించింది. రెండు గంటల తర్వాత సిగరెట్ కాల్చడం హాయిగా ఉంది.

"ఎక్కడికి వెళ్ళి పోయావు నాయనా? అది బెంగపడి ఏడుస్తోంది. నువ్వురాలేదని ఇంత అన్నం కూడా తినడం లేదు" సీతమ్మ నిష్ఠూరంగా అల్లుణ్ని పలకరించింది.

"మీ అమ్మాయి ముఖం కనిపించ కూడదని."

"ఏమంత అపరాధం చేసింది ?"

"అమ్మా లోపలికిరా " సామ్రాజ్యం విసుగ్గా పిలిచింది. ఈ మాటలు తిరిగి సమరానికి దారి తీస్తాయేమోనని భయం.

సీతమ్మ సణుక్కుంటూవెళ్ళిపోయింది.

"నువ్వు అనలేక మీ అమ్మచేత అనిపిస్తున్నావా ?" అంతకు ముందు తాగిన మంచి నీళ్ళ గ్లాసు కోపంగా విసిరేశాడు.

సామ్రాజ్యం పక్కకి తప్పుకుంది. లేకపోతే తలకి తగులును.

"బి కేర్. తల ఎత్తారా తన్నులు తింటారు."

సామ్రాజ్యం పట్టించుకోకుండా, "రండి స్నానానికి నీళ్ళు పెట్టాను" అంది టవల్ ఇస్తూ.

సామ్రాజ్యం అతడికి ఇష్టమని బంగాళా దుంపల కూర్మా చేసింది. అల్లం పెరుగు పచ్చడి, సాంబారు తయారు చేసింది.

సారథి సుష్టుగా తిని సిగరెట్ కాలుస్తూ పడుకున్నాడు. పిల్లలు దగ్గరకి వచ్చినా మాట్లాడలేదు. డ్రాయరుమీద నవలవుంటే అందుకున్నాడు.

సామ్రాజ్యం పలకరించినా మాట్లాడలేదు. విసిగి పడుకున్నది.

* * *

ఉదయం ఢిల్లీ నుంచి తెలుగు వార్తలు వస్తున్నాయి.

"కాఫీ తీసుకోండి" సామ్రాజ్యం తెచ్చింది.

"కింద పెట్టు" ఎటో చూస్తూ చెప్పాడు.

"నా ముఖం చూడరా ఏమిటి ?"

"అంత పదే పదే చూసే ముఖం కాదు."

 

పదిహేను రోజులనుంచి ఇదే తంతు. సారథి ఇంటి పట్టున వుంటున్నా ఆమెతో మాట్లాడటం లేదు. ఆమె కలిపించుకుని మాట్లాడితే అపహాస్యాలూ, వెటకారాలూ! అయినా సహిస్తోంది. అలా సహించి కాపురాన్ని నిలబెట్టుకుందామన్న ఆశతో రాజీపడి జీవించే లక్షలాది ఇల్లాండ్లలో ఆమె ఒకతె.

సారథి రెండు గుక్కలు తాగి గ్లాసు క్రింద పడేశాడు. "ఏడుస్తూ పెడతావా కాఫీ... ఛీ..."

"బాగా లేదా, మళ్ళీ కలిపి తీసుకు వస్తాను" ఖిన్నురాలై నడిచింది,

భర్త శత్రువు కింద చూస్తున్నాడు. ఈ రంపపు కోత ఆమె భరించలేక పోతున్నది. గతమే ఎంతో ఉత్తమంగా కనిపిస్తోంది.

ఆ రోజు ఆదివారం కనుక తీరుబడిగా పేపరు చూస్తూ కూర్చున్నాడు. ఇంతలో రామలోకం ఇద్దరు స్నేహితులతో వచ్చాడు.

"రండి. రండి" సాదరంగా ఆహ్వానించాడు.

సురేష్‌ని పిలిచి కాఫీలు చెప్పాడు.

"హేమ రాలేదా?" సారథి అడిగాడు.

"హైదరాబాదులో వుంది. నాలుగు రోజుల్లో వచ్చేస్తుంది."

"నా కిక్కడ బోర్ కొడుతోంది."

"హేమ కూడా అక్కడ మీ గురించే అంటూంటుంది."

తన మీద హేమకి ప్రేమ వున్నందుకు పొంగి పోయాడు.

రామలోకం, మిత్రులను సారథి భోజనానికి ఆపివేశాడు. భోజనాలయ్యాక పేకాట వేశారు!

"ఏమిటమ్మా ఇంట్లోనే పెడుతున్నాడు దుకాణం!" సీతమ్మ విసుక్కుంది.

"గట్టిగా అనకు" సామ్రాజ్యం తగవుకి సిద్ధంగా లేదు.

పేకాట సాగుతోంది. రామలోకం ఇక్కడ ఆడుతున్నాడని తెల్సి మరో ఇద్దరు వచ్చారు. గోలగా ఫుల్‌బోర్డు ఆడుతున్నారు.

ఇలాంటి సమయంలో - ప్రత్యేకంగా మాట్లాడడానికి క్యాంపు మీద వున్న సూపర్నెంటు వస్తున్నాడని జవాను కబురు తీసుకువచ్చాడు సామ్రాజ్యానికి.

"మీ నాన్నగార్ని రమ్మను" సురేష్‌ని పిలిచి చెప్పింది.

సురేష్ కేక వేశాడు. సారథి మొదటి సారి విసుక్కున్నాడు. రెండోసారి కొట్టి పంపించాడు. వాడు ఏడుస్తూ వచ్చేశాడు.

ఇంటికి వస్తానన్న సూపర్నెంటుని ఆఫీసుకు తీసుకుపోవడం, ఏం భావ్యంగా వుంటుంది?

సామ్రాజ్యం ఆలోచించే లోపలే సూపర్నెంటు జీపు వచ్చేసింది. ఆయన లోపలికి రావాలంటే డ్రాయింగు రూంలో పేకాట వాళ్ళని దాటుకుంటూ రావాలి!

అలాగే వచ్చాడు. సామ్రాజ్యం సిగ్గుపడింది. ఫీలయింది. "ఆ మూక ఎవరు?" సూపర్నెంటు అడిగాడు.

"ఇంటి వాళ్ళ తాలూకు" అబద్ధం చెప్పింది.

ఆయన ఆఫీసు విషయాలు ముచ్చటించి "మీ వారు లేరా?" అనడిగాడు.

సామ్రాజ్యం మరో అబద్ధమాడింది. "ఊరికెళ్ళారు."

సూపర్నెంటు వెళ్ళి పోయాడు.

"బుద్ధులు కూడ తగ్గట్టే వుంటాయి. ఇంటికి పెద్ద మనిషి వచ్చాడన్న జ్ఞానమయినా లేదు. ఛఛ...అదేం బ్రతుకో"

సీతమ్మ సాధించి పోసింది.

పేకాట వాళ్లు వెళ్ళాక సారథి బద్ధకంగా పడుకున్నాడు. నిద్ర పట్టేసింది. రాత్రి ఎనిమిది గంటలకి కాని మెలకువ రాలేదు. పేకాటలో వంద వచ్చింది. బార్ కి నడిచాడు. విస్కీ రుచి చూసి పన్నెండు గంటలకి ఇంటికి వచ్చాడు.

మామూలుగానే తెల్లవారింది. సారథి షేవ్ చేసుకుంటున్నాడు కాఫీ తాగి. సురేష్ వచ్చాడు "నాన్నగారూ! మీరు కనిపించడం లేదేం? ఎక్కడికెళుతున్నారు అసమానూ ?"

"మీ అమ్మ అడగమందా ?"

వాడికి అర్థం కాలేదు. పక్క గదిలో ఆఫీసు కాగితాలు చూసుకుంటున్న సామ్రాజ్యం వారి సంభాషణ వింటోంది.

"నేను కూడా బ్లేడుపెట్టి గడ్డం గీసుకోనా ?"

"తప్పు వెధవా ?"

"సాయంత్రం నన్ను, చెల్లాయిని షికారుకి తీసుకెళ్ళరూ."

"చూద్దాంలే ! నాకు ఖాళీ దొరకద్దూ"

"సాయంత్రం ఆఫీసు వుండదుగా.

"మా ఆఫీసరు వుండమంటే వుండాలి"

"ఉండనంటే?"

"ఉద్యోగం ఊడగొడతారు. అధికారంతో కళ్లు పొరలెక్కాయి."

"మీ ఆఫీసరు మంచివాడు కాదు నాన్నగారూ..."

"అందరూ అదే అంటున్నారు"

"మీరంతా కల్సి గెంటేయండి"

''గుడ్ బోయ్'' కొడుకుని ప్రశంసించాడు.

సురేష్ మళ్ళీ మొదటికి వచ్చాడు "సాయంత్రం షికారుకి వెళదాం నాన్నగారూ!"

"ఒరేయ్ నువ్వు నాతో తిరగకూడదు. అంతా గుమస్తాగాడి కొడుకంటారు. మీ అమ్మతో తిరిగితే ఆఫీసరుగారి అబ్బాయి వయిపోతావు. మీ అమ్మతో షికారు కెళ్లు."

"ఛీ... ఆడాళ్ళతో వెళతారేంటి షికారుకి."

"నువ్వు నాతో తిరిగావనుకో... గుమస్తా అలవాట్లు వస్తాయి."

సామ్రాజ్యం ఇక ఆగలేక బయటికి వచ్చింది "మిమ్మల్ని ఏనాడయినా చిన్న చూపు చూశానా? ఆ పసి వెధవ మనసు విరిచేసారెందుకు?"

''నీతో మాట్లాడవల్సిందేం లేదు."

"మీకు ఏది మంచనిపిస్తే అదిచేయండి" భారంగా కదిలింది.

పది రోజులు గడిచాయి. సంసారం అపశృతులలో అలాగే వుంది. ఎడముఖం పెడ ముఖం.

సారథికి పేకాటలో డల్ హాండ పడుతోంది. డబ్బులు పోతున్నాయి. హేమ ఇంటికి వెళ్ళకుండా వుండలేడు. వెళితే డబ్బులు లేవని చెప్పగలడా?

సామ్రాజ్యాన్ని అడగబుద్ధి కావడం లేదు.

''రూపా! ఓ వంద ఇవ్వండి వుంటే" అప్పు అడిగాడు.

రూప యిచ్చింది.

"మీ ఆయనకి అప్పు చేసే అవసరం ఏం వచ్చిందే?" అనడిగింది తర్వాత.

"ఇచ్చినదానివి అడగలేక పోయావా? జీవం లేకుండా నవ్వింది.

రూపని అడగటం బాధగానే వుంది. తనని అడగవచ్చుకదా ! అడగడానికి నామోషీ అయితే సురేష్ ద్వారా తీసు

 

కోవచ్చుగా !

"ఏం చేశావోయ్ నేను చెప్పిన విషయం!" శ్రీపతి అడిగాడు.

సారథికి గొంతుకకి ఏదో అడ్డం పడి నట్లయింది. తను ఆ సంగతి చెప్పలేదు ఆమెతో మాట్లాడటం ఇష్టంలేక. మానేద్దా మంటే మూడు రోజులు 'మందు ఖర్చు' పెట్టుకున్న శ్రీపతిని నిరాశపరచటం ఎలా?

శ్రీపతి ఇంక్రిమెట్లు ఆగిపోయాయి!

సామ్రాజ్యానికి సిఫార్సు.

శ్రీపతి కోసమయినా సామ్రాజ్యంతో మాట్లాడాలి.

"ఇవాళ చెబుతాను"

శ్రీపతి మరో క్వార్టర్ ప్రజంటు చేశాడు విస్కీ. సారథి ఆఫీసునుంచి సాయంత్రం నేరుగా ఇంటికి వచ్చేశాడు.

సామ్రాజ్యం టీ తాగుతోంది. భర్త సాయంత్రం పెందరాళే రావడం సంతోషంగా ఉంది.

"పాలున్నాయా...ఆయన వచ్చారు" తల్లిని అడిగింది.

''రాదని తోడు పెట్టేశాను. ఈ మధ్య రావడం లేదుగా."

సామ్రాజ్యం తాను తాగబోయే టీ పట్టుకెళ్ళి అతడికి యిచ్చివేసింది. సారథి కొడుకుని, కూతుర్ని కూర్చోబెట్టుకుని కబుర్లు చెబుతున్నాడు.

తను అక్కడ కూర్చుంది.

"ఏ సినిమాకయినా వెళదామా?'' తనే అడిగింది.

''ముసురుగా వుంది. ఎందుకులే?"

విసుగు, కోపం లేకుండా సౌమ్యంగా భర్త సంభాషించడం తొలకరిలా వుంది ఆమెకి.

''అన్నంలోకి ఏం చెయ్యమంటారు?"

''పచ్చిమిరపకాయ బజ్జీలు వేయించు"

"షికారు కెళదాం నాన్నగారూ' సురేష్ పాట!

"పిచ్చి వెధవా! వాన వస్తుంటే ఎలా గరా? రేపు తీసుకెళతానులే"

సామ్రాజ్యం కసురుకుని వెళ్ళిపోయింది.

సారథికి 'మందు' సంగతి గుర్తుకు వచ్చింది. పిల్లలని పంపేసి నెమ్మదిగా పేపరు చూస్తూ సీసా ఖాళీ చేశాడు.

సామ్రాజ్యం భోజనానికి పిలిచింది.

ఆమెకి వాసన తెలియకుండా భోజన మయ్యాక మిఠాయి కిళ్ళీ నమిలాడు.

విస్కీ మత్తుతో శరీరం తేలిపోతోంది.

''జరగండి...'' పిల్లలు నిద్ర పోయాక సామ్రాజ్యం వచ్చింది.

విస్కీ మత్తుకి, ఆమె శరీరం మరింత వేడెక్కించింది. నడుం చుట్టూ చేతులు పోనిచ్చి ముఖంమీద ముద్దుపెట్టుకున్నాడు.

''కోపం పోయిందా?" సామ్రాజ్యం అడిగింది.

''నీ మీద కోపమా? ఛ''

''దొంగమాటలు. ఎంత ఏడిపించారు?"

''అయితే నవ్విస్తాను" కితకితలు పెట్టాడు.

సామ్రాజ్యం నవ్వుతో వుక్కిరిబిక్కిరయింది.

శ్రీపతి ఇంక్రిమెంట్సు గురించి చెప్పాడు సమయం చూసి.

* * *

సారథి ఆ రోజు ఇంటికి వచ్చేసరికి రాత్రి తొమ్మిది గంటలయింది. అలసటగా ఈజీఛైర్‌లో కూర్చున్నాడు.

సామ్రాజ్యం శుభలేఖ ఇచ్చి "శివ సూరిగారు ఇప్పటిదాకా కూర్చున్నారు మీ కోసం'' అంది.



''అమ్మాయి పెళ్ళా!''

"రేపే"

"ఉదయం ఆరున్నరకా! మనం అయిదింటికే లేవాలి. అంత ప్రొద్దుటే లేవలేను డియర్! నువ్వు పోయిరా!"

"భలేవారే...మీరు రేకుండా నేను ఎందుకు?"

సారథి అంగీకరించక తప్పలేదు. అతడు లేచేసరికే ఆమె తయారుగా వుంది. కనకాంబరం రంగు వెల్వెట్ శారీమీద చుట్టూ ఎర్ర బోర్డర్ ప్రస్ఫుటంగా కనిపిస్తోంది. రెడ్ మాచింగ్‌తో తయారైన ఆమెనుచూసి ''తూర్పు సూర్యుడు మన ఇంట్లోకి దిగి రాలేదు కదా!'' అన్నాడు ఆమెని లాక్కుని.

"మీరు తొందరగా తెమలాలి. మీ పుత్రరత్నం లేస్తే ప్రయాణమవుతాడు.''

శివసూరి బిజినెస్ మాగ్నెట్. అంచేత పెళ్ళికి రాజకీయవాదులు, వ్యాపారవేత్తలు, ఆఫీసర్లు, ఇంకా ప్రముఖ వ్యక్తులు చాలా మందే వచ్చారు. అంతమందిలో తాను అల్పజీవిగా కనిపించాడు సారథి. తనతో మాట్లాడేవారేరి? శివసూరితో తనకి ముఖ పరిచయం తప్పించి పరిచయంలేదు. తన పనులకు సంబంధించిన ఆఫీసరని సామ్రాజ్యాన్ని పిలిచి వుంటాడు.

పెళ్ళి జరుగుతోంది. ఎవరి ప్రపంచంలో వారున్నారు. సారథి సిగరెట్లు కాలుస్తూ ఓ పక్కన కూర్చున్నాడు. సామ్రాజ్యం ఎవరితోనో మాట్లాడుతూ అటే వచ్చింది.

సారథిని చూసి దగ్గర కొచ్చింది. ''ఈయన గగనమహర్షి. జయాకాస్మొటిక్స్ఏరియా మానేజర్' పరిచయం చేసింది.

గగనమహర్షి నవ్వుతూ కరచాలనం చేసి "యు ఆర్ దిస్ ఏంజెల్స్ షేర్ హోల్డర్...డామ్ లక్కీ..వాటార్ యు!'' అడిగాడు.

సారథి సందేహించాడు.

"సమ్రాజ్యం...వుడ్ యు లైక్ టు టెల్ మి ది బిజినెస్ ఆఫ్ యువర్ పార్టనర్...ప్లీజ్ !'' గగనమహర్షి ఆమె కేసి తిరిగాడు.

సందేహంగానే చెప్పింది.

"ఓ...లీడింగ్ క్లరికల్ లైఫ్... వెరీ పూర్!...హి డిడింట్ ఫిట్ ఫర్ యు''గగనమహర్షి తమాషాగా నవ్వాడు.

సారథికి ఆ నవ్వు రంపపు కోతలా వుంది.

గగనమహర్షి మళ్ళా సారథిని పల్కరించలేదు. సామ్రాజ్యంతోనే నవ్వుతూ ఆంగ్లంలో మాట్లాడసాగేడు.

పెళ్ళయ్యేదాకా సారథి బలవంతంగా ఆగి తర్వాత "నడు పోదాం'' అన్నాడు ముక్తసరిగా. శివసూరి అతిథుల దగ్గర కొచ్చి లంచ్ తీసుకుంటేగాని వెళ్ళవద్దని కోరుతున్నాడు. ''ఇప్పుడు వెళితే బాగుండదంటీ '' అంది సామ్రాజ్యం.

''వస్తావా? రావా?'' సారథి గట్టిగా అరిచాడు.

''ప్లీజ్!'' ప్రాధేయంగా అడిగింది.

"నీకు మొగుడు మాట లెక్కలేదు. సరే, అలాగేకానియ్! నేను పోతున్నాను. ఇంటికి రా!నీ భరతం పడతాను" సారథి పెద్దగా కేకలు వేశాడు. నలుగురూ వారికేసి చూస్తున్నారు. అంతమందిలో ఆమెను శాసించడం అతనికి కన్నుల పండుగలా వుంది. సామ్రాజ్యానికి తల కూరుకుపోసాగింది.

వుండలేక అతడితో వచ్చి రిక్షా ఎక్కింది.





''వచ్చేశావేం? పతిభక్తా?...అర్థమైన వెధవలతోను నవ్వుతూ మాట్లాడగలవు. నా దగ్గరకి వచ్చేసరికి ఏడుపు.డర్టీ ఫెలో''

సారథి సాధించి పోస్తున్నాడు.



పెళ్లికి వెళ్లిన అల్లుడు,కూతురు భోజనాలు చేసి వస్తారని సీతమ్మ తను తిని, పిల్లలకి పెట్టేసింది. ఆమె వంటిల్లు కడుగుతూండగ్గా సామ్రాజ్యం రావడంచూసి ''అప్పుడే వచ్చేశారేమే?భోజనాలకి వుండమనలేదా?" అడిగింది.

"ఆయన వెళ్ళిపోదామన్నారు."

"బాగుంది.. మళ్ళా వండాలి" విసుగ్గా అంది.

''ఎలాగూ సెలవు పెట్టాను కదా ! నేను వండుతాలే...''సామ్రాజ్యం బట్టలు మార్చుకుని వచ్చి గ్యాస్‌స్టవ్ వెలిగించింది.

"భోజనాలవేళ రావడం తప్పుకాదూ? ఆయన ఏమనుకుంటాడు? హోదాలకి తగ్గట్టే వుంటాయి మన బుద్ధులు'' సీతమ్మ ఈసడించింది.

హాల్లోని సారథికి మాటలు వినిపించాయి. మండుతున్న అగ్నిగోళంలా వచ్చాడు వారి దగ్గరికి. అత్తగారి చివరి వాక్యం తనమీద విసురేనని తెల్సు. అది ఎండిన ఆకుల్లో నిప్పులా పనిచేసింది. ఓర్పు కరిగిపోయింది.

''నేను గొప్పవాణ్నని చెప్పడంలేదు, మీరు గొప్పవారైనందుకు ఒళ్లు దగ్గర పెట్టుకోమంటున్నాను. నీ కూతురు ఆఫీసరని పొంగిపో. తప్పులేదు. నేను గుమస్తాగాణ్నని పెళ్లికి ముందు తెలియదా? నీ భర్తవచ్చి మా చేతులు ఎందుకు పట్టుకున్నాడు. నడిమంత్రపుసిరిలో అవన్నీ గుర్తు లేదా?"

సీతమ్మ ఆ ఆవేశానికి మ్రాన్పడిపోయింది.

"ఇన్నాళ్ళు మీ వెటకారాలు వింటూనే వున్నాను. మీ పెద్దతనం ఇక మన్నించను. నేను గుమాస్తానే. అవమానంగా వుందా? నీ కూతురుకి విడాకులు ఇప్పించి ఏ ఆఫీసర్నో చూసి పెళ్లిచెయ్యి. నీకూ గొప్పగానే వుంటుంది."

"ఏమిటండీ ఆ మాటలు?" సామ్రాజ్యం చలించిపోయింది.

"రాస్కెల్ ! నీ తల్లి వాగితే ఏ తప్పు లేదు. నేను నోరు విప్పితే నీకు బాధ వస్తోందా?" సారథి ఆమె చెంపలు ఛళ్ మనిపించాడు.

"బాగుంది. దాన్ని చంపేస్తావా?" సీతమ్మ అరచింది.

సారథి తన గదిలోకి వెళుతూ "సాయంత్రంలోగా నీ తల్లి ఇక్కడ్నుంచి బయలుదేరాలి. నీకు సంబంధించిన వారెవరు ఈ గుమ్మం ఇక తొక్కడానికి వీల్లేదు. తొక్కినా వూర్కోను. దిక్కులేనందుకు తిని పడి వుండక, అన్నిటా జోక్యం చేసుకోవడం" శాసించాడు.

రోహిణీ ఎండలా వుంది అతడి హృదయం. మంచంమీద అశాంతిగా దొర్లుతున్నాడు. వంటకాగానే సామ్రాజ్యం పిలిచింది.

"నీ తల్లి వెళ్ళేదాకా, ఏమీ తినేది



లేదు!"

"ఉన్నపళంగా ఎక్కడికి వెళుతుందండీ?"

"లేకపోతే కూడా నువ్వుకూడా చావు. తల్లి కావాలో, మొగుడు కావాలో వెంటనే తేల్చుకో !"

"నేను చెప్పేది కూడా వినండి."

"నువ్వెవరు చెప్పడానికి? నేను చెప్పేదే నువ్వు వినడం. తేడా వచ్చిందా ఎముకలు విరిచేస్తాను" ఆవేశంలో అతడికేం తెలియడంలేదు.

"ముందర భోజనానికి రండి."

"ఒకసారి చెప్పానా" కాలితో తన్నాడు. సామ్రాజ్యం తలుపు పట్టుకుంది కాని లేకపోతే పడిపోను.

రాణి ఇది చూసి ఏడ్వసాగింది.

"ఆ పెళ్ళికి నన్నెందుకు పిలుచుకుని పోయావ్? నలుగురిలో నన్ను వెధవని చెయ్యడానికా ? ఆ సన్యాసికి నన్ను పరిచయం చెయ్యడం ఎందుకు? నా గురించి చెప్పడం ఎందుకు ? నీలో ఆఫీసరన్న



అహం పేరుకుపోయింది. ఈ వెధవని నేను కసుక చేసుకుని భరిస్తున్నానని నలుగురికీ చెప్పడం?"

"నేను మీ గురించి అవమానంగా చెప్పలేదే? చిన్న వుద్యోగాలు చేసే వాళ్లు మనుషులుకారా ?''

"కాదనే చెబుతోంది కదా నీతల్లి. అది వెంటనే నా గుమ్మం దిగాలి!''

సీతమ్మ బట్టలు సర్దుకుంది. అతడంత చెప్పాక ఆమెకి అక్కడ వుండబుద్ధికాలేదు.

''సిగ్గులేని రకాన్ని ... చెప్పేదాకా కదల్లేదు. ఇక నీకొంపకి రానులే నాయనా! వసానే అమ్మాయ్!" సీతమ్మ బయటనుంచే కేకేసింది.

సామ్రాజ్యం నిస్త్రాణగా గుమ్మానికి జేర్లబడి శూన్యంగా చూస్తోంది.

''ఈ ఇంటికి వచ్చేటప్పటికి సర్వీ చెట్టులా వుండేది. మర్రిచెట్టులా తయారైంది పదునుగా తిని. కొవ్వుపట్టి ఏం వాగుతుందో తెలియలేదు. ఆవిడ పాట్లు ఇక్కడ్నుంచి వున్నాయి! అలగా సంబంధమని మా నాన్న చెబుతూనే వున్నాడు. నా కళ్లు మూసుకుపోయాయి కాని...."

సామ్రాజ్యం అతడేమన్నా మాట్లాడ లేదు. వాగి వాగి లేచి బట్టలువేసుకున్నాడు.

''భోజనంచేసి వెళ్ళండి" సామ్రాజ్యం కోరింది.

''పొద్దున్నుంచి తినిపిస్తున్నావుగా... చాలు. కడుపునిండింది" సారథి నడిచాడు.

సరదాగా వెళ్ళిన పెళ్ళి సమస్య తెచ్చి పెట్టింది. నాలుగు రోజులైనా ఆ మంచు తెర కరిగి పోలేదు. ఇనుప తెరయింది. కాపురంలో మందహాసం నశించి మంటలు లేచాయి. తిరిగి శిశిరం ఏర్పడింది.

సారథి తోచినపుడు వస్తున్నాడు. ఉన్నా మాటామంతీ లేదు. ఎక్కువ భాగం హేమ ఇంటి దగ్గరే. డబ్బు లేక పేకాట చూస్తూ కూర్చున్నాడు.

రామలోకం అప్పుడే వచ్చాడు. "మీరు ఖాళీగా కూర్చోడమేమిటి ? ఛ...ఇదేం బాగాలేదు."

"రామలోకంగారూ ! ఆయన దగర డబ్బు లేదట. మీరు ఇవ్వండి వుంటే" హేమ చెప్పింది.

"విత్ ప్లజర్!" రామలోకం వెయ్యి ఇచ్చాడు. "సారథిగారూ! మీరు ఎప్పుడు కావల్సి వచ్చినా ముఖ మాటం లేకుండా అడగండి. తెల్సిందా?"

సారథి ఆ మంచితనానికి ముగ్ధు డయ్యాడు.

హేమ ఇల్లు స్వర్గం ! హేమతోటే లోకం.

ఓ రోజున హేమ మంచం మీద అతడి గుండెల మీద పడుకుని "సారథి గారూ! రామలోకంగారికి పన్నెండు వేలు ఇవ్వాలిటకదా ! చెప్పమన్నారు. రేపు ఆయన మద్రాసు వెళతాడట" చెప్పింది.

"మూడు వేలే ఇస్త."

"పన్నెండని చెప్పాడు. ఇదిగో మీరు సంతకం చేసిన నోటు" పరుపు కింద నుంచి ప్రామిసరీ నోటు తీసి చూపింది.

"మోసం, దగా!"

"పెద్ద మనిషిని అలా అవమానించ కండి నా ముందు. మీరు తొందరలో అతడి బాకీ తీర్చేయండి" మంచం దిగి వెళ్ళిపోయింది.

ఎక్కడొస్తాయి పన్నెండు వేలు? తను తీసుకున్నది మూడువేలు. ఈ మోసంలో హేమకి కూడా భాగముందా ?

డబ్బు లేదని హేమ ఇంటి వైపు చూడటం మానుకున్నాడు. వారం పోయాక రామలోకం, హేమ ఇంటికి వచ్చేశారు. సారథి కంగారు పడ్డాడు.

"ఎన్నాళ్ళు దాక్కుంటావయ్యా" దురుసుగా అడిగాడు రామలోకం.

అమర్యాద ప్రవర్తనకి విస్తుపోయి "నేనే వద్దామనుకుంటున్నాను" అన్నాడు.

"ఎందుకు? మాతో 'మందు' బేవార్సుగా తాగిపోడానికా?"

"బాకీ తీర్చేస్తారా?" హేమ అడిగింది.

"నాకు కొంచెం వ్యవధి కావాలి."

"నీ జన్మ వ్యవధి ఇచ్చినా బాకీ తీర్చ లేవు. హేమ చెబితే మనవాడేనని ఇచ్చాను. పైగా మూడు వేలేనని చెబుతావు! ఇన్నాళ్ల పేకాట, తాగుడికి ఎంత తగలేశావో నేను చెప్పనా?" కోపించాడు రామలోకం.

సామ్రాజ్యం అక్కడికి వచ్చింది.

హేమ టూకీగా "నీ భర్త పన్నెండు వేలు బాకీ ! తీరుస్తాడా ? మాకు చేత నయింది చేసుకోమా?" కరకుగా చెప్పింది.

"ఏం చేశారండీ అంత డబ్బు?" ఆందోళనగా అడిగింది.

"పేకముక్కలు! మందు! ముండలు..

 

ఇదీ నీ మొగుడు డబ్బు తగలేసిన విధం. ఏమయ్యా మాట్లాడవేం? పుచ్చుకునే టప్పుడు నీ బ్రతుకెంతో తెల్సుకోవద్దూ? చెట్టునుదులిపి పట్టుకోవడమనుకున్నావా?"

సారథి నోరూ విప్పలేదు. తలా ఎత్త లేదు.

"మాయ మాటలు చెప్పి నా కొంప చుట్టూ తిరిగాడు ఇన్నాళ్ళూ.అంతా బండా రమే అన్నమాట! ఎందుకొచ్చిన గొప్ప లయ్యా" హేమ అసహ్యంగా నవ్వింది.

సామ్రాజ్యం భరించలేక పోయింది. "దయచేసి మీరు వెళ్ళిపోయి రేపు మధ్యాహ్నం రండి. మీ బాకీ తీరుస్తాము" అంది చేతులు జోడించి.

"అదీ చూస్తాము" అని వెళ్ళిపోయారు.

సామ్రాజ్యం నెలనెలా వంద రూపా యలు సేవింగ్ ఖాతాలో వేస్తుంది. అది తొమ్మిది వేలుంది. మూడువేలు ఒకచోట చేబదులుగా పుచ్చుకుని, హేమ, రామ లోకం రాగానే మర్నాడు బాకీ తీర్చి వేసింది.

"నీ బాకీ నీ పెళ్ళాం తీర్చాలా?" నవ్వుతూ వెళ్ళిపోయారు ఆనందంగా మూడువేలు ఇచ్చి పన్నెండు వేలుమోసం చేసి ఘరానాగావసూలు చేసుకున్నందుకు.

సారథి బాకీ తీర్చినందుకు పెళ్ళాన్ని అభినందించలేదు. "నేను వెధవనని వాళ్ళ ముందు చక్కగా రుజువు చేశావు! నేను అసమర్థుడ్ని! నువ్వు సమర్థురాలివని వాళ్ళు అనుకోవాలి. అవునా?"

"మనలో ఎవరు తీరుస్తే ఏముందండి? ఇప్పటికయినా జాగ్రత్తగా వుండండి. వాళ్లు నమ్మతగ్గ వ్యక్తులుగా లేరు."

"ఆ నీతిబోధలే మానమంటున్నాను" జుటపుచ్చుకుని లాగి, ఆమెని గోడకి అదిమి పెట్టాడు ఆవేశంగా. "ఆ వెధవలు వీడి పెళ్ళాం బాకీ తీర్చిందని టౌన్ అంతా యాగీ చేసేస్తారు! నలుగురిలో నేను తల ఎత్తుకోవాలా? వద్దా?"

"క్షమించండి."

"జాగ్రత్తగా వుండు. తల ఎత్తావా తన్నులు తినగలవు. ఇక నిన్ను మామూలుగా వదలిపెట్టను" అంటూ తోసేశాడు.

ఆరోజు ఆదివారం. పైగా రాణి పుట్టిన రోజు. తలంటు పోసింది సురేష్‌కి, రాణికి. కొత్తబట్టలు వేసింది. సారథికి చూపించ డానికి అతడి గదికి తీసుకు వెళ్లింది. ఎనిమిదిన్నర దాటుతున్నా సారథి లేవలేదు.

''డాడీని లేపనా?'' సురేష్ వుత్సాహం చూపించాడు.

"వద్దు కోప్పడతారు. చెల్లి, నువ్వు బయటకిపోయి ఆడుకోండి. డాడీ లేచాక చూపిద్దురుకాని!''

సారథి మరో గంటకి లేచి వరండాలో కూర్చున్నాడు బద్ధకంగా. ఏదో చందా కోసం వీరాస్వామి, గురుమూర్తి, రెడ్డి వచ్చారు.

"సురేష్! అమ్మని కాఫీలు పంపమను" కేకేశాడు లోపలకి.

సురేష్ చెప్పేసరికి సామ్రాజ్యం తలంటు పోసుకుంటోంది. హడావిడిగా తమిలి కాఫీలు తయారుచేసి ట్రేలో పెట్టి తెచ్చింది.

"ఎంతసేపయింది చెప్పి? నిద్ర పోతున్నావా?" గర్జించాడు.

ముగ్గురూ ఆఫీసర్‌ని చూసి విష్‌చేస్తూ వినయంగా నిలబడ్డారు.

"ఇది కాఫీయా? కడుగా'' బలంగా కప్పు ఆమె మీదికి విసిరేశాడు. కప్పు బద్దలయింది "నడవండయ్యా! హోటల్‌కి పోయి తాగుదాం...ఏ పనికీ ఆశలేదీ

మనిషితో. బుట్ట బొమ్మలా తిరగడానికి తప్ప ఎందుకూ పనికిరాదు.''

మీకు ఆఫీసరయినా నాకు పెళ్ళాం సుమా అని వారి ముందు రుజువు చెయ్యడానికే ఈ తాపత్రయం! హడావిడి! అధికారం.

సామ్రాజ్యం నల్లబడిన ముఖంతో లోపలకి వెళ్ళిపోయింది. రేపు ఆఫీసులో సబార్డినేట్లముందు ముఖం ఎత్తుకోవడం ఎలా?

ఏమిటీ దేశం ఆడదాని దౌర్భాగ్యం? మంచంమీద, వంటింటిలోను తప్ప ఆమె వునికికి విలువలేదా? ఆమె మరే రంగంలో నైనా రాణించడానికి మగవాడు ఎందుకు సహకరించడు? సంస్కృతి లోపమా? సమాజం ఎదగకపోవడం కారణమా?

సామ్రాజ్యానికి చేతిమీద కన్నీరు చిలికింది.

సారథి వీధిలోకిపోయి వెంటనే తిరిగి వచ్చి స్నానం చేశాడు. అతడు బట్టలు వేసుకుంటూండగా సామ్రాజ్యం కాఫీ ఇస్తూ "ఇవాళ రాణీ పుట్టినరోజు.సరదాగా ఎటయినా వెళదాం. ఎక్కడికీ వెళ్ళకండి'' చెప్పింది.

''నా పెత్తనం ఏముంది? వాళ్ళకి ఏదయిన చెయ్యడానికి నువ్వున్నావుగా?''

సామ్రాజ్యం తగ్గి వెళ్ళిపోయింది... ''డాడీ!'' అంటూ రాణి దగ్గరికెళ్ళింది ఎర్రటి పట్టు పరికిణీ, జాకెట్టులో రాణి ముద్దు ముద్దుగా వుంది. సారథిలోని తండ్రి ప్రేమ నిద్రలేచింది. ఎతుకుని ముద్దు పెట్టుకున్నాడు. ''ఎంత బాగున్నావురా?''




రాణి చాక్‌లెట్ తండ్రికి నోట్లో పెట్టింది.

''ఎవరు కొన్నారమ్మా యివి?''

రాణి 'అమ్మ' అంటుందని భావించాడు. కాని ఆమె సమాధానం విని నిర్ఘాంతపోయాడు. ''మీరే తెచ్చారని అమ్మ చెప్పింది.''

'సామ్రాజ్యం తెలివైనది' అనుకున్నాడు.

"డాడీ! నావి బాగాలేవా?'' సురేష్ కూడా దగ్గరకి వచ్చాడు.

"బజారుకి వెళదాంరండి'' పిల్లల్ని తీసుకుని నడిచాడు.

ఇది చూసి సామ్రాజ్యం కాస్త కుదుట పడింది. ఆయనకి పిల్లలమీదయినా ప్రేమ వుంది. అదే శ్రీరామరక్ష తనకి.

రోడుమీదకి రాగానే రిక్షా పిలిచాడు.

"మీరు నా జత వుంటారా? అమ్మ జత వుంటారా?"

పిల్లలకి అర్థం కాలేదు.

"నా జత వుంచే అన్నీ కొని పెడతాను."

"మీ జతే!'' ఇద్దరూ ఒకేసారి అరిచారు.

సారథి సంతోషించి "మీ అమ్మ మంచిదికాదు" అన్నాడు.

''మరి మీరు ఇంటిదగ్గర వుండరు కదా! అమ్మ మాట్లాడకపోతే అన్నం ఎవరు పెడతారు?'' సురేష్ అడిగాడు.

'వీడికి తల్లి తెలివితేటలు వచ్చాయి' అనుకున్నాడు.

''పనులు చేయించుకోవచ్చు, కాని ఇంకేం మాట్లాడకూడదు" పిల్లలకి బోధ పడేలా చెప్పాడు.

బిస్కట్లు, స్వీట్లు, బొమ్మలు, బట్టలు కొని ఇంటికి తీసుకువచ్చాడు. పిల్లలు కొన్నవన్నీ చూపించబోయారు ఆమెకి.

"ముందర అన్నాలకి రండి. తీరికగా చూస్తాను."

సారథి నిశ్శబ్దంగా ఫోంచేసి వెళ్ళి పడుకున్నాడు. సామ్రాజ్యం తాంబూలం నములుతూ హాల్లో కూర్చుంది.

"ఇదిగో అమ్మా" అంటూ సురేష్ ప్యాకెట్లు తెచ్చాడు.

"చాలా కొన్నారే!" సామ్రాజ్యం పరిశీలనగా చూడసాగింది.

"అమ్మా ! డాడీ నీతో మాట్లాడవద్దన్నారు" సురేష్ చెప్పాడు.

సామ్రాజ్యం చిన్నబోయి "ఎందుకన్నారు?" అంది.

"నాకేం తెల్సు. రాణీ ! అనలేదూ ?"

రాణి అన్నని బలపరిచింది.

"సరదాగా అనివుంటారు" అంది.

పిల్లల మనసుల్ని కూడా విరిచేయాలని చూస్తున్నాడా ? ఛ ... తమ భేదాభిప్రాయాలు వారికి అంటగట్టడం ఎందుకు ?

"అమ్మా ! నేను నీ జతే" రాణి తల్లి మెడలో చేతులు వేస్తూ అంది.

చెల్లెలు పార్టీ ఫిరాయించేసరికి అన్న కూడా ఫిరాయించాడు.

"నేనూ నీ జతే..డాడీతో మాట్లాడం."

"తప్పమ్మా! అలా అనకూడదు. డాడీ మీకు అన్నీ కొనిపెట్టలేదూ ?"

భర్తలా మూర్ఖంగా ప్రవర్తించలేదామె !

* * *

ఆఫీసు యిన్స్పెక్షను జరుగుతోంది. ఏదో కాగితం కోసం సారథిని పిలిచింది ఆఫీసు రూంలోకి. సూపర్నెంటు, అతని స్క్వాడ్ అక్కడే వున్నారు.

"నీకు మొన్న యిచ్చేశానుగా సామ్రాజ్యం" అలవాటుగా అనేశాడు సారథి.

అది విని సూపర్నెంటు మండిపడ్డాడు. "ఇడియట్ సుపీరియర్ని పేరు పెట్టి పిలుస్తావా? రివర్షన్ కావాలా?"

సారథి శిలయిపోయాడు.

సామ్రాజ్యం తన భర్తేనని చెప్పింది.

"వండర్ ... స్త్రీలుముందుకుపోతున్నారన్నందుకు చక్కటి నిదర్శనం. మిస్టర్ సారథీ......మీరు గిల్టీగా ఫీలవలేదూ ఎప్పుడూ"

సారథి వెర్రిగా నవ్వాడు.

"భర్త గుమస్తా, భార్య ఆఫీసరు. వెరీ పిక్యూలియర్. ఎక్కడా చూడలేదు నేను ఇంత దాకా !" సూపర్నెంటు నవ్వుతున్నాడు.

సారథికి సెగలు పొగలు వస్తోంది.

ఆ రోజుతో తనిఖీ పూర్తయింది. సామ్రాజ్యం పెందరాళే ఇంటికివచ్చేసింది. అప్పటికే సారథి సోఫాలో దీర్ఘంగా ఆలోచిస్తూ కనిపించాడు.

సామ్రాజ్యానికి అతణ్ని పల్కరించే ధైర్యం లేకపోయింది. సామ్రాజ్యం మౌనంగా లోపలికి వెళ్ళిపోవడంతో తాటాకు మంటలా ఆవేశం చెలరేగింది. దీనికి ఆఫీసరన్న అహం పోవడం లేదు.

భార్య ఆఫీసరు కావడం, తను ఆమె కింద పనిచేయడం, ఎదురవుతున్న అవమానాలు సారథిని చిత్రవధ చేస్తున్నాయి. పురుషాహంకారం నిద్రపోనీయడం లేదు. ప్రతీ దశలోను సవాల్ చేస్తోంది.

రెండు పద్ధతులు కనిపిస్తున్నాయి.

తనకి ట్రాన్స్ఫర్ లేదా ఆమె వుద్యోగం మానేయడం ?

ఏది సబబు ?

"పెళ్ళిగ్రాం సార్" మెసెంజర్ వచ్చాడు. సారథి డోర్ దగ్గరకెళ్ళి

సంతకం పెట్టి తీసుకున్నాడు. టెలిగ్రాం చదవగానే అతడి ముఖం నల్లబడింది.

"ఎక్కడ్నుంచండీ ?" ఆమె అడిగింది.

"నీకు సంబంధించినది కాదు."

సారథి సూట్‌కేస్‌లో బట్టలు సర్దుకుని బయటకి వచ్చాడు. ఏదైన చెప్తాడని ఎదురు చూసింది. అతడు మాట్లాడకుండా వెళ్ళిపోతూండటం చూసి "రేపు వస్తారా?" అనడిగింది ఎదరకెళ్ళి.

సారథి మాట్లాడలేదు. పోతున్న రిషాని పిలిచి ఎక్కాడు.

బస్‌స్టాండులో సూపర్ ఎక్స్‌ప్రెస్ సిద్ధంగా వుంది. సారథి తన గ్రామంలో బస్సు దిగేసరికి తెల్లవారబోతోంది.

దయానందం బ్రతుకు కూడా తెల్లవారబోతోంది. ఇల్లంతా కోలాహలంగా వుంది. సారథిని చూసి దమయంతి ఏడుపు పెంచింది.

దయానందం సంధిలో వున్నాడు.

సారథి వచ్చిన అరగంటలోనే దయానందం పోయాడు. దమయంతి తమ్ముడు శరభయ్య అంతగా నిలిచి అన్నీ నడిపించాడు.

"కోడలు ఏదిరా?" సాయంత్రం తల్లి అడిగింది.

తమ విభేదాలు ఎలాంటివైనా, ఈ సమయంలో స్వామాజ్యం భార్యగా, ఇక్కడ ఉండాలి.

మర్నాడు తీసుకు రమ్మని శరభయ్యని పంపాడు.

మధ్యాహ్నం రెండున్నరకి స్వామాజ్యం పిల్లలతో టాక్సీలో వచ్చింది. దమయంతిని ఎలా ఓదార్చాలో ఆమెకి తెలియలేదు.

కొద్దిసేపయ్యాక "మీ అబ్బాయి ఏరి ?" అనడిగింది.

"మేడమీద వున్నాడు."

సారథి ఈజీఛైర్‌లో కూర్చుని ఏదో పుస్తకం చదువుకుంటున్నాడు. తండ్రి పోయిన దుఃఖం అతడికేం లేదు. భార్యని చూసి దృష్టి తిప్పుకున్నాడు.

"టెలిగ్రాం యిక్కడ్నుంచేనా వస్తే!' ఆమె అడిగింది.

తలూపాడు !

"మీతో వస్తే చివరిసారిగా ఆయన్ని చూసేదాన్ని"

"అఘోరించలేకపోయావు"

"నిన్న రాలేదని అత్తయ్య బాధపడుతున్నారు. టెలిగ్రాం మాట చెబితేనేం?"

సారథి తల తిప్పి భార్య ముఖంలోకి సూటిగా చూశాడు. స్వామాజ్యంలో 'ఆఫీసరు' కనిపించింది. అతడి ముఖం రౌద్రంగా మారిపోయింది "ఇక్కడ నువ్వు నా భార్యవి. ఆఫీసరువి కాదు. ప్రశ్నించడం నీకు మంచిది కాదు. వెళ్ళు."

కోడలు వచ్చి నాలుగూ చూసుకోవడం దమయంతికి తృప్తిగా వుంది. "అమ్మా శరభయ్య నా తమ్ముడయినా దుబారా మనిషి. సారథికి లౌకిక విషయాలేం తెలియవు. అన్నీ నువ్వే చూసుకోవాలి"

"అలాగే అత్తయ్యా !"

దయానందం దేహాంతర కర్మలు ముగిసినై.

"ఏం చేశావురా ఆ సంగతి" దమయంతి కొడుకు నడిగింది.

సారథి ఆలోచనగా చూశాడు.

"నువ్వు ఎక్కడో వుంటావు. ఆడదాన్ని ఇక్కడ నాలుగూ చూడగలనా ? రైతులు నా మాట వింటారా ? చివరికి హళ్ళికి హళ్ళి అవుతుంది."

"అలాగేనమ్మా ఇక్కడే వుంటాను.




ఉద్యోగం మానివేసాను"

దమయంతి ఆనందించింది. "ఉద్యోగం చేసే ఖర్మ నీకేంరా ? పాడీ పంటా గల సంసారం. ఇవి చూసుకుంటే చాలు."

కొడుకు, కోడలు తిరిగి వుద్యోగానికి వెళ్ళిపోతారేమో, తను ఒంటరిగా ఇక్కడ వుండాలేమోనని భయపడుతూ వచ్చింది. పోనీ తనూ వెళదామంటే కామాటం పెద్దది. కొడుకు తన మాట మన్నించడంతో ఆమె భయం ఎగిరిపోయింది.

సారథికి కూడా మనస్సు ప్రశాంతంగా వుంది. తను ఇక గుమాస్తా కాదు. సామ్రాజ్యం కింద పని చేయక్కర్లేదు. అల్ప జీవి కాదు. భూస్వామి.

బానిసత్వం వదిలిపోయిందనుకున్నాడు.

వారితో పాటు సామ్రాజ్యం కూడా సంతోషపడసాగింది. తనకీ, ఆయనకీ వుద్యోగం మీదే భేదాభిప్రాయాలు వచ్చాయి. దీనితో తన సమస్య తీరాలి.

"ఓ నెల సెలవు పెట్టు! ఇటుకేసి ట్రాన్స్ఫర్ చేయిస్తాను"

సారథి కొత్త జీవితం ప్రారంభించాడు. డాబాని బాగుచేయించాడు. ఎదరగా పూలతోట వేయించాడు. సోఫాలు, తివాసీలు మొదలైన ఖరీదైన ఫర్నిచర్‌తో కళకళలాడిపోసాగింది. దయానందం హయాంలో చీకటి కొట్టులా వున్న ఇల్లు, చంద్రవంకలా వుంది నేడు !

లయన్స్ క్లబ్బు మెంబరయ్యాడు సారథి. ట్రాక్టర్లు, రెండు లారీలు కొన్నాడు. సినిమా హాలులో వాటా కొన్నాడు. వూర్లోని రైస్‌మిల్‌ని లీజ్‌కి తీసుకున్నాడు. వడ్డీ వ్యాపారాన్ని ఎక్కువ చేశాడు. డబ్బుతో నాలుగు వైపుల చొచ్చుకుని పోయాడు. జీవితంలో సందడి హెచ్చింది.

వ్యవసాయం చూడడానికి శరభయ్యని వుండి పొమ్మన్నాడు. శరభయ్యకి యాభై వుంటాయి. ఆస్తిని గుర్రాలమీద పడేసి పోగొట్టుకున్నాక తిండి గడపడం కష్టమైంది. భార్య పోయింది. శకుంతల ఒక్కతె కూతురు. పెళ్ళికి ఎదిగివుంది. ఇన్నాళ్ళు భార్య అప్పడాలు అమ్మి, ఆవకాయ అమ్మి సంసారాన్ని లాక్కొచ్చింది. శరభయ్య ఏం చేద్దామని ఆలోచిస్తుండగా 'దయానందం పోవడం' కల్సివచ్చింది.

కూతురుతో వచ్చేశాడు.

భర్తలోని ఎదుగుదల సామ్రాజ్యం గమనించింది. కొత్త మార్పులు ఎన్ని వచ్చినా తమ మధ్య ఎడారి మాసిపోలేదు. భర్త కనిపించడం కూడా అరుదుగానే వుంటోంది. పిల్లలు డాడీ కావాలమ్మా అని ఏడుస్తున్నారు.

మధ్యాహ్నం రెండు గంటలకి సారథి భోజనానికి వచ్చాడు. హాల్లో భార్య వున్నా "అమ్మా ! అన్నం పెట్టు... అర్జంటు" అని కేక వేశాడు బట్టలు మార్చుకుంటూ.

దమయంతి నిద్రపోతోంది. సామ్రాజ్యం వడ్డించింది.

"పిల్లలు మీ కోసం బెంగ పెట్టుకున్నారు !"

"నువ్వూ పెట్టుకున్నావా... ఇడియట్ ఆడంగి కబుర్లు చెబుతూ కూర్చోనా?"

"నేను వుద్యోగం మానేస్తున్నాను"

"అంత అవసరమేమి వచ్చింది?" కరకుగా అడిగాడు. భార్య ద్వారా నెలకి రెండు వేలు పోగొట్టుకోవడం ఇష్టం లేదు. కూడిక చేసేగాని సంపద పోగుపడదు.

"ఉద్యోగం చెయ్యాల్సిందే... నీకు



రెండ్రోజుల్లో అర్థమ్మ వస్తాయి"

"సంపాదిస్తేగాని గడవని కుటుంబం కాదు కదా మనది! నేను ఎక్కడో వుంటే ఇక్కడ ఇల్లు ఎవరు చూస్తారు?"

"అమ్మ వుంది. శకుంతల వుంది. పని మనుషులున్నారు. నీ అవసరమేముంది ? నువ్వు లేకపోయినా ఇక్కడ తెల్లవారుతుంది" వ్యంగ్యంగా నవ్వాడు.

"మీరు పూర్తిగా మారిపోయారు. మీకు డబ్బు దయ్యం పట్టుకుంది"

"నిజం !" సారథి ఒప్పుకున్నాడు.

* * *

శకుంతలకి ఇరవై దాటి వుంటాయి.

పదో తరగతితో తప్పాక చదువుకి గుడ్‌బై చెప్పేసింది ఇంటి పరిస్థితులు బాగోక. చామన ఛాయగా వున్నా, ఆరోగ్యంతో కళకళలాడే సౌందర్యం



వుందామెలో. నిడుపాటి మెత్తటి కురులతో ఏపుగా ఎదిగిన వరి చేనులా వుంటుంది. ఎవర్నీ నొప్పించకుండా కాలక్షేపం చెయ్యగలదు.

సామ్రాజ్యానికి ఆమె మీద అభిమానం కలిగింది.

అలంకరణ కోసం సామ్రాజ్యం దగ్గరున్న కాస్మెటిక్స్ చూసి ఆశ్చర్యపోయింది. "ఇవన్నీ ఎందుకు అక్కా ?"

"అందానికి !"

"ఈ ట్యూబు నేను రాసుకోనా ?"

"రాసుకో, నన్ను అడగడమెందుకు ?"

సామ్రాజ్యం ఏవి ఎలా వాడాలో చెప్పింది. తన దగ్గరున్న కొత్త చీరలు నాలుగు ఇచ్చింది. అలంకరణ శకుంతల అందాన్ని పదును పెట్టింది.

శరభయ్యనీ పదును పెట్టింది. అతడు ఇక్కడ కేవలం సారథికి సాయ పడడానికి లేదు. తన స్వార్థం కోసం వున్నాడు. మొదట్నుంచీ డబ్బు కోసం కలవరపడిన మనిషేమో, సారథి దగ్గర డబ్బు చూసి ఆగిపోయాడు. ఇక్కడ తన కార్యక్రమం ఏమిటో నిర్ధారణ చేసుకున్నాడు. దయా సందం వుండగా గుమ్మం ఎక్కడానికే భయంగా వుండేది.

సారథికి, సామ్రాజ్యానికి పొత్తులేదని శరభయ్యకి తెలిసిపోయింది.

వాళ్ళని విడగొట్టి, శకుంతలని ఇంటి

కోడలు చేస్తే ?...

తన పని నిశ్చింత !

శకుంతల ఎర్ర ఆవుకి పాలు పితుకుతోంది. శరభయ్య పొలాన్నుంచి వస్తూ, పెరట్లో ఎవరూ లేరని "బావ పనులు చూస్తూండు. ఈ పనులుకేంగాని !" చెప్పాడు.

"నాకు బావంటే భయం బాబూ !"

"పిచ్చి ముఖమా ! లాభం వచ్చే పనులు చేసుకోవాలే. ఈ గాడిద చాకిరీ ఎన్నాళ్లు చేసినా 'ముద్ద' గడుస్తుంది కాని, ముందుకు పోలేం"

శకుంతల బద్ధకం లేకుండా ఉదయం నుంచి, సాయంత్రం దాకా అన్ని పనులు చేస్తోంది. ఎవరేం చెప్పినా విసుక్కోదు. తల్లిపోయినప్పటి నుంచి ఒ ం ట రి గా వుండేమో, ఇక్కడ నలుగురి మధ్య వుండటం సరదాగా వుంది.

సురేష్, రాణి ఆమె దగ్గర మాలిమి అయ్యారు. 'పిన్ని' అంటూ ఏ పనికైన వారు ఆమె దగ్గరకే వస్తారు. వారికి భూతాల కథలు, రాక్షసుల కథలు చెబుతూంటుంది. దీనివల్ల వారికి శకుంతలంటే మరింత ఆకర్షణ కల్గింది.

సామ్రాజ్యం ట్రాన్స్ఫర్ కాలేదు. సారథి హైదరాబాదు వెళ్ళే ప్రయత్నంలో వున్నాడని శ ర భ య్య గమనించి. కూతురుకి కీ ఇచ్చాడు.

"బావతో నువ్వు కూడా హైదరాబాద్ వెళ్ళు"

"ఎందుకు నాన్నా ?"

"అన్నీ చెప్పి చావలే. ఆ మాత్రం వూహించలేవు-బావని తిప్పుకున్నావా మని పని రొట్టె విరిగి నేతిలో పడుతుంది."

"బావతో ఒంటరిగా వెళ్ళటానికి నాకు భయం బాబూ !"

"దేశాలు తిరిగిన ముండా కొడుకుని. నా కంటె నీకు తెల్సా ? నేను పథకం వేసి వుంచాను. నేను చెప్పింది చేసుకు పోవడమే ? అవకాశాలు అన్నీ వేళలా రావు ?" అన్నాడు శరభయ్య కోపంగా.

సామ్రాజ్యం రావడంతో శకుంతల వెళ్ళింది ఆమెతో.

సాయంత్రం శకుంతలకి ఉత్తరం వచ్చింది టపాలో. పోస్టుమాన్ వచ్చేసరికి అరుగులు తుడుస్తోంది. ఆ ఉత్తరం చూడగానే సంతోషపడింది.

ప్రకాశం బుధవారం హైదరాబాద్ వెళుతున్నాడట. రెండు రోజులు వుంటానని రాశాడు. నిన్ను చూసి ఎన్నో రోజులయింది. నువ్వు రాకపోతే నేనే చూడడానికి వస్తానని రాశాడు. చాటుగా, మాటుగా ఆ ఉత్తరాన్ని ఎన్నిసార్లు చదువుకుందో ఆమె !

"హైదరాబాదు వెళతాను నాన్నా !"

శరభయ్య సంతోషించాడు.

సారథి ప్రయాణ సన్నాహంలో వున్నాడు. సామ్రాజ్యం సూట్ కేస్ సర్దుతోంది. శరభయ్య పరుగులాంటి నడకతో వెళ్ళాడు.

"శకుంతలని కూడా తీసుకెళ్లు సారథీ-వస్తానంటోంది. నేను హైదరాబాదు నుంచి వచ్చాక మళ్ళీ వెళ్లలేదు. సామాను సర్దేసి వాటా ఖాళీ చేసి రమ్మన్నాను. నేను తర్వాత వెళ్ళి సామాను తీసుకు వస్తాను. పక్కనే చంద్రకాంతంగారని తెలుసున్న పీడరుగారున్నారు. వాళ్ళది లంకంత కొంప. వారింట్లో పెట్టమన్నాను. వృధాగా అద్దె పోవడం ఎందుకు ?"

"నువ్వువెళితే మంచిదికదా బాబాయ్!" సామ్రాజ్యం అంది. భర్తతో, వయసులో




వున్న శకుంతలని పంపడం ఆమెకిష్టంగా లేదు.

భార్య అనుమానాన్ని పసిగట్టాడు సారథి. "దానికేం మామయ్యా ! రమ్మను. శకుంతల పక్కనవుంటే ప్రయాణం బాగుంటుంది..."

భార్యని సాధించడమే అతడి లక్ష్యం.

సామ్రాజ్యం వుసూరుమన్నా తేరుకుంది "నేను కూడా వస్తానండీ ...ఈమధ్య ఎక్కడికీ కదలక బోర్‌గా వుంది "

"నిన్ను వేసుకుని హనీమూన్‌కి తిరగనా ? సిగ్గులేక పోతే సరి. ఇద్దరు పిల్లలు ఎదుగుతున్నా జ్ఞానం రాలేదేం? అమ్మ ఏమనుకుంటుంది ? బాధ్యత నేర్చుకో. ఇది పల్లెటూరు. ఎలా పడితే అలా తిరిగితే జనం తాటాకులు కడతారు. అయినా నీ వుద్దేశం వేరు. ఆ వెధవ జెలసీ అంటేనే నాకు ఒళ్ళుమంట !"

సామ్రాజ్యం జీవంలేని మందహాసం చేసింది. సారథి, శకుంతల వెళ్ళిపోయాక మంచంమీద పడుకుని వెక్కి వెక్కి ఏడ్చింది.

ఏమిటి తన లోపం ? సామ్రాజ్యం నిలువు టద్దంముందు నిలబడింది. తనలో అందం, ఆకర్షణ చచ్చిపోయాయా ?

ఇద్దరు పిల్లలకే ముసలిదయిపోయి భర్తని ఆకర్షించలేక పోతోందా ?

అద్దంలో ప్రతిబింబం చూసుకోగానే సామ్రాజ్యానికి ధైర్యం వచ్చింది. తన లోని అందం చెక్కు చెదరలేదు. మాతృత్వం మరింత ఆకర్షణీయం చేసింది. తప్పు భర్తది. అతడి మూర్ఖత్వానిది.

ఈ పరిస్థితిలో తనేం చేయాలి? సమాధాన పడాలా ? సంఘర్షణ పడాలా ?

* * *

ఎక్స్‌ప్రెస్ గంట లేటుగా నాంపల్లి చేరుకుంది. సారథి దిగుతూ "మనం సికింద్రాబాద్‌లో దిగిపోవాల్సింది. ఈ పాటికి బయటికి పోవడానికి ఆలస్యం కాకుండా వుండును" అన్నాడు.

శకుంతల ఎయిర్‌బాగ్ పుచ్చుకుని అతడ్ని అనుసరించింది.

హోటల్లో శకుంతల కాఫీ తాగి పేపరు చూస్తోంది.

సారథి స్నానం చేసి బట్టలు వేసుకున్నాడు.

"టిఫిన్ తేనా సార్ ?" సప్లయిర్ వచ్చాడు.

"శకూ ! నీకూ చెప్పనా ?"

"నువ్వు తిను. స్నానం చెయ్యాలిగా"

సారథి టిఫిన్ వచ్చేలోగా కాగితాలు సర్దుకున్నాడు. "నేను సెక్రటేరియట్‌కి పోయి వస్తాను. సాయంత్రం వెళదాం ఏ అద్దె యింటికి !"

శకుంతల తలూపింది.

సారథి వెళ్ళిపోయాడు. శకుంతల తలుపు వేసి బెడ్‌మీద వాలింది బద్ధకంగా. 'అద్దె యిల్లు' సంగతి అంతా అబద్ధమేనని తెల్సు. పనికివచ్చే సామాను తండ్రి ఎప్పుడో బయట అమ్మేశాడు. ఒక గోనెడు సీనారేకు వంట పాత్రలు పరంజ్యోతిగారి ఔట్‌హౌస్‌లో వున్నాయి బావ కూడావస్తే గుట్టు బయటపడుతుంది.

ముందర తను ప్రకాశాన్ని కల్సుకోవాలి. అబ్బ! అతడ్నిచూసి ఎన్ని రోజు లయిందో ! వారం రోజుల్లో వచ్చేద్దామని చెప్పి నాన్న శాశ్వతంగా అత్తయ్యగారి యింట్లోనే మకాం వేశాడు. ప్రకాశాని వివరాలేం తెలియవు.

శకుంతల స్నానానికి లేచింది.

ప్రకాశం పూర్వం శకుంతల వుంటున్న యింటి పక్కన వుండేవాడు. శకుంతల, ఆమె తల్లి సాగిస్తున్న జీవన పోరాటం అతడ్ని కదల్చి వేసింది. భారీగా సాయం చెయ్యడానికి అతడికి స్తోమతు లేదు. ఇద్దరు చెల్లెళ్ళు, ఇద్దరు తమ్ముళ్ళు వున్నారు అతడికి. అతడి రైల్వే వుద్యోగమే సంసారానికి ఆధారం. అయినా ప్రకాశం అవకాశం వున్న మేరకి శకుంతలకి సాయం చేసేవాడు.

శకుంతలకి యిది సిగ్గుగా వుండేది.

"నా దగ్గర అభిమాన పడతావెందుకు. రేపు మనం ..."

ఆలుమగలు కావడం యిద్దరికీ యిష్టమే. కాని పరిస్థితులే చక్క పడాలి. ఒక్క చెల్లి పెళ్ళయినా జరిపితే కాని గృహస్థు కావలచుకోలేదు అతడు.

శకుంతల తయారయ్యే సరికి పవ యింది. సారథి వస్తున్నాడేమోనని, పిట్ట గోడ దగ్గర్నుంచి కిందకి చూసింది! అరగంట వెయిటింగ్!

తాళం రిసెప్షన్‌లో యిచ్చి హోటల్ బయటకి వచ్చింది. ఆటోలు కనిపించ లేదు. సిటీ బస్ ఎక్కింది. 'మసాబ్ టాంక్'లో దిగి పక్క గల్లీలోకి తిరిగింది.

నీలంరంగు మేడ వెనక ఔట్‌హౌస్‌లో వుంటున్నారు ప్రకాశం కుటుంబం. అతడి తండ్రి పోయి నాలుగేళ్ళయింది.

ప్రకాశం షేవ్ చేసుకుంటున్నాడు నిలబడి.

"కూర్చునే ఓపిక లేదా?" గేటు తీస్తూనే పలకరించింది శకుంతల.

"హాయ్! దొంగా" సంబరంగా దగ్గరకి వచ్చి "నువ్వు వస్తావని తెల్సి అంతా కంగారుగానే వుంది" నవ్వాడు.

"పోదూ బడాయి" శకుంతల మూతి తిప్పింది.

"అలాగా!" ఆమె బుగ్గమీద చిటిక వేశాడు.

అతడి చిన్న తమ్ముడు శోభనాద్రి రావడం చూసింది శకుంతల. మార్కెట్‌కి వెళ్ళాడేమో సంచీలో కూరలున్నాయి.

"బాగుంది బయటే మేళం... సరు... అత్తయ్యేది?"

"నువ్వా...రా అమ్మా!" వెంకటదేవి పీట వాల్చింది.

ప్రకాశం హడావిడిగా స్నానం చేసి వారి దగ్గరకి వచ్చి కూర్చున్నాడు. వెంకటదేవి యిద్దరికీ కాఫీ ఇచ్చింది.

"అయితే మళ్ళీ ఇక్కడికి రారన్న మాట" వెంకటదేవి అడిగింది.

"మా నాన్న సంగతి నీకు తెల్సుకదా అత్తయ్యా"

"పోన్లే అమ్మా! ఎక్కడోక్కడ సుఖంగా వుంటే చాలు"

"అమ్మా...నువ్వు వంట తొందరగా కానీయ్...బయటికి పోతాం"

"అయిపోయిందిరా! సాంబారే ఆలస్యం"

వంట అయ్యేదాకా ప్రకాశం, శకుంతల ఎదర గదిలో కూర్చున్నారు. భోజనం కాగానే శకుంతలకూడా అతడితో బయలు దేరడం చూసి, "నువ్వు వెళ్ళిపోతున్నావా?" అనడిగింది.

"ఇప్పుడే వస్తాం!" అన్నాడు ప్రకాశం. ఇరుకైన గదుల్లో కూర్చుని శకుంతలతో మాట్లాడటం అతడికి ఇబ్బందిగా వుంది.

పాత హిందీ సినిమా మార్నింగ్ షో చూశారు. బాక్స్ ఖాళీగా వుండటంతో ఎవరూ వీరి మాటలకి అభ్యంతరం చెప్ప




లేదు.

"మాట్నీకి పోదామా ?" బయటికి రాగానే అడిగాడు.

"సినిమా పక్షిలా వున్నావు" నవ్వింది.

"పక్షికి పక్షి జత. నీపేరే శకుంతలం"

పబ్లిక్ గార్డెన్స్ వెళ్ళి జనం లేని చోట కూర్చున్నారు. ప్రకాశం ఆమె చెయ్యి లాక్కుని ముద్దు పెట్టుకున్నాడు.

"ఛీ...పోకిరీ! అప్పుడే వేషాలు వేస్తున్నావు"

"ఇంకా సమయం రాలేదంటావా ?"

"ముద్దుతో ప్రారంభించి..." తర్వాత చెప్పడానికి బోలెడంత సిగ్గుపడిపోయింది. మోకాళ్ళమీద పెట్టుకుంది తల.

"తర్వాత ఏం జరుగుతుంది?" ఆమె పాదాలపై ఒరిగి ముఖం ఎత్తాడు.

"నేను చెప్పను బాబూ! అస్సలు సిగ్గు లేదు నీకు."

"పోనీ నేను చెబుతాను. మనకి పెళ్ళవబోతోంది. విద్యకి సంబంధం కుదిరింది. ఆరు వేలు కట్నం !"

"మరి చెప్పావు కాదేం ?"

"లైన్ క్లియర్ అయిందని ఆత్రంగా వుందా ?"

"నీకెప్పుడూ అదే రంధి ?"

"'అదే' అంటే...?"

"నీ క్రాసింగ్ బాగుంది. నీతో ఏం మాట్లాడేది లేదు"

"పోనీ నేను మాట్లాడతాను"

ఆరింటిదాకా మాటలు పంచింపుకుంటూ కాలక్షేపం చేశారు. శకుంతల ఆలస్యమైపోతోందని లేచింది. బావ కంగారు పడతాడేమో!

"ఎవరితో వచ్చావు ?"

"అక్కయ్యతో" అబద్ధం ఆడింది రక్షణగా.

"ఫర్వాలేదు. నడు. ఇక్కడ్నుంచే పంపేస్తే అమ్మ అప్పడాలకర్రో, అట్లకాడో పుచ్చుకుంటుంది"

శకుంతల నవ్వి "అమ్మ అలాంటివాటితో కొట్టదు" అంది.

"అలాంటివి వుపయోగించేది పెళ్ళామేనా? ఓరి నాయనోయ్! రేపేం చేస్తావో యిప్పుడే చెప్పేశావు. కాపురం ఎలాగ చేయడం బాబోయ్ !"

నవ్వుతూ శకుంతల అతడి నోరు నొక్కింది. "రోడ్డన్న జ్ఞానంలేదా ?"

వచ్చేటప్పుడు ఆబిడ్స్‌లో శకుంతలకి చీర కొన్నాడు.

"ఇప్పుడెందుకు ప్రకాశం ?"

"ఇది బహుమతి కాదు. నీకు నేను గుర్తుంటానని"

భోంచేసినా వాళ్లు శకుంతలని వెళ్ళనివ్వలేదు. "రాత్రి ఎక్కడికి వెళతావు?" అంటూ ఆపేశారు.

అది కూడా శకుంతలకి నచ్చింది. రాత్రి పోయి హోటల్ గదిలో సారథితో వుండటం ఆమెకి యిష్టం లేదు. తిడితే తిడతాడు. ఉదయం వెళ్ళవచ్చు.

ఉదయం ఎనిమిదింటికి సెలవు తీసుకుంది. ప్రకాశం రోడ్డుమీదకి వచ్చి ఆటో ఎక్కించాడు.

ఆందోళనగా వచ్చింది హోటల్‌కి. గడ్డం గీసుకుంటున్నాడు. శకుంతలని చూసి మండి పడ్డాడు. "ఎక్కడికి పోయావ్? భయపడి ఛస్తున్నాను. ఆలస్యమైతే ఫోన్ చెయ్యొచ్చుగా.

"అద్దె ఇల్లు ఖాళీ చేసి వస్తున్నాను"

"తొందరగా సర్దెయ్. మన పని అయిపోయింది. ట్రాన్స్‌ఫర్ ఆర్డర్ తొందరగా అందజేయాలి సామ్రాజ్యానికి"

ప్రయాణమని తెలియగానే వూపిరి పీల్చుకుంది.

*　　*　　*

సారథి హైదరాబాద్ నుంచి ఇంటికి వచ్చేసరికి ఉదయం తొమ్మిది గంటలు అయింది. మిల్లు గుమస్తా వచ్చి రాత్రి ఎక్స్‌పోర్టు చేసిన బియ్యం లారీలను పట్టుకున్నారని చెప్పాడు. సారథి ఉలిక్కిపడి "స్నానం చేసి వస్తున్నాను" అన్నాడు.

సామ్రాజ్యానికి మధ్య భర్తంటే భయం పట్టుకుంది. ఆమె ఉనికిని అతడు బొత్తిగా సహించలేక పోతున్నాడు. ఏం చేసినా తప్పే! పొరపాటే! ఎలా వేగేది ?

అతడికి టూత్‌బ్రష్ అందిచ్చింది. బాత్‌రూంలో నీళ్ళు, సోపు వుంచింది. "షాంపూ ఏది ?" గావుకేక పెట్టాడు.

సామ్రాజ్యం వెతికింది. కాని షాంపూ అయిపోయింది. అది భయంగా చెబుతూ "కుంకుడు రసం పోయనా?" అనడిగింది.

"ప్రయాణం చేసి వచ్చాక తలంటుకుంటానని తెలియదా ? అయిపోయిన వస్తువు తెప్పించుకోక్కరలేదా? మీ అమ్మ సోమరితనం నీకూ వచ్చేసిందా...ఏదోటి తొందరగా ఏడు !"

సారథి ఏదైన అవకాశం వస్తే ఆమె వాళ్ళని తూర్పార పెడుతున్నాడు.

టిఫిన్ యిస్తూ "ట్రాన్స్‌ఫర్ ఏమైందండీ ?" అనడిగింది. అడక్కపోతే ఎందుకు అడగలేదని తిడతాడు.

"ఇప్పటికైనా అడిగావు, అమలాపురం వేయించాను. శుక్రవారం వెళ్ళి జాయిన్ కా. ఇల్లు కూడా పురమాయించాను".

"........."

"నీ ఆఫీసరు పోజు నా దగ్గర ఏడవక్కర్లా! మాట్లాడవేం?"

"ఏం మాట్లాడను ? మీరు చెప్పింది చేస్తూనే వున్నాను."

"ఉద్ధరిస్తున్నావు. ఉ తప్పుడు చిలకలా వుంటావ్. నన్ను చూసేసరికి ముఖం మాడిపోతుంది. నేను ఇలా పైకి రావడం నీకు మంటగా వుంది."

"మీ దాయాదినా ఏడవడానికి? అన్నీ మీరే అనుకుంటారు ?"

ఉప్మా తింటున్న చేతితోనే చెంపలు వాయించాడు "జాగ్రత్తగా మాట్లాడు. రోడ్డేపోయే వెధవతో మాట్లాడినట్లు మాట్లాడతావేం?"

"పెళ్ళాన్ని కొట్టడం వీరత్వం! శభాష్...అంటే బలమున్న వారిది పై చెయ్యి ! ఇన్నాళ్ళు రాక్షసత్వం లోపల దాక్కుని, డబ్బుతోబాటు బయటికి వచ్చి పెరుగుతోంది మాట ! నా భర్త నాగరికుడని అనుకున్నాను యిప్పటిదాకా ! అది తప్పు మాట"

"ఉపన్యాసాలు ఇస్తున్నావు...ఇంకా కావాలా?"

సురేష్, రాణి గుమ్మంలో నుంచి చూస్తున్నారు డైనింగ్ కేసి. దమయంతి పెరటి అరుగుమీద నుంచి ఈ గొడవ వింటోంది.

"మాటి మాటికి అలా చెయ్యి చేసుకోకండి. నేనూ మనిషినే. నాలోను ఏదో దశలో ఓర్పు నశించపోవచ్చు. ఆవేశంలో నేను కూడా ఒకటి కొడితే మీరు భరించలేరు."

సామ్రాజ్యం వెళ్ళిపోయింది.

"నీ పొగరు అణుస్తానే. తొందరపడకు!" సారథి జీపు ఎక్కాడు.

కొడుకు, కోడలు అన్యోన్యంగా వుండటం లేదని, నిత్యం ఏదో కీచులాటలు





జరుగుతాయని తెల్సుకుంటోంది దమయంతి. తప్పంతా కొడుకుదేనని ఆమె విశ్వాసం. ఆమె మందలిస్తున్నా సారథి పట్టించుకోడు.

ఆరోజు సామ్రాజ్యం శకుంతలతో మాట్లాడలేక పోయింది. ఎంత సంస్కార మున్నా అసూయ ఆగదుకదా! శకుంతల భర్తతో హైదరాబాద్ వెళ్ళి వచ్చింది. ఆడది కనపడితే చాలు, వెర్రి ఎత్తిపోయే రకం తన మొగుడు! శకుంతలని వదులు తాడా? అద్సరే...అతడికి బుద్ధి లేదు. శకుంతల ఎలా వెళ్ళింది? ఆమెకి జ్ఞానం లేదా?

"ఏం అక్కా ... ఏం మాట్లాడవు" శకుంతల సాయంత్రం వంట చేస్తూ అడిగింది.

సామ్రాజ్యం మధ్యాహ్నం పెట్టిన వడియాలు వలచి డబ్బాలో వేస్తోంది. "ఏం మాట్లాడాలి?" ముభావంగా అడిగింది.

"నీతో ఒకటి చెబుతాను. నీ లోనే వుంచుకోవాలి!"

శకుంతల దగ్గరకి వచ్చింది. భర్తతోటి రాసలీల చెప్పదుకదా సామ్రాజ్యం గుండెలు గుబగుబ మన్నాయి.

"ఏమిటి?"

ప్రకాశాన్ని కల్సుకున్న వైనం చెప్పింది శకుంతల.

"అమ్మ దొంగా...నువ్వా తెలివైన దానవే" సామ్రాజ్యం ఆనందంతో ఆమెని దగ్గరకి లాక్కుని ముద్దు పెట్టుకుంది. ఆమె ఆనందానికి ప్రధాన కారణం భర్తతో తను వూహించినట్లుశకుంతల ప్రవర్తించక పోవడమే! శకుంతలని అపార్థం చేసు కున్నందుకు విచారించింది.

"నిన్ను చూడగానే అనుకున్నాలే! శకుంతల ముఖం యింత ప్రకాశంగా వుందేమిటని?"

"ఫో...అక్కా"

రాత్రి తొమ్మిదిన్నరకి వచ్చాడు. మందు పుచ్చుకున్నాడు కనుక భోం చెయ్యలేదు. మంచంమీద దొర్లినా నిద్ర రాలేదు.

రాత్రి ఆకలి!

శకుంతల కోసం కిందకి వచ్చాడు. తల్లి పక్కన పడుకుంది ఆమె. కాలు గోకాడు. శకుంతల చూసి, భయపడి, మేనత్తని కౌగిలించుకుని పడుకుంది! తనకి భార్య కూడా వుందని సారథికి ఆ మత్తులో జ్ఞాపకం వచ్చింది.

ఇక్కడికి వచ్చినప్పటినుంచి సామ్రాజ్యం కింద పిల్లల దగ్గరే పడుకుంటూంది. అతడు అంతగా యిష్టపడనప్పుడు పోవడమెందుకని ఆమె పట్టుదల.

పసుపు పచ్చటి బెడ్ లైట్ వెలుగు తోంది. రాణి తల్లి గుండెల మీద చెయ్యి వేసి పడుకుంది. సారథి ఆమె కాలు గోకాడు. సామ్రాజ్యానికి మెలుకువ వచ్చింది.

ఎందుకో తెల్సింది.

"రాణికి జ్వరంగా వుంది. ఇప్పుడే పడుకుంది."

"రా! కొంపేం మునగదు."

"లేచి ఏడుస్తుంది."

"నా ఏడుపు నీకక్కరలేదు" గట్టిగా విసుక్కున్నాడు. సామ్రాజ్యం బెంగపడింది. ఎవరన్నా వింటే?... ఎంతో అసహ్యంగా వుంటుంది. ఇప్పుడు తనేమన్నా ఎక్కడు గొడవ తప్ప. రాణిని నెమ్మదిగా జరిపి దిగింది.

సారథి మేడ మీదకి వెళ్ళిపోయాడు.

రేగిన తల, నిద్రకళ్ళతో మందార రంగు చీరచూసి "ఛీ... పెంట ముఖమా! పెళ్ళవగానే దున్నపోతుల్లా తయారవుతావు. ఇలాంటి ముఖాలుంటే మగాడు ముండల కోసం ఎందుకు తిరగడు? కాస్త శుభ్రంగా తయరై ఏడు" విసుక్కున్నాడు.

ఆ రాత్రివేళ సామ్రాజ్యం సబ్బు అరగ దీసి, పౌడరు రాసుకుని, అత్తగారు పూజకోసం అట్టే పెట్టుకున్న మల్లెలు పెట్టుకుని, తెల్లటి ఇస్త్రీ చీరలో అతడి దగ్గర కెళ్ళింది.

"ఇప్పుడు ఎంత ముద్దు వస్తున్నావో తెల్సా" పెదాలు కొరుకుతూ అన్నాడు.

అవి వికారం మాటలని సామ్రాజ్యానికి తెల్సు.

రాణి లేచింది. కింద తల్లి కనపడక



ఏడుపు ప్రారంభించింది. ఆ పిల్లకి తల పోటు భరించడం కష్టంగా వుంది. 'ఏమ్మా' అంటూ శకుంతల వచ్చింది. 'అమ్మ' అంటూ ఏడుపు ఎక్కువ చేసింది. 'అక్కా' అని శకుంతల పిలిచింది. బాత్‌రూం కెళ్లిందా? రాణి ఏడుపు ఎక్కువ కావడంతో దమయంతి కూడా లేచింది. ఆమె వచ్చి బుజ్జగించినా వూరుకోలేదు. సామ్రాజ్యం మెట్లమీదనుంచి కేక పెట్టింది!

"వదలండి ... అది లేచిందేమో ... పిలుస్తున్నారు."

సారథి మోహావేశంలో వున్నాడు. ఆమెని వదల్లేదు "నోర్మూసుకో"

కింద కేకలు ఎక్కువయ్యాయి. "మళ్ళీ వస్తానండీ!" బ్రతిమాలుతూ అంది.

"ఛీ... వెధవ గోల. ఎలా పోతావో చూస్తాను. పో" ఆమె తెల్లచీర తల కింద పెట్టుకుని కర్కశంగా నవ్వాడు!

"ఛీ...పశువు" సామ్రాజ్యం స్టాండు మీద డోర్ కర్టెన్ చుట్టుకుని, బయట కొచ్చి గొళ్ళెం పెట్టి, శకుంతలని పిలిచి చీర తెప్పించుకుంది.

"పిల్ల అలా వున్నా..." దమయంతి కోడల్ని చూసి సాగదీసింది. సామ్రాజ్యానికి తల కొట్టేసినట్లయింది.

* * *

సామ్రాజ్యం అమలాపురంలో ఛార్జి తీసుకుంది. సారథి తన స్నేహితుడైన రామశాస్త్రి యింట్లో వాటా అద్దెకి తీసుకున్నాడు సామ్రాజ్యం కోసం. పిల్లల



కోసం సెలవు రోజుల్లో యింటికి వస్తూంది. శకుంతల దగ్గర పిల్లలకి సదుపాయంగా వుంది. దమయంతి ప్రేమగా చూసుకుంటోంది. ఇంటికి వచ్చినా సారథి కనిపించడంలేదు. ఒకవేళ వున్నా చిర్రు బుర్రు లాడటం తప్ప మాటా మంతా ?

సామ్రాజ్యంలో ఔదాసీన్యం రేగింది.

జీతాల రోజు. సామ్రాజ్యం ఆఫీసు నుంచి యింటికి వచ్చేసరికి సారథి వరండాలో రామశాస్త్రితో మాట్లాడు తున్నాడు. రామశాస్త్రి బ్యాంకి ఏజంటుగా రిటైరయ్యాడు ! తన ప్రయోజకత్వంలో నాలుగిళ్ళు కట్టాడు.

"ఎంతసేపయింది వచ్చి ?" తాళం తీస్తూ అడిగింది.

"ఇప్పుడే."

సామ్రాజ్యం కూల్‌డ్రింక్ యిచ్చింది.

"మర్యాదలకేంటే. జీతం వచ్చిందా? రాగానే నాకు యిచ్చి వేస్తూండాలి. ఆడ పెత్తనం పనికి రాదు నాకు. నీకు ఖర్చులు ఏమైనా వుంటే నన్ను అడిగి తీసుకోవాలి ? అయినా యింటి దగ్గర్నుంచి పప్పులు, బియ్యం, సమస్తం పంపిస్తు న్నారుయె ! ఇంకేముంది ఖర్చు ?"

సామ్రాజ్యం నోట్లు డ్రాయరు మీద పెట్టింది.

"మూడు వందలు తక్కువ వున్నాయేం ?"

"నాన్నకి పంపాను లేవడం లేదట."

"ఆ రకం స్వాతంత్ర్యం నీ కెవరు యిచ్చారు ? ఛీ... ఆడదాని సొమ్ముతో బతికే నీ తండ్రి ఒక మనిషే... ఛీ... వీడి బ్రతుకు చెడ !"

"ఆయనేం రాయలేదు. నేనే పంపాను" అభిమానంగా అంది.

"పంపించవ్ ! ప్రేమ ఒలికి పోతోంది. ఆఖరి సారిగా చెబుతున్నాను. నీ యిష్టం వచ్చినట్లు ప్రవర్తించడం సహించను నేను. జీతం రాగానే వున్నది వున్నట్లు అప్పగించాలి నాకు ! తండ్రికి, తల్లికి పైస కూడా పంపడానికి వీల్లేదు"

సారథి బిగ్గరగా అరుస్తున్నాడు. కిటికీలోనుంచి యింటి వారి కోడలు, పక్క వాటాలోని లెక్చరర్ పెళ్లాం... నవ్వుతూ చూడటం సామ్రాజ్యానికి బాధనిపించింది.

"ప్లీజ్ నెమ్మదిగా మాట్లాడండి."

"వెధవ రహస్యం బ్రతుకులు నాకు చేతకావు. నువ్వేం చేసినా మాట్లాడ కుండా కూర్చోవాలన్నమాట. నేను అంత చవటనా ?"

"నేను బాధ్యతగల వుద్యోగం చేస్తు న్నాను. నా గౌరవం కూడా చూడాలి మీరు"

అంతే ! సామ్రాజ్యం చెంపలు ఛళ్ మన్నాయి. నలుగురూ చూడటంతో మరో రెండు వేసి, "నిన్ను ఆ పొగరే మానమంటున్నాను. నువ్వు ఆఫీసరు వైనా నా భార్యవి. అది మరచిపోకు !"

"భార్యయితే పశువులా కొట్టుకుం టారా ? ఏమైంది మీ సంస్కారం ?"

"ఏం నోరు లేస్తోంది. మళ్లా వాయిం చేస్తాను. జాగ్రత్త."

సారథి తిడుతూ మరో అరగంట గడిపి బయటికి వచ్చి రామశాస్త్రితో "శాస్త్రిగారూ ! కొంచెం చూస్తూండండి" అన్నాడు.

రామశాస్త్రికి అర్థం కాలేదు

"వనితా... విత్తం... పుస్తకం... పద్యం మీకు తెలియనిదా ?"

రామశాస్త్రికి తెల్సింది. పొంగి

 

పోయాడు. ఇలాంటివి అతడికి చాలా యిష్టం. ఉత్సాహంగా "అనుమానమొసే కబురు పెట్టేయనూ మీకు? 'నస్త్రీ స్వాతంత్ర్యమర్హతి' అన్నాడు మనువు. జాగ్రత్త పడక పోతే ఆడది కొంప ముంచేస్తుందండి బాబూ" చెప్పాడు.

జరిగిన అవమానం ఒక ఎత్తు, చివరి మాటలు ఒకెత్తులాగ కనిపించాయి...ఛీ...ఏం మనుషులు? వివేకం లేని బ్రతుకులు!

జీవచ్ఛవంలా మంచంమీద పడి వుంది. అంతా శూన్యం.

సారథి వెళ్ళిపోయాక రామశాస్త్రి లోపలికి వచ్చాడు. "అమ్మాయ్ సంసారాన్ని రొస్టు చేసుకోవచ్చా? అతడు చెప్పినట్లు వింటే ఏం పోయె."

"ఇది మా సంసారం సంగతి... మీకనవసరం. మీరు జోక్యం చేసుకోవద్దు. నా భర్తకి సంస్కారం లేదు. నాకుంది. మీ నీతి పాఠాలు అనవసరం. వెళ్ళండి."

రామశాస్త్రి ఖిన్నుడై పోయాడు.

పనిమనిషి రావడంతో గిన్నెలువెయ్యడానికి లేచింది. బావి దగ్గర పొరుగువాటాల వారున్నారు. స్వామ్రాజ్యాన్ని చూసి కంఠం హెచ్చించారు.

"ఎంత ఆఫీసరయినా మొగుడి మొట్టికాయలు తప్పవు."

"ఏదో అనుకున్నాం... మన మొగుళ్ళే నయం... తిడతారు కాని కొట్టరు."

స్వామ్రాజ్యాన్ని పల్కరించడానికి సాహసించలేని వారు లోకువవల్ల ఎదురుగానే విమర్శిస్తున్నారు. వెటకరిస్తున్నారు.

రామశాస్త్రి స్వామ్రాజ్యాన్ని మొగుడు కొడతాడని ఊరూ వాడా చెప్పివచ్చాడు. ఆఫీసు ప్యూను మునెయ్య వస్తే "మీ అమ్మగారికి రోజూ బడితెపూజ వుండాలిరా? అలా కొడుతున్నాడు కనుకనే అలా లొంగుతోంది" చెప్పాడు రామశాస్త్రి.

మునెయ్య ఆఫీసులో ఊదేశాడు.

దసరా వచ్చింది. పిల్లలతో గడుపుదామని స్వామ్రాజ్యం ఇంటికి వెళ్ళింది. "అలా చిక్కిపోయావేం అమ్మా!" దమయంతి ఆప్యాయంగా పల్కరించింది.

పండుగనాడు సారథి పాలేరు దగ్గర్నుంచి తల్లిదాకా అందరికీ కొత్త బట్టలు కొన్నాడు–పెళ్ళాన్ని మినహాయించి.

"దానికేవిరా?" దమయంతి అడిగింది.

"ఆఫీసరుగారికి మనం కొంటే నచ్చుతాయా?"

"చాల్లే తెలివి"

బట్టలు తేనందుకు ఆమె బాధపడలేదు. ఆఫీసరని ఎద్దేవా చేసినందుకు మండిపోయింది. కుటుంబంలో మగవాడు ఆఫీసరయితేఅంతా బ్రహ్మరథం పడతారు. ఆడది చేస్తే అనుక్షణం అవమానాలు... వెటకారాలూ! ఇదెక్కడి న్యాయం?

"ఆఫీసరుద్యోగం గొప్పదని నేను పొంగి పోవటం లేదు. మీకు అవమానంగా వుంటే ఈ క్షణంలో మానేస్తాను" అంది నిష్ఠూరంగా.

"ఆ తల విసురేవద్దు. పండుగనాడు దెబ్బలు తినకు."

"మీరేమన్నా తప్పులేదు. నేను ఒక్క మాట చెబితే సహించలేరు. భార్యంటే బానిసా? మీసుఖాలకి సహకరించటం తప్ప ఆమెకి విలువలేదా?"

కోడలి మాటలు దమయంతికి నచ్చాయి. "ఏమిరా మీ నాన్నలాగే తయారవుతున్నావు. ఇల్లాలిని ఏడిపిం

చటం శుభం కాదురా! దాన్ని చూస్తున్నాను. ఒక్కవరసన శోభ పడుతోంది. సారథీ... ఇదేం బాగాలేదుస్మీ"

అందరూ వున్నారని తగ్గి వెళ్ళిపోయాడు కోపంగా.

నెల గడిచింది. ఓ సాయంత్రం సామ్రాజ్యం ఆఫీసునుంచి బయలు దేరుతూండగా సారథి వచ్చాడు. నెల తర్వాత భర్తని చూడటం వల్ల "ఇదేనా... రావడం? ఇంటికి వెళదాం రండి" అంది అభిమానంగా.

"పద" సారథి ఆమెతో జీపు ఎక్కాడు.

సారథి కోసం పకోడీలు వేసింది. 'బాగున్నాయి స్మీ' మెచ్చుకుంటూ తిన్నాడు. తన వ్యాపారాల్లో లాభాలు, సాధించిన విజయాలు చెప్పసాగేడు. ఆ స్నేహ వాతావరణం చూసి కలకాదుకదా అనిపించింది సామ్రాజ్యానికి.

రాత్రయింది "ఈ చీకట్లో వెళ్ళడ మెందుకు ?" అంది సామ్రాజ్యం.

"ఈ చలి రాత్రి నువ్వు పక్కన లేకుండానా ?" జోక్ చేశాడు.

భోజనాలయినాయి. ప్రత్యేకంగా అలంకరించుకున్న భార్యని కౌగిలిలో బంధించి "ఈ సామ్రాజ్యమంతా నాదేనా?" అన్నాడు మోహంగా.

ఈ క్షణం శాశ్వతమైతే బాగుండును అనిపించింది. కాదని ఉదయం తెల్విపోయింది. సారథి కాఫీ తాగుతూ "చెంగలరెడ్డి కాంట్రాక్టు బిల్ వుండిపోయిందట మీ ఆఫీసులో. ఇవాళ పాస్ చేసెయ్యి. మనకు కావలసిన వాడు" చెప్పాడు.



"వర్కంతా తప్పు. ఎలాగ పాస్ చెయ్యడం ?"

"అదంతా నీ కెందుకు ? నీ పని నువ్వు చెయ్యి పదివేలిస్తాడు మనకి." లంచాలు పట్టమని భర్తరికంతో శాసిస్తున్నాడు. సంసారికంగా వ్యక్తిత్వం చంపుకునే బ్రతుకుతోంది. సాంఘికంగా తానా పని చెయ్యలేదు.

"క్షమించండి... ఆ రిస్కు నేను తీసుకోలేను"

"నా మాట కాదంటావా ?" ఆగ్రహంగా అన్నాడు.

"ఇది ఉద్యోగ ధర్మం. చెంగలరెడ్డి కాంట్రాక్టు పాసయితే అతడికే లాభమే. మీకూ లాభమే. కాని ప్రజలు నష్టపడిపోతారు!"

"నీ తోటివాళ్ళు లక్షలు సంపాదిస్తున్నారు. నువ్వు నీతి పాఠాలు చెప్పు"

"డబ్బు మనిషిని కాదు నేను"

"నీ అంతు చూస్తా!" సారథి కోపంగా వెళ్ళిపోయాడు.




శనివారం సాయంత్రం సామ్రాజ్యం యింటికి వెళ్ళింది. ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. దమయంతి, శకుంతల గుడికి వెళ్ళారు. రాణి మట్టిలో ఆడుకుంటోంది. సారథి, శరభయ్య కూడా లేరు. సురేష్ మేడ మెట్లమీద కూర్చుని సిగరెట్ కాలుస్తున్నాడు. తల్లిని చూసి పడేశాడు

గాబరాగా!

"ఏమిట్రా వెధవ బుద్ధులు ?" గద్దించింది దగ్గరకెళ్లి.

"డాడీ కాల్చడం లేదా ?" పొగరుగా అన్నాడు.

వాడ్ని రెండు వడ్డించింది. "మళ్ళీ కాల్చావా...... పేక బెత్తం తెప్పిస్తాను జాగ్రత్త"

సామ్రాజ్యం రాణికీ, సురేష్‌కీ నీళ్ళు పోసి...హార్లిక్స్ యిచ్చి, పుస్తకాలు తెరవమని ఆదేశించింది!

సురేష్ చదువులో వెనకబడి వున్నాడు. అయిదేళ్లు వచ్చినా రాణికి అక్షరాలు రావు! సామ్రాజ్యం వ్యధ పడి పోయింది. ఎంతో క్రమశిక్షణగా పెంచాలని ఉబలాట పడింది. ఏం జరుగుతోంది చివరికి! దమయంతి గారాబం, సారథి అలక్ష్యం పిల్లలని పాడు చేస్తోంది! ఈ దశలో దారి తప్పితే వీరికి భవితవ్య ముండదు.

మన్నాడు తను బయలుదేరుతూ "పిల్లల్ని నేను తీసుకెళతాను అత్తయ్యా! బొత్తిగా చదువులేదు యిద్దరికీ" దమయంతిని అడిగింది.

"తీసుకెళ్ళమ్మా ! వీళ్లు నా మాట వినడం లేదు"

సామ్రాజ్యం పిల్లలను కాన్వెంటులో జేర్పించింది తీసుకెళ్లి!

ఇరవై రోజులు గడిచాయి. ఓ వాన రోజు రాత్రి ఏడు గంటల వేళ కూడా ఓ యువకుడితో సారథి సామ్రాజ్యం యింటికి వచ్చాడు.

సామ్రాజ్యం టీ యిచ్చింది యిద్దరికి. ముభావంగా కూర్చుంది.

"ఆ చెంగలరెడ్డి ముందరే యిచ్చేశాడు డబ్బు సామ్రాజ్యం. అది వాడేశాను. ప్రస్తుతం నా దగ్గర డబ్బు లేదు. నువ్వు పని చెయ్యకపోతే వాడికి డబ్బు యిచ్చుకోవాలి. నా పరిస్థితి కూడా గమనించు. ఆదర్శాలు ఎందుకూ పనికి రావు! ప్లీజ్......కాదనక. నేను వాడి ముందు తల ఎత్తుకోలేను. నీ గురించి ఎంతో గొప్పగా చెప్పుకున్నాను" మెత్తగా చెప్పాడు.

సామ్రాజ్యం మాట్లాడలేదు.

"ఇతడు పాపారావని నా ప్రాణ స్నేహితుడి కొడుకు. మీ ఆఫీసులో వుద్యోగానికి అప్లయి చేశాడు. పాపం చాల బీదవాళ్లు. ఏదోలా అది మనవాడికే యివ్వాలి !''

పాపారావు దగ్గర ఎంత పుచ్చుకున్నాడో అనుకుంది.

"వరండాలో వెయిట్ చెయ్యి మిస్టర్" అంటూ అతడ్ని పంపేసి దగ్గరగా జరిగాడు సారథి. "నా మీద ఆశ పెట్టుకుని వచ్చాడు పాపం" అన్నాడు.

"మీకేం ఆశ పెట్టాడు''

సారథి వెర్రిగా నవ్వాడు. కార్యవాది కనుక శాంతం తెచ్చుకున్నాడు.

"సెలక్షను పూర్తయింది. మెరిట్ ప్రకారం ఆర్డర్స్ పంపేశాను"

"నాతో చెప్పక్కర్లేదా?"

"ఆఫీసు విషయాలు మీతో ఎందుకు"

"ఎందుకా? నేను నీ భర్తని ?''

"చివరి మాట మీరే అంటున్నారా ?"

''ఏం ? నీ 'భర్త' మరొకడెవ డయినా వున్నాడా ?"

''ఛీ...మీ సంస్కారానికి నాకు సిగ్గు వేస్తోంది. భర్తలకి హక్కులేగాని బాధ్యత లుండవా అని అడుగుతున్నాను"

సారథిలో ఆవేశం రగిలిపోతోంది. అణచుకుంటూనే"ముందర ఈ విషయాలు

తేల్చు! రెండు పనులూ చేసి పెట్టు, నిన్ను పువ్వుల్లో పెట్టి చూసుకుంటాను' అన్నాడు.

"భర్తగా మీరేం చెప్పినా భార్యగా చేస్తాను. ఒక బాధ్యతగల ప్రభుత్వో ద్యోగిగా మీ అవినీతికి దీపం వెలిగించ లేను. క్షమించండి. ఉద్యోగాన్ని సంసా రానికి ముడి పెట్టవద్దు. ఇలాంటి సిఫార్సులు ఎన్నడూ తీసుకు రావద్దు'' ఖండితంగా చెప్పింది.

రామశాస్త్రి అరుగుమీద వున్నాడు. లోపలకి వస్తూ "మడి గట్టుకుని కూర్చుంటే మన్ను తప్ప ఏముంది ? సారథిగారు చెప్పినట్లు విన్నావా లక్షలు సంపాదించవచ్చు. దీపం వుండగానే యిల్లు చక్క పెట్టుకోవాలి!'' సలహా యిచ్చాడు.

"ఈ సామెతను నమ్ముకునే నాయకులు అధికారులు ప్రజల గొంతుకకోస్తున్నారు! ఆ దౌర్భాగ్యం నాకవసరం లేదు. గెటవుట్ దట్స్ నన్ ఆఫ్ యువర్ బిజినెస్''

"నువ్వు మాటలతో ఎక్కడ లొంగు తావ్ ?'' సారథి ఆవేశంగా లేచాడు. సామ్రాజ్యం మెడ పట్టుకుని లాగి, నడుం వంచి పొడిచాడు అందిన చోటల్లా కొట్టాడు. వాయించాడు. "తిమ్మిరి అణిగిందా ?"

"ఇంకో రెండు అంటించవయ్యా" రామశాస్త్రి ఉషారు చేశాడు.

సారథి వురికేలోగా, ఫోన్ దగ్గర కెళ్ళింది. "హలో! పోలీస్‌స్టేషన్! మీ స్క్వాడ్‌తో రావాలి...దౌర్జన్యంగా...!

సారథి ఫోన్ లాగేశాడు. "నన్ను జైలుకి పంపాలని చూస్తున్నావా? నీ పని చెబుతా..." అంటూ వెళ్లిపోయాడు.

కాదు పారిపోయాడు! పోలీసుకేసులో యిరుక్కోవాలని. "డాడీ మంచాడు కాదమ్మా. నిన్ను కొడతాడు'' అంది రాణి.

కన్నీటి మధ్య పిల్లల్ని కౌగిలించు కుంది.

ఈ గొడవ జరిగాక సారథి బియ్యం, సరుకులు సామ్రాజ్యానికి పంపించడం మానేశాడు. ఆమె మీద అంతులేని కక్షగా వుంది. ఒకటో తారీఖుకి శరభయ్యని పంపి జీతం తెప్పించేసుకుంటున్నాడు.

డబ్బుచాలక సామ్రాజ్యం యిబ్బంది పడుతోంది. ఒకసారి ఏదో అవసరం నిమిత్తం హెడ్‌క్లర్క్‌ని వంద రూపాయలు అడిగి తీసుకుంది.

దానితో హెడ్‌క్లర్క్ తనపనులకోసం ఆమెని వినియోగించుకోవాలనుకున్నాడు. సామ్రాజ్యానికి రోత వేసింది. సమాజం వ్యాపారం మీద నడుస్తోందా ?

"బి యిన్ యువర్ లిమిట్స్ !" శాసించింది.

"అవకాశాన్ని అందిపుచ్చుకోవాలమ్మా! సుభాషితాల వల్ల లాభమేమిటి ? మనకి కావల్సినపుడు అప్పులు మాత్రం ఎవరిస్తారు ?"

క్రింది వుద్యోగిని అప్పు అడగడం ఎంత లోకువో తెల్సింది.

నాలుగైదు నెలలు గడిచినా కోడలు ఇంటికి రాకపోవడం దమయంతికి అంతో శసగా వుంది. సారథిని అడిగింది కూడా. అతడేం మాట్లాడలేదు. శకుంతలచేత వుత్తరం రాయించింది నాలుగు రోజులుం డేలా రమ్మని.

అత్తగారిమాట కొట్టివెయ్యలేక బయలు దేరి వెళ్లింది పిల్లలతో. సారథికి జ్వరమని దమయంతి ద్వారా తెల్సింది. వెంటనే




మేడమీదకి వెళ్ళింది.

సారథి మూలుతూ పడుకున్నాడు.

''ఎలా వుంది ?'' మంచం చివర కూర్చుంది.

కళ్ళు తెరిచాడు. భార్య. మాట్లాడలేదు

''అమృతాంజనం రాయనా ?''

మాట్లాడలేదు.

ఒళ్లు చూసి ''జ్వరంలేదులెండి.బత్తాయి వలవనా ?'' అడిగింది.

"నువ్వు ముందర బయటికి ఏడు. మొగుడ్ని జైలుకి పంపి ఎవడితోనో కులుకుదామని చూస్తున్నావా ? ఎంతకి తెగించావే?"

"మీరు పగబట్టడం భరించలేనండీ. పోనీ వుద్యోగం మానేయనా?"

"పోతావా...పాలేర్ని పిలిచి గెంటిం చనా?'' గావుకేక పెట్టాడు.

సామ్రాజ్యం దిగాలుపడి మెట్లు దిగు తూండగా, శకుంతల ఎదురైంది. ఆమె కేకలు విని వచ్చింది''ఏమిటక్కయ్యా?''

"మీబావగారి పైత్యం" సామ్రాజ్యం జీవంలేని నవ్వు నవ్వింది.

"నేను అంతా చూస్తూనే వున్నాను. బావ కసిరికొడతాడు. నువ్వు ప్రాకులాడు తావు ! ఎందుకీ అవస్థ ? రెండువేలు సంపాదించుకుంటున్నావు. వేరుగా బ్రతక లేవా ? ఆడది ఎదురుతిరిగితేగాని మగ లోకానికి బుద్ధిరాదక్కా" శకుంతల మండి పడింది !

''సంఘం, న్యాయం కాపురాన్ని నిలబెట్టవమ్మా...కాదని పోవడం తేలిక. జీవితాంతం కలసి వుంటామని పెళ్లినాడు ప్రమాణాలు చేసుకున్నాం. స్వల్పమైన విభేదాలకి రోడ్డుఎక్కుతామా ? ఇద్దరూ ఆవేశపరులయితే విడాకులే మార్గం. ఏ ఒక్కరు శాంతించినా సమస్య విషమం కాదు. అందుకే నా ఓర్పు.

"సంసారంలోని మాధుర్యాన్ని చూశాక ఏకాకిగా, విరాగిగా ఎంత వైభవంగా బ్రతికినా లోటుగానే వుంటుంది. అందుకే రాజీ ! ఇది మీ బావమీద ప్రేమకూడ కావచ్చు. నా గురించి ఆనాడు తండ్రిని కూడాకాదన్నారు. ప్రమోషనే ప్రమాదం తెచ్చింది. శాంతిలేకుండా చేసింది. పిల్లల భవిష్యతునికూడ ఆలోచించి నేను కాపురం వదులుకోలేకపోతున్నాను.

"నువ్వు దేవతవక్కా" శకుంతల సంబరపడిపోయింది.

రెండు నెలల తర్వాత-సారథి భార్య ముఖం చూడటంలేదు. జీతానికి కూడా శరభయ్యనే పంపుతున్నాడు.

శరభయ్య ఆమె ఇచ్చిన జీతంలో నాలుగు వందలు వాడుకుని మిగతాది సారథికిచ్చాడు.

"ఇంతే ఇచ్చిందేం?"

"నీ భార్య నన్నో పురుగు కింద చూసిందిరా?నేను కాబూలీవాలాలా పీడించి పట్టుకుపోతున్నానట దాని కష్టారిజితం ? నీకు ఎందుకు యివ్వాలో జీతం తనకి అర్థం కావటంలేదట ! దాని తండ్రి ఇక్కడే వున్నాడు. వాడికేదో రోగంట. ఆపరేషను చేయించి మేపుతోంది. పొట్టేలులా తయారయ్యాడు నీ మావ!''

శరభయ్య రంగులు పులిమి చెప్పాడు. సారథి ... సామ్రాజ్యం పరిస్థితిచూసి, వారి బాంధవ్యాన్ని తెంపివేయాలను కున్నాడు శరభయ్య. శకుంతలని ఇచ్చి సారథికి పెళ్ళిచేయడం అతడి జీవితాశయం.

సమాజంలో ఎదగడానికి రాజమార్గాలు వుంటాయి. అడ్డదారులు వుంటాయి. రాజ మార్గాలు ప్రయాస. అడ్డదారులు అందుబా టులో వుంటాయి. ఎదుగుదల భ్రాంతిలో



వ్యక్తి విహరిస్తున్నప్పుడు సాంఘిక ధర్మాలను, నీతిసూత్రాలను త్రోసిరాజం టాడు! కూతురు 'ఎర'తో పైకి పోవా లనుకుంటున్నాడు శరభయ్య.

''అంతదాకా వచ్చిందా వ్యవహారం? దాని అంతు చూడాల్సిందే!"

సామ్రాజ్యం ఆఫీసులో గుమస్తాలని పట్టుకుని ఆమెమీద లంచాలు తీసుకుం టోందని పిటీషన్ పెట్టించాడు. ఆమె మేలిమి బంగారమని పైవాళ్ళకి తెల్సు. పిటీషను బుట్టదాఖలా చేశారు.

సారథి రెండో అస్త్రం తీశాడు... పిల్లలు! వాళ్ళని వేరుచేస్తే తను చెప్పినట్లు వింటుంది.

మర్నాడు పుదయం తొమ్మిదిగంటలకు సామ్రాజ్యం దగ్గర కెళ్ళాడు. సూప ర్నెంటు విజిట్ కి వస్తాడని పెందరాళే ఆఫీసుకి బయలుదేరుతోంది.

పలకరించి కాఫీ యిచ్చింది.

"కాఫీ వద్దు. భోంచేసాను"

సామ్రాజ్యం గుండెల్లో రాయిపడింది. తండ్రికి పెట్టి, తను తిని, పిల్లలకి పెట్టి కాన్వెంటుకి పంపేసింది. అన్నం లేదు. మళ్ళీ వండాలి. అవతల వ్యవధి లేదు. అన్నం లేదని చెప్పలేక చీర మార్చుకుని గ్యాస్ మీద వంట కానిచ్చింది హడావిడిగా

అది సారథికి భోజనం టైం కాదు-సామ్రాజ్యాన్ని బాధించడానికి తప్ప. బంగాళా దుంపల వేపుడు, చారు, ఆవ కాయ చూసి విసిరికొట్టాడు.

"నేనేం తింటానో ఇప్పటికీ తెలిసి ఏడవలేదా? నీ యిష్టం వచ్చింది వండి ముఖాన కొడతావా?" చెయ్యి కడిగేసు కున్నాడు.



"ఆఫీసు ఇన్స్పెక్షనండీ. వ్యవధిలేదు. రాత్రికి మీరేం కావాలన్నా వండుతాను. ప్లీజ్! భోంచేయండి. మీగడ పెరుగుంది. మీరు తినకపోతే బాధగ వుంటుంది.''

"మొగుడు తప్ప అందరూ ముఖ్యమే నీకు. ఏదైన అంటే పోలీసుల్ని రప్పిస్తావు. ఎంతకి తెగించావే? అడ్డమైన వెధవలకి ఆపరేషన్‌లు చేయిస్తావు. నీ జీతం నేను మాత్రం అడగకూడదు. అవునా?"

పోట్లాటకే వచ్చాడని గుర్తించింది.

"ఏం జరిగింది బాబూ!" రాఘవయ్య అక్కడికి వచ్చాడు.

"ఛీ...ఆడదాని సొమ్ముతో బ్రతికే నువ్వా మాట్లాడటమే. ... ఛీ ...ఎందుకొచ్చిన బ్రతుకయ్యా! నీకు గతిలేకపోతే నన్ను అడగాలి. నీ కూతురు కాదు అది నా భార్య...దాన్ని అడగడానికి హక్కేముంది?"

ఈ సారథిని చూడటం రాఘవయ్యకు కొత్త. నోరు వెళ్ళబెట్టాడు.

అది అర్థంకాని పోట్లాటని తెల్సు. సామ్రాజ్యం జీపులో ఆఫీసుకి వెళ్ళిపోయింది.

"నీ కూతురుకెంత తల బిరుసో చూశావా? నన్ను లెక్క చెయ్యకుండా పోయింది? సంపాదిస్తున్నానని గర్వం

కాదూ ?" మావగార్ని గద్దించాడు.

రాఘవయ్య ఏం అంటాడు?

సారథి ఆ మంటమీదే కాన్వెంటుకి వెళ్ళాడు. సురేష్‌ని, రాణిని తీసుకువచ్చి శరభయ్య ద్వారా తమ వూరు పంపే శాడు.

రెండింటికి హోటల్లో భోజనం చేసి సామ్రాజ్యం ఆఫీసు కెళ్ళాడు. ఆమె గది లోకి వెళ్ళలేదు. ఆమె కెదురు గదిలో క్లర్కుల దగ్గర కూర్చున్నాడు. క్లర్కు లకి టీ తెప్పించాడు. ఆఫీసరుగారి భర్తని నలుగురూ గౌరవంగా వున్నారు.

"ఎలా వుంటుందోయ్ మీ ఆఫీసరు" సారథి గట్టిగా అడిగాడు. సామ్రాజ్యం గదికి స్వింగ్‌డోర్స్ తెరచే వున్నాయి. ఫైలు చూస్తోంది.

"నిప్పండీ! పనితప్ప ఆమెగారికి మరేం అక్కర్లేదు."

"నిప్పుకీ నీళ్ళకీ ఏమిటిలే! వెధవ వుద్యోగం ఎవరయినా చేస్తారు. అదికాదు. మీ ఆఫీసరు ఏమయినా ప్రేమకలాపాలు సాగిస్తోందాని!"

"అనుమానం కాబోలురా" గుమస్తాలు నవ్వుకున్నారు.

సామ్రాజ్యం పరువు తీయాలి...ఇదీ సారథి ప్లాను.

సామ్రాజ్యం వింది. చండికలావచ్చింది "మిస్టర్ సారథీ! గెటవుట్. ఈ విధంగా మిమ్మల్ని జైలుకి పంపగలను. మరో సారి ఆఫీసుకిగాని, యింటికి కాని రావద్దు ఇది ఆఖరి హెచ్చరిక...ఐసే గెటవుట్" అరచింది?

"నీ అంతు చూడనిదే నిద్రపోనే!" సారథి బయటికి నడిచాడు.

అంతమందిలో భార్యచేత అవమానం పీడించింది ఆతణ్ని! "మావయ్యా" సామ్రాజ్యంతో ఋణం తీరిపోయింది ఇక'' అన్నాడు ఇంటికి రాగానే.

శరభయ్యకి అది శుభవార్తలా తోచింది.

"మాటలకి దెబ్బలకి అది లొంగదురా! శకుంతలని పెళ్ళి చేసుకో. చెప్పుతో కొట్టినట్లు అవుతుంది" కీ యిచ్చింది శరభయ్య తెలివి.

సాలోచనగా చూశాడు. "మరి అమ్మ ఒప్పుకుంటుందా?"

దమయంతికి కోడలిపై ప్రేమ తెల్సు. రాద్ధాంతం చేస్తుంది. సాగనివ్వదు కూడా. శరభయ్య దానికో వుపాయం వెతి కాడు.

"యాత్రా స్పెషల్ వెళుతోంది. దాంట్లో పంపించు. మూడు నెలలదాకా రాదు మీ అమ్మ. ఈలోగా మన పనులు పూర్తవుతాయి. తర్వాత మీ అమ్మ వచ్చినా బాధలేదు. తిడుతుంది కాని, ఏం చెయ్యలేదు."

"నీ తెలివి అమోఘం మామయ్యా! దానితో సామ్రాజ్యం తా."

యాత్రా స్పెషల్‌కి టిక్కెట్టు తెచ్చాడు.

"ఇప్పుడెందుకురా నాయనా?"

"ఈ మాత్రం ఓపిక వుండగానే నాలుగూ చూసి రావాలి. ఈ తాపత్ర యాలు ఎప్పుడూ వుండేవే? నువ్వు రామా కృష్ణా అనుకునే రోజులు వచ్చేశాయి అక్కయ్యా! నేను వద్దనుగాని ఇక్కడ సారథి ఒక్కడూ అన్నీ చూసుకోలేడని తటపటాయిస్తున్నాను" అన్నాడు శరభయ్య.

దమయంతి యాత్రల కెళ్ళిపోయింది.

"మామయ్యా లగ్నం పెట్టించు!" సారథి ఆదేశించాడు.




"నువ్వు రాకూడదన్నావనుకో. కాని రావడం తప్పనిసరయిందీ సారి. ఇకవచ్చే అవసరముండదులే!"

స్రామాజ్యం ఆఫీసులో పనిచేసు కుంటూండగా, సారథి లోపలకి వచ్చాడు. సారథి తిరిగి రావడం గుమస్తాలలో చలనం కలిగింది. కుతూహలంగా డోర్ దగ్గర గుమిగూడారు.

స్రామాజ్యం గమనించింది. విసురుగా స్ప్రింగ్ డోర్ తెరచి "ఎందుకున్నారు ఇక్కడ?" అని గద్దించింది. ఎవరి చోటికి వారు కదిలారు.

ఫ్యూన్‌ని డ్రింక్స్ తెమ్మనిచెప్పి, "కూర్చోండి" అంది మర్యాదగా.

సారథి జిప్ తీసి శుభలేఖ ఇచ్చాడు. వక్రంగా నవ్వుతూ "నీకు సవితి వస్తోంది. పెళ్ళికి స్వయంగా పిలుద్దామని వచ్చాను" ఆమె ముఖంకేసి చూడసాగేడు.

స్రామాజ్యం శుభలేఖ చూడలేదు. డెస్కు మీద పడేసి "శకుంతల కాదూ పెళ్ళికూతురు?" అంది నిర్వికారంగా.

"తెలుసుకున్నావు మాట! నువ్వేం పిచ్చి వేషాలు వేసినా సాగనివ్వను. నా జాగ్రత్తలో నేనున్నాను. పెళ్ళి ఆపడం నీ తరంకాదు."

"నేనంటే భయపడుతున్నారా?" స్రామాజ్యం నవ్వింది.

సారథి వులిక్కిపడ్డాడు. ఇదేమిటి ఇలా జరుగుతోంది. శుభలేఖ చూడగానే ఆడపులిలా మీద పడుతుందని, ఆఫీసులో అల్లరి చెయ్యవచ్చని వచ్చాడు! స్రామాజ్యంలో ఎక్కడా చలనం లేక పోవడం వితాకుగా వుంది.

"డ్రింక్ తీస్కోండి పెళ్ళికొడుకు గారూ!" తాను తీసుకుంటూ అంది.

"నీ పొగరు అణగడానికే ఈ పని చేస్తున్నాను. దీనితో నీ తిమ్మిరి అణుగుతుంది. పెళ్ళికి రావడం మరచిపోక" లేస్తూ అన్నాడు.

"జరిగితే తప్పకుండా వస్తాను."

"జరగదని నీ ధీమాయా?"

"ఏమో! స్రామాజ్యాంని కాదని శకుంతలని చేసుకోబోతున్నారు. మరో సుబ్బలక్ష్మి కనిపిస్తే శకుంతలని వదిలేయచ్చు. మీకు పెళ్ళిళ్ళు బట్టలు మార్చుకోడం లాంటిది, మీ నీడలోకి వచ్చే ఆడవారికి అగ్ని పరీక్షలు!" భారమైపోయింది ఆమె కంఠం.

"సీ ఎ హెల్!" విసురుగా వెళ్ళిపోయాడు.

సారథి పెళ్ళి ప్రయత్నాలు విస్తృతంగా చేశాడు. పందిర్లు, బాణసంచా, బ్యాండు... రూపాయిలతో అన్ని అలంకారాలు దింపాడు. డబ్బున్నవాడు రెండో పెళ్ళి చేసుకుంటున్నాడు కనుక నలుగురూ సంతోషించారు. ఇదే ఏ పేదవాడో చేస్తే ఆ గ్రామ ప్రజలు పంచాయితీ పెట్టేద్దురు.

"ఇంత హడావిడి ఎందుకురా?" శరభయ్య అన్నాడు ఆందోళనగా. పెళ్ళిమీద

పెళ్ళి. సామ్రాజ్యం ఏదయినా చేస్తుందని అతడి భయం.

"నాకు రెండో పెళ్ళయినా శకుంతలకి మొదటి పెళ్ళేకదా మావయ్యా! ఇదంతా చూసి, విని ఆ గాడిద కుళ్ళి కుళ్ళి ఏడ్వాలి!"

పెళ్ళిరోజు !

పందిరి జనంతో కిటకిట లాడుతోంది. బ్యాండు మ్రోగుతోంది, బాణసంచా ప్రేలుతోంది. కళ్యాణ వేదిక కన్నులపండుగగా వుంది.

ముహూర్తం సమీపించింది. ఆడవాళ్ళు చెప్పిన మాటవిని శరభయ్య కంగారుపడి, సారథికి చెప్పాడు వేదిక మీదికి వెళ్ళి.

క్షణంలో అంతటా వ్యాపించింది..

పెళ్ళికూతురు కనిపించడం లేదు.

సారథి పిచ్చికుక్కలా కలయ తిరిగేశాడు. మనుషులని తలోచోటికి పంపాడు శకుంతలని వెతకడానికి ?

సారథి పెళ్ళికి అంగీకరించగానే శరభయ్య కూతుర్ని "నీ పంట పండిందమ్మా" అన్నాడు.

"ఏమిటి నాన్నా?"

"బావ నిన్ను చేసుకోడానికి ఒప్పుకున్నాడు. పది రోజుల్లో దొరికింది మంచి ముహూర్తం."

"అక్కయ్య వుండగా నన్ను చేసుకోడమేమిటి నాన్నా?"

"ఓసి పిచ్చి ముఖమా ఆ గొడవంతా నీ కెందుకే ? సామ్రాజ్యానికి విడాకులిస్తాడు. దాని ఏడుపు అది ఏడుస్తుంది."

శరభయ్య ఆస్తికోసం తొందర పడుతున్నా, ఆ కన్నె మనసు రాజీపడలేకపోయింది. ఆలస్యం చేస్తే లాభం లేదని "నేను ప్రకాశాన్ని చేసుకుంటాను నాన్నా" ధైర్యం తెచ్చుకుని చెప్పింది.

"ముష్టి వుద్యోగం రాళ్ళతో బ్రతికేవాడే ఘనంగా కనిపించాడేమిటే నీకు?" జాగ్రత్త... పిచ్చివేషాలు వేస్తే సహించేది లేదు, నీ పెళ్ళి నీ ఇష్టం కాదు. నేను చెప్పినట్లు వినవల్సిందే. అందలం ఎక్కిస్తానంటే అడుసులో ఏడుస్తానంటావేం?"

శకుంతల ఏడ్చింది – ప్రకాశమే కావాలని.

"నువ్వెంత ఏడ్చినా లాభం లేదు. సారథి నీ భర్త, మెడలు విరిచయినా చేసేస్తాను. పట్టుదలవస్తే నన్ను ఎవరూ ఆపలేరు !"

శకుంతల ఏడవసాగింది. ఈ అంతులేని అగాధంలో ఆమెకి ఆశాకిరణంగా సామ్రాజ్యం కనిపించింది. కాని ఆమెని కల్సుకోవడం అంత సులభంగా లేదు. శకుంతల ఏదయినా అఘాయిత్యం చేస్తుందని వెయ్యి కళ్ళతో కనిపెట్టుకుని వుంటున్నాడు తండ్రి.

చివరకి సినిమావంక మీద సామ్రాజ్యాన్ని కల్సుకుంది. "నాకీ పెళ్ళి యిష్టం లేదక్కా ! నన్ను ప్రకాశం దగ్గరకి పంపెయ్ !" అంది ఆమె ఒడిలో పడి ఏడుస్తూ.

సామ్రాజ్యం ఓదార్చింది. "ఎంతో మంచి సంబంధం చేస్తున్నాడు మీ నాన్న. భూములు – డబ్బు–ఇల్లు – వ్యాపారాలు వున్నాయి నీభర్తకి. ఇంతకంటె ప్రకాశం గొప్పవాడా ?"

"నీకు అన్యాయం చెయ్యలేనక్కా ! అది నా స్థానం కాదు. నాన్నకి డబ్బు దయ్యం పట్టుకుంది. ఏమీ లేకపోయినా ప్రకాశం గొప్పవాడే నాకు. పంపెయ్ అక్కా !"

ఆ మాటలకి, ఆమె అవ్యాజ అనురా

గానికి సామ్రాజ్యం కరిగిపోయింది. ఆమె కన్నీళ్ళు తుడుస్తూ "తప్పకుండా పంపుతానమ్మా ! వుత్తగా కాదు. పెళ్ళిచేసి పంపుతాను. ప్రకాశం నీవాడు. మిమ్మల్ని ఎవరూ వేరుచెయ్యలేరు" ధైర్యమిచ్చింది.

ఏం చెయ్యాలో సామ్రాజ్యం చాలా సేపు మథనపడింది. ఈ అవకాశంతో శకుంతలని రక్షించడమే కాదు తనని కూడ కాపాడుకోవాలి.

"నువ్వు యింటికి వెళ్ళమ్మా! ప్రకాశాన్ని వైర్ యిచ్చి రప్పిస్తాను."

"మళ్ళీ అక్కడికా? నాన్న రానివ్వడు బాబూ" భయపడింది.

"నేనుండగా భయమెందుకు శకుంతలా ! నామీద నమ్మకం లేదా ?"

శకుంతలకి ఏం చెయ్యాలో విశదంగా చెప్పింది. ముహూర్తం మరో గంట వుండగా, సామ్రాజ్యం కారు పంపిస్తుంది. అది ఎక్కి శకుంతల వేంకటేశ్వర ఆలయానికి వస్తే, ప్రకాశంతో సామ్రాజ్యం రెడీగా వుంటుంది. అక్కడ ప్రకాశానికి, శకుంతలకి పెళ్ళి జరుగుతుంది.

అయినా శకుంతలకి ధైర్యం చాల లేదు "అక్కడికి మళ్ళీ వెళ్లాలంటే భయంగా వుందక్కా. నాన్న...బావ..."

మధ్యలో అందుకుంది సామ్రాజ్యం "శకూ ! ఇలా చెయ్యడానికి కారణముంది. మీ బావ ఎన్నో అవమానాలు చేశారు. కాపురం కోసం సహించాను. నేడు నేను బదులు తీర్చుకునే అవకాశం వచ్చింది. నా మీద అభిమానముంటే, నీ అక్క గౌరవం, దీక్ష నిలబడాలంటే ఎదురు చెప్పకు"

"అలాగే అక్కా ! నువ్వు చెప్పినట్లే చేస్తాను."

శకుంతల తిరిగి యింటికి వెళ్ళింది. పెళ్ళి పనులలో చురుగ్గా పాల్గొంది. శరభయ్య, సారథి సంతోషించి చీరలు, నగలతో ముంచెత్తారు ఆమెని.

చివరి ఘట్టంలో శకుంతల వారిని ముంచివేసి, కారెక్కింది. కోవెలలో సామ్రాజ్యం నిర్వాహణలో ప్రకాశం ధర్మపత్నయింది.

"ఇదంతా నీ చలవ అక్కా ! నువ్వు లేకుండా వుంటే నాన్న నా గొంతు కోసును. నన్ను రక్షించావక్కా" పాదాభివందనం చేస్తూ అంది శకుంతల.

"మీ చొరవ వల్లే మేం దంపతులు కాగలిగాం" ప్రకాశం నమస్కరించాడు.

"మీరు సంతోషంగా వుంటే నా శ్రమ ఫలించినట్లే! ఎప్పుడు ఏ సాయం కావల్సి వచ్చినా నేనున్నాను. నూరేళ్ళు ఆనందంగా జీవించండి."

పెళ్ళయిన వెంటనే టాక్సీలో నూతన దంపతులు హైదరాబాద్ వెళ్ళిపోయారు ! సామ్రాజ్యానికి గుండెల మీద బరువు తగ్గింది.

ప్రకాశం-శకుంతల పెళ్ళి ఫొటోలు మర్నాడు సామ్రాజ్యం రిజిస్టర్డు పోస్టులో సారథికి, శరభయ్యకి పంపింది.

అవి చూడగానే వారి ముఖాల్లో నెత్తురు చుక్కలేదు.

* * *

సారథి చాలా రోజులు మనిషి కాలేదు. సామ్రాజ్యం ముఖం ఈ జన్మలో చూడనని శపథం చేశాడు. దమయంతి యాత్రలనుంచి రాలేదు. ఆడదిక్కు లేని సంసారమయింది. శకుంతల పెళ్ళి తనపై ప్రయోగించి తనని గాడిద చెయ్యడానికి శరభయ్యకీ వాటావుందని, అతడ్ని సారథి

గెంటివేశాడు ! పిల్లల కోసం, వంటకి పారిజాతాన్ని పెట్టాడు.

సారథి వ్యాపారాలు, వ్యవహారాలు మూడు పువ్వులు ఆరు కాయలు గా వున్నాయి. బావిలా వుండే సంపద చెరువయింది. సారథి వీలైనంతగా బయటే తిరుగుతున్నాడు యింటిలో వుండలేక. ఆ రాత్రి ఓ పింట అయ్యాక యింటికి వచ్చాడు.

ఒంటరితనం !

మేడమీదకి పోయి విస్కీ ఓపెన్ చేశాడు. రెండు మూడు రౌండ్లయ్యాయి పారిజాతం భోజనం తెచ్చింది.

పారిజాతానికి సలభై దాటుతున్నా పాతికేళ్ళ దానిలా వుంటుంది. ఆమె అందం సహజ నది లాంటిది.

సారథి చెయ్యి పట్టుకోగానే "నేను అలాంటి దాన్ని కాను బాబూ" అంది పైట ఒంటినిండా కప్పుకుంటూ.

సారథి నోట్లు చూపించగానే పారిజాతం బెట్టు చేయడం మానేసింది. ఈ స్నేహం వల్ల యింటి బాధ్యతలు ఆమెకి అప్పగించాడు సారథి. పారిజాతం పదవిలో వున్న నాయకుడిలా ముందు జాగ్రత్త పడసాగింది మూటగట్టి. సురేష్‌ని, రాణిని తనని 'పిన్ని' అని పిలవాలని చెప్పింది.

"వంటచేసే దానివి పిన్ని ఎలా అవుతావు ?'' సురేష్ ఎదురు తిరిగాడు.

"మీ నాన్నే నామాట కాదంటంలేదు నువ్వెంతరా?" అనివాడ్ని నాలుగు బాదింది.

పారిజాతం వెళ్ళిపోయాక రాణి "ఏడవకురా అన్నా ... పారిజాతం మంచిదికాదు. డాడీతో చెబుదాం"

ఓదార్చింది.

"డాడీ కూడ మనల్ని కొడతాడు."

ఆ పసివాళ్ళకి అక్కడ వుండటం సుఖంగాలేదు. తల్లిమీద వ్యామోహం పీడిస్తోంది. ఆ మధ్యాహ్నం సురేష్ చెల్లెలితో అమలాపురం తల్లి దగ్గరకి బస్సెక్కాడు.

పారిజాతం భోజనాలవేళ వారి కోసం చూసింది. ఎక్కడా కనిపించలేదు. తను భోంచేసి పడుకుంది. సారథి భోజనానికి రానని కబురుపెట్టాడు. అంత యింటిలోను ఒక్కతె వుండడంతో ఆమె మనస్సు చురుగ్గా పని చేసింది. అయినా, పదీ ఎన్నాళ్లు పోగెయ్యడం? నగలు, రొక్కం మూట కట్టుకుని జండా ఎత్తేసింది.

ఆమె వెళ్లిన గంటకే యాత్రల నుంచి దమయంతి వచ్చింది. ఇల్లు అయ్యావారి నట్టిల్లులావుంది. ఎవరూలేరు. తలుపులు తీసివున్నాయి. దమయంతి కంగారు పడుతూ యిల్లంతా చూసింది. ఇనప్పెట్టె తీసివుండడంతో-నర్సింమూర్తినిపిలిచింది.

"స్థిమితం తెచ్చుకో వదినా ! నువ్వు వెళ్ళగానే యింటి పరువు గంగలోకి దిగింది. సారథి మూర్ఖుడయ్యాడు" నర్సింమూర్తి జరిగిన వన్నీ చెప్పాడు.

"ఛీ...వీడికంటే వీళ్ళ నాన్నే నయం" దమయంతి రోత పడింది.

మూడు గంటలకి సారథి వచ్చినా, పల్కరించినా మాట్లాడలేదు. "ముందర సామ్రాజ్యాన్ని తీసుకురా! అప్పుడే నీతో మాట్లాడటం" అంది.

"దానికి నేనంటే లక్ష్యం లేదమ్మా."

"పెధవపనులు చేస్తే లక్ష్యం ఎలా వుంటుంది ?''

సారథి దొంగతనం గురించి పోలీసులకి తెలియచేశాడు. వాళ్లు వచ్చి పరిశీలించి వెళ్ళిపోయారు.

"ఇల్లాలుతోనే యింటి కళవుంటుందిరా!

ఎంతోమంది జనం,డబ్బు నీ చుట్టూవున్నా అది ఉప్పులేని కూరేరా ? నా మాట విను కోడల్ని తీసుకురా."

అటు పట్టుదల - ఇటు తల్లి ఆదేశం, సారథి సందిగ్ధంలో పడ్డాడు. ఆలోచిస్తూ మేడమీద పచార్లు చెయ్యసాగాడు.

సంధ్య సెలవు తీసుకుంది. క్రమంగా పున్నమి వెన్నెల వచ్చేసింది. కింద మాటలు వినిపిస్తున్నాయి. మెట్లమీద నుంచి తొంగి చూశాడు. సామ్రాజ్యం, పిల్లలు !

"వాడికి జ్ఞానం లేకపోతే నీ తెలివి ఏమయింధమ్మా? కొంపని, పిల్లల్ని అనాథలుగా వదిలేస్తావా ? ఇది బాగుందా ?'' దమయంతి వ్యగ్రంగా అడుగుతోంది.

"దీనికి సమాధానం మీ అబ్బాయి యివ్వాలి!" సామ్రాజ్యం పిల్లల్ని తీసుకుని మేడమీదకి వచ్చింది. "చెప్పకుండా వచ్చేశారు పీళ్లు. మీరు వెతుక్కుంటారని తీసుకు వచ్చాను. హక్కు మీది కనుక వాళ్ళని జాగ్రత్తగా పెంచండి. సెలవు'' అంది తిరుగు ముఖం పెట్టి.

సారథి ఓడిపోయిన ఆటగానిలా చూశాడు.

"ఇలాంటి స్థితిలో ఇల్లొదిలి పోటానికి నీకు మనసెలా ఒప్పుతుందమ్మా ?" ప్రాధేయపడింది దమయంతి.

సామ్రాజ్యం కళ్ళంట నీళ్ళు తిరిగాయి.

"క్షమించండత్తయ్యా! నా సహనాన్ని చివరిదాకా పరీక్షించారు మీ అబ్బాయి. నాలో ఇహ ఓపిక లేదు"

దమయంతికి అర్థమైంది.

"సరే! వాడికి బుద్ధి రాకపోతుందా ! అదీ చూద్దాం. నన్ను కూడా నీతో తీసుకుపో! నేనీ కొంపలో ఉండలేను"

స్థాణువులా వింటూ నిల్చుండిపోయాడు సారథి. తల్లి గనుక తనమీద నోరు విప్పితే ఏమవుతుందో అతడికి తెలుసు. సామ్రాజ్యం ఇదివరకే తన నోరు మూసివేసింది. ఇప్పుడామెను తనేం చేయలేడు. మళ్ళీ మాట్లాడితే సామ్రాజ్యమే తన్నేమైనా చేయగల స్థితిలో ఉంది. తనూ, తన ఆస్తి, అధికారం ఆవిడను ఓడించలేకపోయాయి.

సామ్రాజ్యం సహనం ముందు అతనెప్పుడో ఓడిపోయాడు. ఆమె ఔన్నత్యం ముందు ఇప్పుడు పూర్తిగా ఓడిపోయాడు. సంపాదించే లక్షలు ఏ సంతృప్తినీ ఇవ్వటం లేదు. ఇంతకన్నా ఆ గుమస్తా ఉద్యోగం రోజుల్లోనే తనెక్కువగా సుఖపడ్డానని చాలాసార్లు అతనికి అనిపించకపోలేదు.

అయినా ఆ మాట పైకి ఒప్పుకోడానికి అహం అడ్డం వస్తోంది. ఆ సంగతి కూడా గుర్తించాడతను.

కానీ, ఆ అహాన్ని అంత తేలిగ్గా చంపుకోగలడా !?

"ఏంరా! మాట్లాడవేం ? నన్ను కూడా వెళ్ళిపొమ్మంటావా ?"

"అమ్మా !"

మరేం అనలేక బాధతో, అవమానంతో నిస్త్రాణగా సోఫాలో వాలిపోయాడు సారథి.

ఏమిచేమిటంటూ ఆదుర్దాగా చుట్టూ మూగారు తల్లీ, భార్యా, పిల్లలూ.

అవును మరి! వారతనికి తల్లీ, భార్యా, పిల్లలూ గదా !



# గాబరా

కొత్తాఫీసరు పీకల మీదికి వచ్చాడు. చండశాసనుడు. నిమిషం ఆలస్యమయితే చాలు, యుగమైనట్టుగా ఎగురుతాడు. మనిషికి మెమోలు, సస్పెండులూను. వేగంగా నడవాలి ! లేదా రిక్షా ఏదైనా ఎక్కేసేయాలి! వెధవది కిలోమీటరు దూరం కూడా ఈ టైమప్పుడు కొన్ని యోజనాల దూరంలా అన్పిస్తుంది. పావు తక్కువ పది. లోకంలో వాచీలన్నీ




అరగంటసేపు ఆగిపోతే బాగుణ్ను ! ఆ ఇంద్రజాల, మహేంద్రజాల విద్యలన్నీ నేర్చుకొంటే ఆఫీసరాసురునిబాధ తప్పేది. హాయిగా గమ్యానికి చేరుకోవచ్చు.

సుబ్బారావు ఆలోచిస్తూ నడుస్తున్నాడు. ఎండ పేలిపోతూంది. కసిగా సూర్యుణ్ణి తిట్టుకొన్నాడు. రిక్షాయే శరణ్యమన్పించింది. బేరం చేశాడు రిక్షావాణ్ని. "రూపాయివ్వండి" అన్నాడు. తోక తొక్కిన పాములా అయ్యాడు సుబ్బారావు. సిగరెట్ ముట్టించి గట్టిగా నాలుగు అడుగులు వేస్తే చాలు 'అదిగో ద్వారక' అన్నట్టుగా ఆఫీసుకు చేరుకోవచ్చు. అటువంటిదానికి రూపాయి కావాలట. ఛీ ఛీ! దేశం పాడైపోతూంది. అవినీతి ప్రబలుతూంది. ఒకర్నొకరు దోచుకోవడం అందరికీ అలవాటైంది. లేకపోతే ఏమిటి? రూపాయి కావాలట!

మరో పది బారలు నడిచిన సుబ్బారావు మరో రిక్షాని అడిగేడు. "రూపాయిప్పించండి బాబయ్యా!" అందరూ అదే మాట! కూడబలుక్కుంటారు కాబోలు! ఎక్కడి సొమ్ము తేవాలో! రూపాయలకు రూపాయలు వెదజల్లితే మంచివాళ్ళే! లేకపోతే మా కష్టాల్ని గుర్తించలేదంటూ సమ్మెలు చేస్తారు. ఇటువంటి వాళ్ళని... పది నిమిషాలక్కువ పది! ఆఫీసరు ఈ పాటికి వచ్చేసుంటాడు. ప్రవరాఖ్యుని కాలంలోని లేపనాలు ఇప్పుడుంటే ఎంత హాయి! అంచక్కా ఆఫీసుకు పోవచ్చు. ఆఫీసర్లాటి ఎండ. ఎడతెగని అతని కష్టాల్లాంటి రోడ్డు. ఈ రెంటి నుండీ సుబ్బారావు తప్పించుకోవాలి. ముచ్చి ముమ్మారుగా అని రిక్షాని కేకేశాడు. "అర్ధ రూపాయి" అన్నాడు వాడు. సుబ్బారావుకి ప్రపంచం ఇంకా సజావుగానే వుందన్పించింది. అమాంతం అతన్ని కౌగిలించుకోవాలని కూడ అన్పించింది. రిక్షా ఎక్కేశాడు. ఆఫీసులో ఆదరాబాదరాగా జొరబడుతూ రిక్షా అబ్బికి మరో పావలా అభినందనగా అదనంగా ఇచ్చి వెళ్ళిపోయాడు.

రిక్షావాడు సుబ్బారావు చేష్టలకి నవ్వుకొన్నాడు. సందు మలుపు ఆఫీసుకు అని చెప్పగానే అనుకొన్నాడు – అడిగిన సదరు వ్యక్తి పిచ్చివాడని. లేకపోతే

మలుపు తిరిగి చిటికేసే ఆఫీసుకదా! దానికి రిక్షా ఎందుకు? ఆ విషయం గాబరాలో సుబ్బారావుకి తెల్సిందికాదు, దారంతా నడిచినా.

శర్మ

# అనుమానం

**లా**యరు లక్ష్మీకాంతం మాటిమాటికీ ఇంట్లోకీ, ఆఫీసు గదిలోకి తిరుగుతున్నాడు. ఆయనకి అది అలవాటు. కోర్టుకు వెళ్ళినా అరగంటకోసారి ఇంటికి ఫోన్ చేసి పెళ్ళాం ఇంట్లోనే వుందని రూఢి చేసుకోపోతే మనసు నిలకడగా ఉండదు. కొన్ని నెలలుగా కేసులుకూడా తక్కువగానే వస్తున్నాయి. ఈ మధ్య లక్ష్మీకాంతానికి లక్షణంగా కాపురం చేసుకొనే భార్యాభర్తల మీద కోపం కూడా వచ్చింది. ఆలోచిస్తూనే అతని దృష్టి గేటు తోసుకువస్తున్న గోవర్ధనరావు మీద పడింది !

గోవర్ధనరావు లాయరుగారికి బాగా తెలుసున్నవాడే! వాళ్ళిద్దరూ బార్ లో ఒకే కుర్చీలో కూర్చుని ఒకే గ్లాసులో మందు కొట్టేంత దగ్గర స్నేహితులు. మరీ కావల్సినవాడవటంతో "కొంపదీసి వీడు వస్తున్నది విడాకుల కోసం కాదుగదా" అంటూ వృత్తి మర్యాదనే అవమానపరుచుకున్నాడు లక్ష్మీకాంతం.

గోవర్ధనరావు వచ్చీ రాగానే కుర్చీలో కూలబడి "నిన్న మా ఆవిడ అమ్మాయిని ప్రసవించిందిరా!" అన్నాడు దిగాలుగా.

"కూతురు పుట్టినంతమాత్రాన అలా ఏడుపు ముఖం పెడతారేమిటి?" స్నేహపూర్వకంగానే మందలించాడు లాయరు గారు.

"నాకు వెంటనే విడాకులు ఇప్పించెయ్యి" దీనంగా ఉంది గోవర్ధనం గొంతు.

"పొద్దున్నే వెధవ వేళాకోళం నువ్వూను" అన్నాడు లక్ష్మీకాంతం తాను లాయర్ననే మాట మరిచిపోయి.

"మొదట్నించీ నిర్మల వింతగానే ప్రవర్తిస్తోంది."

"అంటే...?"

"అదే! జీవిత భాగస్వామిని కదా అని దాపరికం లేకుండా నాకు అదివరకే



చిరుతిరుగుళ్ళ అలవాటుండని నిర్మలతో చెప్పాను"

"మంచిదేకదా !"

"మనలో మనం అపార్థాలు చేసుకోవటం నాకూ ఇష్టం ఉండదు ! అయినా మీకు ఇంకా సరిగా ముద్దు పెట్టుకోవటమే చేతకాదు అంది నిర్మల"

"ఈ పాయింటు మీద విడాకులు ఇవ్వరు"

"కొన్నాళ్ళు పోయాక నేను మోటుగా ప్రవర్తిస్తున్నాను అంది"

"ఈ కారణం కూడా బలంగా లేదు"

"నిన్న నిర్మలకి పురుడు వచ్చింది"

"ఇందాక చెప్పావుగా !"

"నీకు జ్ఞాపకం లేదా ! మా పెళ్ళై ఆరు నెలలు కూడా అవలేదు. లేడీ డాక్టరును అడిగితే ఈ రోజుల్లో ఆడవాళ్ళు పెళ్ళైన ఆరేడు నెలలకే తొలిసారి ప్రసవించేసున్నారనీ, తర్వాతసారి అలా జరగదనీ చెప్పింది. చాలా ఈ కారణం" అంటూ విసురుగా బయటకు వెళ్ళిపోయాడు గోవర్ధనరావు.

హేల

# స్నేహం

శేఖర్, శంకర్ ఇద్దరూ కొత్తగా కాలేజీలో జాయినయ్యారు. వాళ్ళిద్దరూ క్లాస్ మేట్స్, క్లాసులో బెంచీ మేట్స్, హాస్టల్ మేట్స్ వగైరా వగైరా కూడా! ఒకర్ని విడిచి ఒకొరుండకుండా అంటి పెట్టుకొని తిరుగుతున్నారు. స్నేహానికి నిర్వచనం మేమిద్దరమే అంటున్నట్టుగా వున్నారు. వారి త్రైబాయపు స్నేహానికి వయస్సు వారం కూడ లేదు. ఇద్దరి మధ్యా అరమరికలు వుండకూడదని శేఖర్ తన ప్రవర్తన, ప్రతాపం చెప్పుకు రాసాగాడు.

"ఉమెన్స్ కాలేజీలో రాధిక అనే అమ్మాయి ఉంది. చాలా అందంగా వుంటుంది. చూసీ చూడగానే ముద్దెట్టుకోవాలన్పిస్తుంది. ముఖ్యంగా సెక్సప్పీలు హెచ్చు. ఆ అమ్మాయి కోసం చాలామంది ట్రై చేస్తున్నారు. అదృష్టవశాత్తూ మొన్నా మధ్య ఆమెకూ, నాకు పరిచయం కలిగింది. అది ప్రణయంగా మారుద్దామనుకుంటున్నాను."

"పెళ్ళి చేసుకొంటావా" అడిగాడు శంకర్.

"నో నో ! పెళ్ళి గిళ్ళీ జాన్తానై ! పిచ్చిగా ప్రణయం పేరుతో స్వర్గాలు చూపిస్తాను. ఆనందాన్నంతా చవి చూసేసి నరువాత అపర దుష్యంతుడిలా నువ్వెవరివో నాకు తెలియదంటాను. ఇదో ఎడ్వెంచర్.

జీవితంలో థ్రిల్స్ కావాలి"



అన్నాడు శేఖర్. అని-"గురూ ! నువ్వు కూడా నిజాలు చెప్పాలి. నాగురించి ఏమనుకుంటున్నావో దాపరికాలు వద్దు"అన్నాడు. దానికి శంకర్ నవ్వుతూ—

"నీ లాంటి వాణ్ని ఆ అమ్మాయి ప్రేమించదు. ప్రేమించి శకుంతల కానే కాదు. అయినా ఇలాంటి గుణాలున్న వాడితో స్నేహం చేయడం మంచిది కాదు. బై ది బై రాధిక నా చెల్లెలు, గుడ్ బై!" అన్నాడు.

త్రినేత్రి

# లాయరు బుద్ధి

పుట్టి బుద్ధెరిగి లాయర్ లావణ్య అనారోగ్యాన్ని ఎపుడూ పొందలేదు. ఆశించలేదు కూడ. రాత్రి పూట నిద్ర పోయే ఆ కాసేపు తప్పా, ఆమెకు విశ్రాంతి అన్నది ప్రాక్టీసు పెరగడంతో లేకపోయింది. కాని, ఈ మధ్య హఠాత్తుగా వారం రోజులు జ్వరపడింది. ఏమి తిన్నా సహించలేదు. లేచి నడవలేదు. మరుగుతూన్న ఎసరు గిన్నెలా ఒళ్ళు



కాలిపోతూంది. భయం వేసిందామెకు. తాత్కాలిక ఉపశమనం కోసం ఎవరెవరో చెప్పిన మందులు వాడినా, ఏమీ తగ్గుముఖం పట్టలేదు. చివరికి డాక్టర్ ధర్మారావు వద్ద ట్రీట్‌మెంటు తీసుకోవాల్సి వచ్చింది.

ధర్మారావు ట్రీట్‌మెంటంటే మస్తుగా డబ్బుండాలి. హస్తవాసి అతన్ది మంచిదే అయి రోగం కుదిరినా- అతను చేసే బిల్లుకు, బిల్లు నిక్కచ్చిగా 'ఇంత' అన్చెప్పే అతని ధాటికి మళ్ళీ తిరగ తోడుతుంది జ్వరం. అల్లాటప్పాలాంటి వాళ్ళు అతని దగ్గరకు పోనేపోరు.

మరి లావణ్యకు తప్పింది కాదు. వరుసగా వారం రోజులు చికిత్స చేయించుకొంది. నయమైంది. ఆరోగ్యాన్ని పుంజుకొని పెండింగ్ వున్న కేసుల్ని ఫైసలా చేయసాగింది. ఆ వ్యాపకంలో పడి డాక్టర్ ఫీజు మరిచిపోయింది. అయితే, ఓ రోజు జ్ఞాపకం వచ్చి చాలా నొచ్చుకొంది. వెంటనే వెళ్ళాలనుకొంది.

డాక్టర్ ధర్మారావు లావణ్యను చూస్తూనే అగ్గి రుద్రుడయ్యాడు. "డబ్బు విషయంలో మీరెంత స్ట్రిక్టో నేనూ అంతేనండీ" అన్నాడు. "ఫీజు మరిచిపోతే ఎలా" అంటూ నాగరికంగా చీవాట్లేశాడు. అన్నీ విని లావణ్య పర్సు తీసి-

"ఇది జపాన్‌ది. మా వారు నాకు ప్రెజెంటు చేశారు. దీన్ని మీకు కానుకగా ఇస్తున్నాను" అంది. ధర్మారావుకు సందేహం వచ్చింది.

ఉత్తి పర్సేమోనన్పించి "బహుమతుల్తో వ్యాపారాలు సాగవండీ" అన్నాడు. యోచించే మతికాదని లావణ్య "మీ ఫీజెంత" అనడిగింది. "టూ హండ్రెడ్" అన్నాడు. నవ్వింది లావణ్య. పర్సు జిప్ లాగి అందు నుంచి అయిదు వంద నోట్లు తీసి, రెండు వందల్ని ధర్మారావు చేతికి అందించింది. మొహం వేలాడేశాడు డాక్టర్ -లాయరు బుద్ధి పోనిచ్చుకోని లావణ్యను చూసి.

కొండూరి కమలకుమారి

# ముప్పైయ్యారో బస్సు

కిళ్ళీ కొట్టు అప్పారావు ఆ ముసలాయన్ని ఉదయం ఏడు గంటల నుంచీ చూస్తున్నాడు. అతని చేతిలో ఓ సంచీ వుంది. అది చాలా బరువుగా కనబడుతూంది. ఏభై య్యేళ్లుండొచ్చేమో! పంచ కట్టుకొని, వదులుగా ఉన్న చొక్కా తొడుక్కొని, పాత నాటు చెప్పులతో పల్లెటూరివాడిలా కనబడుతున్నాడు. చేతిలో సంచీ, వచ్చిపోయే బస్సుల్ని పరీక్షగా చూసే అతని




చూపూ మరతన్ని ప్రయాణికుణ్నని పిస్తాయి. ఉదయం నుంచి ఇప్పటివరకూ చాలా బస్సులు వచ్చిపోయాయి. కాని, ఏ బస్సులోను ఎక్కే ప్రయత్నం చేయలేదతను. పోనీ ఎవరి కోసమైనా ఎదురు చూస్తున్నాడేమో అన్పించినా 'మరీ ఇంత సేపా!' అన్న సందేహం కలుగుతూంది.

పది గంటలయింది.

అప్పారావు కిళ్ళీ కొట్లో కూర్చుని బేరం చూసుకొంటూనే ముసలాయన్ని గమనిస్తున్నాడు. కూర్చున్న చోటునుంచి అతను లేచాడు. ఆత్రతత హెచ్చి 'ఎక్కడికి వెళ్తాడా?' అని చూశాడప్పారావు. నేరుగా ఆ వ్యక్తి కిళ్ళీ కొట్టు దగ్గరికొచ్చి రెండు పప్పుండలు కొనుక్కొని, యథాప్రకారం మళ్ళీ బైఠాయించాడు.

మరోసారి మళ్ళ రెండు పప్పుండలు కొనుక్కొన్నాడు. తిన్నాడు. అలా నాలుగైదుసార్లు జరిగింది. మధ్యాహ్నం రెండైంది.

ఇంతలో ముప్ఫయ్యారో నంబరు బస్సొచ్చి ఆగింది. కూర్చున్న చోటు నుంచి అతను లేచినించున్నాడు. బస్సు ఎక్కేస్తాడేమో అనుకొన్నాడప్పారావు. కానీ ఆ వ్యక్తి అదేమీ చేయలేదు. తిన్నగా కిళ్ళీకొట్టు దగ్గరికొచ్చి రెండు సోడాలు పట్టించాడు. పెద్దగా నిట్టూర్పొదిలి నిల్చున్నాడు. పీలు చిక్కిందని అప్పారావు "ఎక్కడికెళ్తాను? ఏ బస్సూ ఎక్కటం లేదు. ఉదయంనుంచీ చూస్తున్నాన"న్నాడు.

"మాది చాలాదూరం లెండి. పల్లెటూరు. మా అబ్బాయి ఈ ఊళ్ళో ఆఫీసరుద్యోగం చేస్తున్నాడు. ఇప్పుడేం పొలం పన్లులేక, ఊసుపోక అబ్బాయిని చూసిపోదామనొచ్చాను. మా వూరు వచ్చినపుడు అబ్బాయి చెప్పాడు- రైలు దిగి బస్సు స్టాండులో ముప్ఫైయ్యారో బస్సు ఎక్కి మా ఆఫీసు పేరు చెబితే చాలు! సరిగ్గా ఆఫీసు దగ్గరే దించుతారని. అందుకనే చూస్తున్నాను. ఇంతకు ముందొచ్చిన్దాంతో ముప్ఫై అయిదయినాయి. ఇంకొక్కటి. అదొస్తే వెళ్ళిపోతాను" అన్నాడతను పెద్ద ఊపిరి పీల్చుకొంటూ.

జె.ఎస్. పి. సాయిబాబు

Edited, Printed and Published by Ramoji Rao Ch. for Vasundhara Publications. Printed at Colorama, Offset Printers, Hyderabad. CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad - 500 004.




# ధనూరాశి

(నవంబరు 23 – డిసెంబరు 20)

## అచంచల ఆశావాదానికి సంకేతం

జీవితంలో మరెవరూ చవిచూడని
అందచందాలు వీరు చూస్తారు. ఎట్టి పరిస్థితులలోనూ
వారి పెదిమలమీద దరహాసం మాసిపోదు
ఆర్థిక భద్రత వారి ఆయుధం. అందుకే వారి జీవితం
ఆనందమయం.... బాండ్లని, బంగారంలాంటి
సెక్యూరిటీలనీ, మార్గదర్శి వారు మనస్ఫూర్తిగా విశ్వసిస్తారు.
అది సహజం. ధనూరాశి జాతకుల
సుందర స్వప్నాలను ఎన్నింటినో మార్గదర్శి నిజం చేసింది.
వివిధ చిట్‌ల ద్వారా అవసరమైనప్పుడు
ఆర్థిక సహాయం అందజేసింది.
అత్యుత్తమ సేవ... అదనులో చెల్లింపు... మార్గదర్శి ప్రత్యేకతలు.
పదకొండు శాఖలతో, పదివేలకు పైగా
సభ్యులతో అత్యున్నతమైన సంస్థగా
పదహారేళ్లయి నిలదొక్కుకుని ఉండడానికి అదే కారణం.




**మార్గదర్శి**
చిట్ ఫండ్ ప్రైవేట్ లిమిటెడ్
మార్గదర్శి హౌస్, ఆబిడ్ సెంటర్, హైదరాబాద్ - 500 001.

*డబ్బుకోసమైనా మీ చింత? మార్గదర్శి ఉన్నది మీ చెంత!*

Kiron-MCF